# చతుర

డిసెంబరు 2008

రూ.10/-

ప్రోత్సాహక బహుమతి పొందిన

ఎలికట్టె శంకరరావు

## దేవునిరాజ్యం

## వారెవ్వా!





అల్లరిగా, ముద్దుగా, బొద్దుగా వున్న ఈ బొమ్మలను చూస్తుంటే 'రాయినైనా కాకపోతిని లీ కుంచెను సోకగా'అని మార్చి పాడుకోవ లనిపిస్తోంది కదూ. అదేంటి, రాయి అంటు న్నారేంటని ఆశ్చర్యపోతున్నారా? నిజమండీ, రాతిపై రంగులను రంగరించే తైవాన్‌కు చెందిన 46 ఏళ్ల హెన్రీ లీ ఈ జంతువులకు కొత్త జీవాన్నిచ్చాడు. అతనికి పిల్లులన్నా, కుక్కలన్నా ఎంతో ఇష్టం. అందుకే అతని సృష్టిలో అవే ఎక్కువ.











# రచయితలకు సూచనలు



**నవ్యనవలా వేదిక 'చతుర'కు రచనలు పంపేవారు ఈ కింది సూచనల్ని గమనించాలి.**

★ చతురకు నవలలు పంపేవారు సామాజిక సమస్యలపై దృష్టి పెట్టాలి. హాస్య, వ్యంగ్య తదితర ఏ ఇతివృత్తమైనా ఎంచుకోవచ్చు. ఏ మాండలికమైనా రాయొచ్చు. వైవిధ్య కథా వస్తువులకు ప్రాధాన్యం ఉంటుంది. నవ్యతకే పెద్దపీట.

★ బొమ్మలు, వివిధ శీర్షికలు, ప్రకటనలు పోను 'చతుర' నవల అచ్చులో 80-85 పేజీలు ఉంటుంది. దీన్ని దృష్టిలో పెట్టుకుని రచయితలు తమ నవలల్ని అచ్చులో 85 పేజీలు మించకుండా రాసి పంపాలి.

★ ఒక పాత 'చతుర' సంచిక తీసుకుని అందులో ఉన్న నవలలో ఒకటి లేదా రెండు పూర్తి పేజీలను తమ దస్తూరితో రాసి చూసుకుని ఆ మేరకు తమ నవల రాతప్రతి ఎన్ని పేజీలలో రాయవచ్చో అంచనాకు రావడం సులభం. ఏదేమైనా అచ్చులో 80-85 పేజీలకు మించకుండా లేదా తక్కువ కాకుండా ప్లాన్ చేసుకుని పంపడం మంచి పద్ధతి.

★ ప్రచురణకు స్వీకరించని నవలలు/రచనలు తిప్పిపంపేందుకు వీలుగా స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవరు జతపరచడం మరువకండి. రాతప్రతులు పోస్టులో పోతే 'చతుర' బాధ్యత వహించబోదు.

★ స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవర్లు జతపరచని వారి రచనలు తిరస్కారానికి గురైతే ట్రాష్‌లోకి వెళ్లిపోతాయి. వాటి గురించి ఉత్తరప్రత్యుత్తరాలకు తావులేదు.

★ సాధారణంగా నవలలు కార్యాలయానికి అందిన 4 - 8 వారాలలోగా పరిశీలించి ప్రచురణార్హమైతే ఆ విషయం తెలియపరుస్తాం. కాకుంటే తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రచురితమైన ప్రతి నవలకు రూ. 6000/- పారితోషికం ఉంటుంది. నవల ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటి వారంలోనే పై మొత్తానికి రచయితకు చెక్కు అందుతుంది.

★ 'కొత్తగాలి' శీర్షికకు చిరుకవితలు పంపేవారు నాలుగు/ఐదు పంక్తులు మించకుండా పంపాలి. స్పార్క్‌కే మార్కు అన్న విషయం గుర్తించాలి.

**చతుర**

**చిరునామా :**

**ఎడిటర్, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్-500082**

# చతుర

సంపుటి -31
సంచిక - 11
డిసెంబరు 2008
371వ సంచిక



సేకరణ : ఎం.కావ్య

ముఖచిత్ర ఛాయాగ్రాహకుడు:
దిలీప్ బెనర్జీ (కోల్‌కతా)

ముఖపత్రాలంకరణ : రాజుయాట



దేశానికి
అన్నం పెట్టే రైతన్న
అతను!
ఇంటిల్లిపాదీ రెక్కలు
ముక్కలు చేసుకున్నా
పట్టెడన్నానికి నోచని
నిర్భాగ్యుడతను!!
ఎవరినోచూసి
పంటమార్పిడి చేశాడు..
ఫలితం అనుభవించాడు
చతుర
నవలల పోటీలో
ప్రోత్సాహకబహుమతి
పొందిన

**ఎలికట్టె శంకరరావు**

## దేవునిరాజ్యం

14 వ పేజీలో

బొమ్మలు:
భాస్కర్



తాజా ఆకుకూరలు, క్యారెట్లు విరివిగా వాడాలి. చర్మ, కంటి రక్షణకు ఇవి అత్యవసరం. ఆహారంలో ఎ విటమిన్ తప్పకుండా ఉండేలా చూసుకోవాలి.

# అందాల నెలవంక ప్రియాంక

**అందానికే అందం ఇరవయ్యారేళ్ల ఆ భామామణి! 2000 సంవత్సరంలో ప్రపంచసుందరి కిరీటం సాధించి సంచలనం సృష్టించిన ఆమె తొలుత తమిళ తెరంగేట్రం చేసినా తర్వాత కాలంలో బాలీవుడ్ వెండితెరపై జిగేల్మంటూ మెరిసింది. గొప్ప గొప్ప విజయాలు సాధించి ప్రేక్షకుల కలల సుందరిగా నిలిచిపోయింది. తన అత్యుత్తమ నటనతో ఎన్నో అవార్డుల్ని కూడా సొంతం చేసుకుంది. అవును... అక్షరాలా ఆమె మీ మదిలో మెదిలే మెరుపుతీగ ప్రియాంక చోప్రాయే! ఆ ఉత్సాహకెరటం తన ఆరోగ్య, సౌందర్య రహస్యాల్ని వివరిస్తోందిలా..**

★ లెఫ్టినెంట్ కల్నల్‌గా పనిచేసిన డాక్టర్ అశోక్ చోప్రా కూతుర్ని కావడంతో చిన్నప్పటినుంచి క్రమశిక్షణగా పెరిగాను.

★ సమయపాలనకు విలువివ్వడమే నా విజయాలకు కీలకమని నూరుశాతం నమ్ముతాను.

★ మనచర్యలకు, వాటి పర్యవసానాలకు బాధ్యత మనదే. మన ఆరోగ్యం, అందచందాల విషయంలో కూడా నా భావన అదే. అదంతా మన చేతుల్లోనే ఉంటుంది.

★ దీనికి సంబంధించి మనం నేర్చుకోవాల్సిన తొలిపాఠం జీవితంలో ఆత్మవిశ్వాసాన్ని ఎప్పుడూ కోల్పోకూడదు. క్లిష్టపరిస్థితులు ఎదురైనా తట్టుకుని నిలబడాలి.

★ నా విషయానికి వస్తే రోజూ క్రమం

తప్పకుండా కనీసం గంటసేపు వ్యాయామం చేస్తాను. ఏరోబిక్స్, యోగా చేస్తాను. అన్నింటికీ మించి ధ్యానం.. ఇది నాకేకాదు.. నేటి జీవితంలో ఎవరికైనా అత్యవసరం.

★ నోటి పరిశుభ్రత, దంత సౌందర్య పరిరక్షణ వంటి విషయల్లోనూ రాజీపడొద్దు. మిఠాయిలు, గ్యాస్‌తో కూడిన శీతల పానీయాల్ని వీలైనంత వరకూ తగ్గించండి. మంచి టూత్‌పేస్టునే వాడండి.

★ తాజా ఆకుకూరలు, క్యారెట్లు విరివిగా వాడాలి. చర్మ, కంటి రక్షణకు ఇవి అత్యవసరం. ఆహారంలో ఎ విటమిన్ ఉండేలా చూసుకోవాలి.



★ సమతులాహారం అవసరం. ఆకుకూరలు, కాయగూరలతోపాటు తాజాపండ్లు ప్రతిరోజూ మన ఆహారంలో భాగం కావాలి.

★ మూడురోజులకోసారి తలస్నానం చేయాలి. కెమికల్ షాంపూలు వద్దు. వారానికోసారి కొబ్బరి నూనెతో తలపై మసాజ్ చేయించుకోవాలి. దీనికి గుడ్లు, పెరుగును వాడవచ్చు. ఆరువారాలకోసారి వెంట్రుకల్ని ట్రిమ్ చేయించుకోవాలి.

## నా అలవాట్లివే..

★ ప్రతిరోజూ ఉదయం కూరగాయలతో తయారుచేసిన జ్యూస్ తాగుతాను.

★ ఉదయం అల్పాహారంగా పండు లేదా పాలు/రెండు కోడిగుడ్లు తీసుకుంటాను.

★ భోజనంలో సలాడ్, చపాతీలు, చికెన్ తింటాను.

★ సాయంత్రం పండ్లు తీసుకుంటాను. చెర్రీ, మామిడి పండ్లంటే నాకిష్టం.

★ రోజుకు మూడు నాలుగు లీటర్ల నీరు తాగుతాను.

★ సాధ్యమైనంతవరకూ మసాలా, నూనెతో తయారైన పదార్థాల జోలికి పోను.

★ వీలైనంత వరకూ ఇంటి భోజనానికే ప్రాధాన్యం ఇస్తాను. ఆదివారం కూడా సాధారణ రోజులాగే ఆహారం తీసుకుంటాను. అన్నిటికీ మించి రోజుకు దాదాపు 19 గంటలూ బిజీగా ఉంటాను.

★ వెల్లుల్లి రెబ్బలు, తాజా ఎర్రగడ్డలు నేను తీసుకునే ఆహారంలో తప్పకుండా ఉండేలా జాగ్రత్తపడతాను.

★ నూడుల్స్, చేపలు, రొయ్యలు కూడా తింటుంటాను.

★ ఎప్పుడో అరుదుగా తప్ప జంక్‌ఫుడ్, చిరుతిళ్లు తీసుకోను. వాటికి వీలైనంత వరకూ వీడ్కోలు చెప్పడం మంచిది.

★ పప్పు ధాన్యాలు, ఇతర గింజల మొలకల్ని తింటుంటాను.

★ ఏది చేసినా ఏది తిన్నా అతి సర్వత్రా వర్జయేత్ అనే విషయాన్ని దృష్టిలో పెట్టుకోవడం నా ఆరోగ్య రహస్యం.

– కేఆర్‌జీ

## అపార్ట్‌మెంటాలజీ-11

# శంకరమూర్తి... కారు రిజిస్ట్రేషన్



**యర్రంశెట్టి సాయి**

**మా** అపార్ట్‌మెంట్ సొసైటీ వాళ్ళం దరం అంతకు ముందురోజే శంకరమూర్తి కొన్న సెకండ్‌హాండ్ కారు చుట్టూ మూగాం.

"అబ్బ! చాలా బాగుంది గురూ! ఇంచు మించుగా కొత్త కారు లాగుంది" అన్నాడు విజయ్ యాదవ్

"ఎంతక్కొన్నావ్? "

"లక్షన్నర-"

"నువ్ కారు కొన్నందుకు పార్టీ ఎప్పుడి స్తయ్? " అడిగాడు హమీద్ మియా.

"ఇప్పుడంటే ఇప్పుడే ఇస్తయ్" అన్నాడు శంకర్‌మూర్తి ఉషారుగా.

"ఇంక ఆలస్యం ఎందుకు భయ్- ఛలో జాయేంగే" అన్నాడు మొహీందర్ సింగ్. అందరూ కార్లో కూర్చుగానే - శంకరమూర్తి డ్రైవింగ్ చేయటం మొదలుపెట్టాడు. మధ్య మధ్యలో స్కూటర్ వాళ్ళనూ తిడుతు న్నాడు శంకరమూర్తి-

"ఛ! ఈ స్కూటర్ వాళ్ళు, మోటర్ సైకి ల్‌వాళ్ళు పెద్ద న్యూసెన్స్ అనుకో! చూడండి- ఎట్లా అడ్డ దిడ్డంగా డ్రైవ్ చేస్తు న్నారో? - ఇలాంటి వాళ్ళకు హెవీ ఫైన్స్ వేస్తేగానీ ట్రాఫిక్ డిసిప్లిన్ ఉండదు" అంటోంటే అందరం ఆశ్చర్యపోయాం. ఎందుకంటే అంతకు ముందురోజువరకూ శంకరమూర్తి కూడా స్కూటర్ మీదే వెళ్తూండేవాడు.

పైగా కార్లవాళ్ళనూ, బస్‌లవాళ్ళనూ తెగ తిడుతూండేవాడు.

"వాడు చూడండి! కారు ఎంత రాష్‌గా డ్రైవ్ చేస్తున్నాడు! ఆ బస్ చూడండి! వీళ్ళందర్నీ షూట్ చేయాలి నన్నడిగితే! వీళ్ళవల్లే ట్రాఫిక్ జామ్స్. అసలు- కొన్ని రోడ్స్‌లో కార్లు, బస్‌లు బాన్ చేయాల సలు-" ఇలా ఉండేదతని ధోరణి. ఆ మాటే కామెంట్ చేశాడు విజయ్‌యాదవ్.

"అబ్బే నేను ఇవాళ కారు కొన్నానని స్కూటర్ వాళ్ళను తిట్టటం కాదు. నేను మొదటి నుంచీ అబ్జర్వ్ చేస్తూనే ఉన్నా కదా! స్కూటర్ వాళ్ళదే తప్పంతా! కామన్ సెన్స్ ఉండదు-"

మేమింకేం మాట్లాడలేదు.

కారు కాస్త దూరం వెళ్ళిందో లేదో ఎదు రుగ్గా ట్రాఫిక్ కానిస్టేబుల్ కారుకి అడ్డంగా నిలబడి ఎంతో ఆనందంతో పొంగిపోతూ కారు పక్కకు ఆపమని సైగలు చేశాడు. ఆ

కానిస్టేబుల్ మొఖంలో వెలిగిపోతున్న ఆనందం, ఆ చిరునవ్వూ చూస్తే- అతను శంకరమూర్తి బంధువేమో అన్న అనుమానం కలిగింది. అదే శంకరమూర్తి నడిగితే-

"బంధువు కాదు- పాడూ కాదు- రోటీన్ చెకింగేమో!" అంటూ కారు ఇన్‌స్పెక్టర్ దగ్గర ఆపాడు. కానిస్టేబుల్ ఇన్‌స్పెక్టర్ చెవిలో ఏదో చెప్పాడు. ఇన్‌స్పెక్టర్ నెంబర్ ప్లేట్ వంక చూశాడు.

"ఏవీ కారు పేపర్స్ ఇవ్వండి! ఆర్టీఏ పేపర్స్, డ్రైవింగ్ లైసెన్స్ ఇన్సూరెన్స్... అన్నీ..."

బోర్డ్‌లో నుంచి అన్నీ తీసిచ్చాడు శంకరమూర్తి.

"నేనడిగింది కర్నాటక స్టేట్ రిజిస్ట్రేషన్ పేపర్స్ కాదయ్యా! ఆంధ్రా రిజిస్ట్రేషన్ పేపర్స్ ఏవి? "

"ఇది కర్నాటకలో నిన్నే కొన్నానండీ! ఇవాళ ఆదివారం కదా! రేపు ఇక్కడ ఆర్టీఏలో రిజిస్ట్రేషన్ చేయిస్తాను-"

"ఇదిగో చూడు మిస్టర్! అతితెలివి చూపించకు! నేను ఇవాల్టి సంగతి మాట్లాడుతూంటే నువ్ రేపటి సంగతి మాట్లాడతావేంటి? కారు హైదరాబాద్‌లో రిజిస్ట్రేషన్ చేయించకుండా రోడ్ మీదకెందుకు తెచ్చావూ అని అడుగుతున్నా-"

"అదే చెప్తున్నాడు కద్సార్- రేపు చేయిస్తానని! ఇవాళ ఆదివారం ఆఫీస్ ఉండదు కదా!" అన్నాడు విజయ్ యాదవ్ కల్పించుకుంటూ ఇన్‌స్పెక్టర్ అతని వంక ఒక పురుగుని చూసినట్లు చూశాడు.

"ఏయ్-నువ్వెవరు? "

"నా పేరు విజయ్ యాదవ్! రామ్‌భరోసా అపార్ట్‌మెంట్స్ ఆర్గనైజింగ్ శెక్రటరీని!"

"అయితే నీ అపార్ట్‌మెంట్స్‌లో



మాట్లాడు! ఇక్కడెందుకు మాట్లాడుతున్నావ్-" అనేసరికి విజయ్ సైలెంటయిపోయాడు.

ఇన్‌స్పెక్టర్ వెంటనే రసీదు బుక్ తీశాడు. "రెండొందలయాభయ్ కట్టండి!" అన్నాడు.

అందరం షాకయ్యాం!

"రేపు రిజిస్ట్రేషన్ చేస్తానని చెప్తున్నయ్ గద్సార్! ఏక్ దిన్‌కే వాస్తే ఫైన్ క్యుం దాల్ రహే హై? " అన్నాడు హమీద్ మియా.

"ఏయ్- నువ్వెవరు? " కోపంగా అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"నన్ను ఏయ్ అంటయ్? మై కోన్ హై మాలూమ్? రామ్‌భరోసా అపార్ట్‌మెంట్స్ ప్రెసిడెంట్ హు! క్యాసమజ్ రై!" అన్నాడు హమీద్‌మియా మండిపడుతూ.

ఇన్‌స్పెక్టర్ ఇంకా పేట్రేగిపోయాడు.

"ఇగో- సిక్సలెవెన్" అంటూ కానిస్టేబుల్ని పిలిచాడు.

అప్పుడే లారీ క్లీనర్ అందించిన పది నోటు జేబులో పెట్టుకుంటున్న కానిస్టేబుల్ "సార్" అంటూ పరుగుతో వచ్చాడు.



"వీళ్ళనూ- ఈ కార్‌ని స్టేషన్‌కి తీసుకు పద-" అనేసి తన మోటర్‌సైకిల్ ఎక్కి స్టార్ట్ చేయబోయాడు.

అప్పుడు అర్థమయింది పరిస్థితి మాకు. "మనం పోలీసులతో ఎక్కువ మాట్లాడగూడదు- మాట్లాడితే ఫైన్ పెరిగిపోతుంది" అన్నాడు శంకరమూర్తి.

"అట్లని కాద్సార్! ఏదో మంచిగ మాట్లాడితే ఇడుస్తారుగానీ కానూన్ మాట్లాడితే- ఎట్లా సార్- రెండొందలివ్వండి! నేను సార్‌కి చెప్తా-" అన్నాడు కానిస్టేబుల్ ఫ్రెండ్లీగా.

శంకరమూర్తి వెంటనే రెండొందలు తీసి అతనికిచ్చాడు

"ఓకే సార్- వెళ్ళిపొండి" అన్నాడు కానిస్టేబుల్.

"మరి రసీదు? " అడిగాడు శంకరమూర్తి.

"రసీదా! రసీదెందుకు సార్? నేను యాభై తగ్గించిందెందుకు? "

"ఏమయింది? మూడొందల యాభయ్ కలెక్ట్ చేశారా" అరిచాడు ఇన్‌స్పెక్టర్.

మేము ఉలిక్కిపడ్డాం.

"మూడొందల యాభయ్యా? "

"రసీదు కావాలంటే మూడొందల యాభయ్ కట్టాల్సిందే-" అన్నాడు కానిస్టేబుల్.

"మేము 'అంగూఠా'గాళ్ళం కాదయ్యా! గవర్నమెంట్ సర్వెంట్స్! రసీదు లేకుండా ఒక్క పైసా కూడా కట్టం-" అరిచాడు శంకరమూర్తి.

ఇన్‌స్పెక్టర్ పర్రున రసీద్ చింపి మాకిచ్చాడు.

అందులో నాలుగొందలు రాశాడు.

కాసేపు వాగ్వివాదం చేసి, చివరకు నాలుగొందలు ఫైన్ కట్టాం. దాంతో అందరికీ మూడ్ పాడయిపోయింది.

"ఇంక ఇంటికి పోదాంలే- దారిపొడుగుతా ఈ పోలీసులు మనల్ని చిత్రవధ చేస్తారు- రేపు ఆర్టీఏలో రిజిస్ట్రేషన్ చేయించుకున్నాక అప్పుడు పార్టీ చేసుకుందాంలే" అన్నాడు విజయ్‌యాదవ్.

మర్నాడు నేనూ శంకరమూర్తి ఆర్టీఏ ఆఫీస్‌కి బయల్దేరాం. ఎంక్వయిరీ కౌంటర్ దగ్గర జనం తిరణాల్లా మూగి ఉన్నారు. ఆర్టీఏ ఇన్‌స్పెక్టర్ సెల్‌ఫోన్లో ఎవరితోనో మాట్లాడుతున్నాడు.

"తెల్లాపూర్ ప్లాట్‌కి ఎనిమిదిలక్షలు ఎక్స్ట్రా అడుగుతున్నాడా? ఏం ఫర్లేదులే- కోటిరూపాయలు కట్టినవాడిని- ఇంకో ఎనిమిది లక్షల కోసం భయపడతానా? రింగ్ రోడ్‌మీద ఓనెల నైట్ చెకింగ్ చేస్తే పది లక్షలు ఎక్కడికీ పోదు-" అతని సంభాషణ ఎంతకూ తెగటంలేదు. వళ్ళుమండి నేను కట్ చేయడానికి ట్రై చేశాను.

"హలో- మీరుంది మాకు ఇన్‌ఫర్మేషన్ ఇవ్వడానికా- ఫోన్లో ప్లాట్ల గురించి మాట్లాడ్డానికా? " అన్నాను.

ఇన్‌స్పెక్టర్ నావేపు కోపంగా చేశాడు.

"ఏయ్- అవసరముంటే ఎంతసేపయినా వెయిట్ చేయాలి. లేకపోతే ఫో ఈడకెళ్ళి" అంటూ దబాయించి మళ్ళీ సంభాషణలో లీనమయిపోయాడు.

అప్పుడే ఓ వ్యక్తి వచ్చాడు మా దగ్గరకు చిరునవ్వుతో-

"సార్! మీ కర్నాటక బండికి ఆంధ్రా రిజిస్ట్రేషన్ చేయిస్తా సార్! మాకు అయిదువేలిస్తే మొత్తం నేనే చూస్కుంటా! గవర్నమెంట్ ఫీజ్‌లు మీరే కట్టుకోవాలి-" అన్నాడు ఆప్యాయంగా.

"నువ్ బ్రోకర్‌వా? "

"అవున్సార్-"

"మేమెవరో తెలుసా? ఎడ్యుకేటెడ్- పైగా గవర్నమెంట్ ఎంప్లాయీస్- ఈ ప్రొసీజర్లన్నీ మేమే చేసుకోగలం! 5 వేలు వేస్ట్" అన్నాడు శంకరమూర్తి.

"సరే మీ ఇష్టం! తర్వాత మళ్ళీ నా దగ్గరకొస్తే ఆరువేలు ఇవ్వాల్సివస్తుంది-"

"మేమేం పాగల్‌గాళ్ళమా- నీ దగ్గరకు రావడానికి? "

"వస్తారనేకదా- ఇన్నిసార్లు చెప్తోంది-"

"ఛస్తే రానుకదా!"

"చచ్చినవాడు కూడా మా దగ్గరకు రావాల్సిందే సార్-"

బ్రోకర్ వెళ్ళిపోయాడు.

ఇన్‌స్పెక్టర్ మాట్లాడటం ఆపాడు-

"ఇదిగో- చూడండి! నేను కర్నాటకలో కారు కొన్నా-"

"కర్నాటకలో కాకపోతే బంగ్లాదేశ్‌లో కొను - నాకెందుకు చెప్తున్నావిదంతా? రిక్షావాడు కూడా కారు కొంటున్నాడీరోజుల్లో-" చిరాగ్గా అన్నాడు ఇన్‌స్పెక్టర్.

శంకరమూర్తికి వళ్లు మండిపోయింది.

"చూడు మిస్టర్! నేను గొప్పలు చెప్పుకోడానికి రాలా! నా కారు కర్నాటకా రిజిస్ట్రేషన్ ఆంధ్రా రిజిస్ట్రేషన్‌కి మార్చాలి-" అన్నాడు కోపంగా.

"మార్చుకో- ఎవరొద్దన్నారు!"

"ప్రొసీజర్ మీరు చెప్పాలికదా? "

"నేనిక్కడుంది ప్రొసీజర్లు చెప్పడానిక్కాదు-"

"మరిదేనికున్నట్లు? "

"ఎవరే కౌంటర్‌కెళ్ళాలో చెప్పడానికి-"

"మరి నాకు చెప్పవేం? "

"నువ్వడగవేం? "

"ఇప్పుడడిగాగా? "

"కౌంటర్ నెంబర్ సిక్స్-"

శంకరమూర్తి, నేనూ ఆరోనెంబర్ కౌంటర్ దగ్గరకెళ్ళాం. క్యూలో మా టర్న్ వచ్చాక శంకరమూర్తి వివరాలు చెప్పాడు.

"నా కారుకి ఇప్పుడు ఆంధ్రా రిజిస్ట్రేషన్ చేయాలి-"

"ఫామ్స్ ఏవీ? "

మేము మొఖాలు చేసుకున్నాం "ఫామ్స్ ఏమిటి? "




"రిజిస్ట్రేషన్‌కి ఫామ్స్ ఫిలప్ చేయాలి కదయ్యా! నెక్స్ట్!"

"మాకు మరో ఫామ్స్ ఇవ్వరేం? "

"మా దగ్గరేందుకుంటాయ్? "

"మరెక్కడుంటాయ్? "

"విషయం ఎంక్వయిరీలో అడుగు-"

"మేము ఎంక్వయిరినుంచే ఇక్కడికొచ్చాం-"

"ఇక్కడినుంచి మళ్ళీ ఎంక్వయిరీ కెళ్ళండి-"

"అట్నుంచి ఇటూ- ఇట్నుంచి అటు- మేమేం గాడిదల్లాగా కనబడుతున్నామా? "

"ఆ ఇన్‌ఫర్మేషన్ కూడా ఎంక్వయిరీలోనే కన్‌ఫర్మేషన్ చేసుకోవాలి? "

"మీ ఆఫీస్ కొచ్చినోడికి ముందు బీపీ వస్తుంది"

బ్రోకర్ చిరునవ్వుతో మా దగ్గరకొచ్చాడు.








"కరెక్ట్ సార్! ముందు బీపీ సెకండ్ స్టెప్‌లో డిప్రెషన్-" మేము వాడిని లెక్క చేయకుండా మళ్ళీ ఎంక్వయిరీ దగ్గర కెళ్ళాం.

"ఆంధ్రా రిజిస్ట్రేషన్‌కి ఫిలప్ చేయాల్సిన ఫామ్స్ ఇక్కడే ఉంటాయట కదా!"

"ఉండవని ఎవరన్నారు? " ఇన్‌స్పెక్టర్ కోపంగా అడిగాడు.

"ఉంటాయని మీరనలేదుగా? "

"ఉండవని కూడా అనలేదుగా"

"చూడండి- నేను ఆర్గుమెంట్స్ చేయడానికి రాలా!"

"నేను అందుకే వచ్చానా? "

"ఇంతకూ ఫామ్స్ ఇస్తారా, లేదా? "

"అదేం కనబట్టంలా- అతనిస్తాడు"

మేము ఫామ్స్ తీసుకుంటూంటే బ్రోకర్ వచ్చాడు మళ్ళీ.

"మొదటి స్టెప్ బీపీ సార్ - సెకండ్ స్టెప్ డిప్రెషన్-

"నువ్వెన్నానా చెప్పు! డిప్రెషన్ వచ్చినా ఒకే! బ్రోకర్స్‌ని మేము ఛస్తే ఎంకరేజ్ చెయ్యం-" ఆవేశంగా అన్నాన్నేను-

"మీ ఖర్మ సార్"

మేము ఫామ్స్ కొనుక్కని ఫిలప్ చేసుకుని మళ్ళీ కౌంటర్ నెంబర్ సిక్స్ కెళ్ళాం!

"ఇవి కర్నాటక ఆర్సీ బుక్స్ -ఇది ఇన్సూరెన్స్ - ఇవి ఫిలప్ చేసిన ఫామ్స్-" అంటూ అన్నీ క్లర్క్‌కి అందించాడు శంకరమూర్తి.

"రేపు మాణింగ్ తీసుకురండి"

"అదేంటి? ఇప్పుడెందుకు తీసుకోరు? "

"ఇది లంచ్ టైమ్-"

"పన్నెండున్నరకే లంచా? "

"మీ టైమ్‌రాంగ్- మా గడియారంలో ఒంటి గంటయింది-"

"మీ క్లాక్‌ని రిపేర్ చేయించాలి-"

"260 ఇవ్వండి- చేయిస్తాం!"

"నేనెందుకిస్తాను? "

"ఇంకోసారి టైమ్ గురించి కంప్లెయిన్ చేయాలంటే ఇవ్వాలి-"

"ఈ పేపర్స్ తీసుకున్నాక లంచ్ చేయవచ్చుకదా! అయిదు నిమిషాలు ఆలస్యమయితేనేం"

"మీరు రేపొస్తేనేం? "

"చూడు మిస్టర్! నేను ఎడ్యుకేటెడ్ సిటిజెన్‌ని! నీ వ్యవహారం ఇప్పుడే ఆర్టీఏ గారికి కంప్లెయింట్ చేస్తా"

"దానికయినా రేపే రావాలి? మా బాస్ అరగంట కిందటే లంచ్‌కెళ్ళారు-"

"పన్నెండింటికే లంచ్ చేస్తారా? "

"షుగర్ పేషెంట్! ప్రతి అరగంటకి లంచ్ చేస్తారు-"

"మరి ఆఫీస్ పనెప్పుడు చేస్తారు? "

"బిడ్డ బిడ్డకీ మధ్య ఎడం లాగా- లంచ్‌కి లంచ్‌కీ మధ్య ఎడం ఉంటుంది కదా! అప్పుడు"

"అంటే మీరు వారానికి మూడు గంటలే వర్క్ చేస్తారన్నమాట"

"వారమంతా కాదు! సెకండ్ సాటర్‌డే, సండే హాలీడేస్-"

మిగతాది వచ్చేనెల... ©

# దేవుని రాజ్యం



రూ. 8,000/-
ప్రోత్సాహక
బహుమతి
పొందిన
నవల

'శీనూ నీకింకా తెల్వదు. మా చిన్నప్పట్నుంచీ గద్దెనెక్కిన ప్రతోడు
ఈ పథకాలు పెడతనే ఉండు. ఎవడన్నా బాగుపడ్డాడా?
ఇంతెందుకు? ఇందిరమ్మ గరీబీ హటావో అని గద్దెనెక్కింది.
ఎంతమంది గరీబుగాండ్లు బాగుపడ్డరు? గరీబీగాండ్లను
ఈ సర్కారోడు బాగుపర్సడు. అసలానికి ఆ కోరికే ఉండదు.
ఇప్పుడు దేశంలో పేదరికం తగ్గుతుంది అంటుండ్రు.
నిజమే కూటికిలేనోళ్లంతా ఉరిబోసుకుని సావడం వల్ల'

ప్రజలెన్నుకున్న సర్కార్ల పనితీరును అక్షర చురకత్తులతో
తుత్తునియలు చేసిన ఎలికట్టె శంకరరావు **దేవుని రాజ్యం**
ఈనెల చతుర సమర్పణ!

'ఓ జల్లు కురిసింది. అడ్డేలు మందం పదునయింది. పైన మబ్బులు తారాడుతున్నయ్. ఇయ్యాల్లో రేపో ఇంకో జల్లు పడితె ఇత్తనాలేద్దాం. ఏం వున్నయో ఏం లేవో ఆ ఇత్తనాల గింజల సంగతి చూడమ్మా'

నారాయణ సద్దరొట్టెమీద చింతకాయ తొక్కేసుకొని తినుకుంట అన్నడు.

గుండు చెంబుతో మంచి నీల్లు పట్టుకొచ్చిన కమలమ్మ దాన్ని భర్త పక్కన పెట్టి ఎదురుంగ కూసుంది.

'నీకు ఎర్కలేని ఇత్తనాలేమున్నవయా? ఓ రొండు మానకలన్ని సద్దలు, నాల్గు మానకలన్ని జొన్నలు. అయ్యి తప్ప ఇత్తు లేదు ఇంట్లె భూమిలేస్తందుకు. గాగిన్ని గింజలు ఏ ముక్కులకొస్తయ్' కమలమ్మ ఎడమచేయి ఆడించుకుంట ఆడించుకుంట చెప్పి రొండు చెంపలమీద ఏల్లేసుకుంది. ఇత్తనాల సంగతి నారాయణకు కూడ తెలుసు. ఆయనకు ఎర్కలేని ఇత్తులు యాన్నించి వొస్తయ్. పంట వొచ్చినప్పుడే అన్ని గట్టి గింజలు పక్కకు తీసింది కమలమ్మ. అంతంత మాత్రం గింజలు పొద్దుగల్ల ఒకాసారి మాపటీలు రొట్టెలకే వాడుతుంౖడి.

భర్త రొట్టెలు నమిలి నమిలి తింటుంటె కమలమ్మ మనసు చివుక్కుమన్నది. ముప్పూట తెల్లబియ్యం అన్నంతినే రాత లేదాయె గదా అనుకుంది. అయినా పొలం లేనోడికి బియ్యం యాన్నించి వొస్తయ్. కొనుక్కొని తినే రాతలా? అప్పుడో ఇప్పుడో ఆ సర్కారోడు ముక్కిపోయిన కోపన బియ్యం ఇయ్యబటికి ఇంట్లె తెల్ల బియ్యం అన్నం. లేకుంటె ముప్పూట గట్కేకాదు. ఆ గొడ్లకు పెట్టే బియ్యానికి కూడ ఆ డీలరు ముండాకొడుకు మూడు చెరువుల నీల్లు తాపిస్తుండె ఇయ్యటానికి. దినాం ఆ గట్క తినలేకనే రొట్టెలు చేస్తుంది. అదీ అవడాల పిల్లలు రమ, ఉమ ఉండబట్కి సరిపాయె. లేకపోతె తను చేసేదా అంత ఓపిగ్గా ఆ రొట్టెలు అనుకుంది.

'అయ్యో మర్సిపోయిన- ఓ రొండు పిడికిల్ల గోగిత్తులు, ఓ పిడికెడన్ని దోసిత్తులున్నయ్' అన్నది కమలమ్మ.

నారాయణ మొకంలో సంబూరమనేది లేదు. గుండు చెంబుతో రొండు బుక్కల నీల్లు తాగిండు. రుమాలు గుడ్డతోని మూతి తూడ్సుకొని అట్టనే ఎన్కరోకు మొగురం దాపుకు జారగిలబడ్డడు.

అప్పటికి పేగు సల్లబడ్డా నారాయణ మనసు మనసుల లేదు. ఎవుసాయం తల్సుకుంటేనే గుండెదడ బుడుతుంది. నలుపైయేండ్ల వొయిసు. పది పన్నెండేండ్ల పిలగాని సంది యవుసాయంలకొంగిండు. శిడం తీరికలేదు దమ్మిడి ఆందాన్ లేదు. ఇంకో పని చేద్దామంటె ఎటు బోతడు. ముగ్గురు పిల్లలు. మొగపిలవాడు పోయి నేడే పదయిపోయి నల్లగొండ కాలెజీల శెరీకయిండు. ఆడు సదువుకొని ఆని తోవ ఆడు సూసుకుంటడేమో అంటె అది వొట్టి దేనాయే. ఏమయ్యిందో ఏం పాడో నేను నీకు ఎవుసాయంల ఆసరైత నాయినా అని సదువు వొదిలిపెట్టిండు. కాలం చూడబోతె కంటిమీద కునుకు పడతలేదాయె.

'ఏందయా ఒక్కసారె ఏదో మనాదిల బడ్డట్టు బడితివి' కమలమ్మ మాటకు నారాయణ తేరుకొని సక్కగ కూసుండు.

'అయిటి శినుకుకోసం ఎదురుసూసి ఎదురుసూసి కండ్లు కాయలు కాస్తుండె. చినుకు కోసం ఎదురు సూసుడంటె ఒంటె పెదవుల కోసం నక్క ఎదురు సూసినట్టే నాయే. సొంతం అదును తప్పినంక ఓ తెప్పపడె. ఈ పుణ్యాత్ముల కాలంల ఆ శినుకులు కూడ గగనమే. భూమి తప్ప

బువ్వదారి ఎర్రనోల్లం. ఇత్తనాలు తయారు చేసుకుంటాం? ' అంటూ నారాయణ లేసి గోడవారకానిచ్చిన నులకమంచాన్ని వాల్సిండు. పైగుడ్డతోని నుల్కమీద రొండు దెబ్బలు జాడిచ్చి ఏసి కూలబడ్డడు.

కమలమ్మ ఇంకోమాట రాక కూసుంది. పడ్డా పడకున్నా శినుకును నమ్ముకోవ ల్సిందే గదా అనుకుంది.

నారాయణ కమలమ్మోల్లకు నాలుగెక రాల ఎర్కశల్క ఉంది. ఇంతో అంతో సత్తువ గల్ల నేలే. ఎటొచ్చి వానలు పడక, పంటలు పండకనే గోస. అంతకుముందు సొంతం సద్దలు జొన్నలేస్తోల్లు. నాలుగ్గై దేండ్ల ఒట్టి శెనక్కాయలేస్తుంద్రు. అది యాడాది రొండేండ్లు అక్కరొచ్చినా ఆ తర్వాత అప్పుల పాలుజేస్తుంది. తీరా కాయపీకే యాల్లకు శినుకు బడక పోయి నేడు నానా తిప్పలు పడ్డరు. పైన శెనగ చెట్లు ఎండి రాలిపోయే యాల్లొచ్చింది. ఎట్ట వొదిలిపెడుదుంద్రా దేవుడా ఆరు గాలం కష్టమని ఇంటిల్లాది బిందెలు నెత్తిన పెట్టుకొని బొర్రెంకయ్య బోరునీల్లు మోసింద్రు. సాన్పి సల్లినట్టు సల్లి శేతులన్ని బొగ్గలు రాంగ పీకి ఊపిరి పీల్చుకుంద్రు.

ఆ నీల్లు మాత్రం బొర్రెంకయ్య ఉత్తిపు న్నాని కిచ్చిండా, కాల్లు జేతులు పట్టుకు న్నంత పనిజేస్తే తల్కాయ ఊపిండు. 'పీనింగమీద బొంగులేర్కతినే ముండకొ డుకు' అని కమలమ్మ అంటున్నా, 'ఆ మాత్రమన్న ఆసరైతుండు సప్పుడు జేయకు' అని నాలుగు బస్తాల శనక్కాయ ఇస్తందుకు వొప్పుకుండు నారాయణ.

'కోంటాయిన దగ్గెర ఇత్తన కాయ మాట్లాడిన. దబదబ రొండు దినాలల్ల వొల్సి పెట్టుకుందాం' అన్నడు నారాయణ.

'మల్ల శెనిక్కాయ యేద్దామానయ్యా' అన్నది కమలమ్మ పొదుగ్గా గాలొదులు కుంట.

తల్లీ దండ్రీ మాట్లాడుకుంటుంటె శీను

## కొత్తగాలి...



**పేదవాడికి, పెద్దవాడికి**
**వర్ణక్రమంలో ఒక్కటే తేడా**
**పేదవాడికి దారిద్ర్యం దీర్ఘం**
**పెద్దవాడికి సంపద ద్విత్వం**

*-ఖడ్గం పాండురంగారెడ్డి, కరీంనగర్*

వొచ్చిండు. పొద్దుగల్ల పండ్లపుల్లేసుకొని పోయినోడు యాడతిరిగిండో ఏమో ఈయ ల్లకొచ్చిండు. ఆ మాట తల్లి అడగబో యింది. కాని ఇత్తనాల ఆలోచనపడి మల్ల ఎందుకులే అని ఊకుంది.

శనిక్కాయ అన్నమాట ఇనబడ్డట్టుంది శీనుకు. 'ఏంది నాయనా. మల్ల శెనిక్కాయ లేస్తవా ఏంది? ' అన్నడు. ఆమాట వొచ్చిన దిక్కు చూసిండు నారాయణ. కొడుకు అప్పుడే వొచ్చి ఎదురుంగ నిలబడ్డడు.

'ఈడు సదువుకొని ఏ సర్కారు కొలువో సంపాయిస్తడనుకుంటి. ఈని వాలకం చూస్తే ఎవుసాయంలనే పడేటట్టుంది. నొస్ట అదే రాసిపెట్టిందేమో' అని మల్ల నిట్టూర్సిండు నారాయణ.

సొంతం పీక్కపోయిన చెంపలు, కండ్లు. జుట్టు పల్సబడి నూనె గీనే లేక అడ్డగోలి గుంది. బక్కపల్సని వొల్లు. కోటేరేసిన ముక్కు. వొంటిమీద అంగి గడకొయ్యకు తొడిగినట్టుగా వుంది. మోకాల్ల కాడికి దోపిన దోతి, జేబుల బీడికోసం ఎతుకు తుండు నారాయణ.

తన తండ్రంత వొయిసున్నోలు... నల్ల గొండల ఉజ్జోగాలు జేస్తోలు ఎట్లుంద్రు. ఒక్కొక్కలి చెంపలు నిగనిగలాడ్తయ్. ఏ చీకు చింతలేనట్టు తిర్గుతుంటరు. పోలీ సోల్లు ఎల్లగొట్టిందాక బార్లపొంటి తిర్గె టోల్లు తిర్గుతరు. అన్నన్నీ పైసలు







యాన్నించి వొస్తయో ఏమో. నాయిన ఇంత కష్టం చేస్తున్నా వొంటిమీద పావు శేరు కండలేకుండ ఎందుకయ్యిండో అను కుండు శీను.

'ఏంది నాయనా శెనిక్కాయ అంటు న్నవ్' మల్లా అడిగిండు శీను.

'శినుకుబడ్డదిగా కొడకా. ఇత్తనాల గురించి మాట్లాడుతుండు మీ నాయన' చెప్పింది కమలమ్మ. గువ్వ పిల్లోలిగున్న తల్లి దిక్కుచూసిండు శీను. శెనగ శేను ఏస్తే ఎన్ని బాధలో ఊర్లోల్లు మాట్లాడుకుం టుంటె ఇన్న మాటలు యాదికొచ్చినయ్. రొండేండ్ల సంది ఊరు పత్తి దిక్కుమ ల్లింది. ఎట్టయినా ఈ ఏడు పత్తే ఎయ్యాలె అన్న తన ఆలోచనను తండ్రికి చెప్పాలను కుండు. ఎకరం శెల్కున్న మంగలి కోటి పత్తేస్తే పోయినేడు మూటగట్టింది యాది కొచ్చింది.

'ఏంది నాయనా నువ్వు. ఊరంత పత్తి తప్ప మరో ఇత్తు ముట్టుకుంటలేరు. కిస్టా వలోల్లు వొచ్చి పత్తేసుడు మొదలు పెట్టి నంక ఊల్లె ఇంకో పంటేస్తుండ్రా? ఒక్కొ క్కలు ఎంతెంత పంట తీస్తుండ్రు. నువ్వు సూస్తలేవా? అన్ని ఎర్కుండి మల్ల శెనిక్కా యంటవేందే, అన్నడు శీను.

కొడుకు పత్తీ పత్తీ అని కలవరించినట్టు మాట్లాడుతుంటె నారాయణ నోరు తెర్సిండు 'బానే వుందిగని ఇత్తనాలు, పెట్టుబల్లు మనమేడ బెడ్తం కొడకా. ఆ యిత్తనాలు కూడా యాడ దొర్కుతయో ఏమో. మనకు ఎర్కలేదాయే' నారాయణ మెత్తబడ్డట్టుగా అన్నడు.

'నువు ఊ అను నాయనా. ఆయన్ని నేను చూసుకుంట కదా' అన్నడు శీను.'

'ఎర్కలేనోనివి నీకెందుకు కొడకా' అన్నడు.

శీను లేసి తండ్రి ఎదురుగా నిలబడ్డడు. 'నాయనా ఇత్తనాల గురించి ఫికర్‌బెట్టు కోకు. ఎంకటేస్పరావు, అప్పారావు. అదే కిష్టావలోల్లు నాయనా. అదో యిదే పది పన్నెండెకరాలు గుత్తకు తీసుకుండ్రుగా. రొండేండ్ల సంది ఆల్లు పత్తే ఏస్తుండ్రి. నేను పొద్దున కల్సినప్పుడు అప్పారావుని అడిగిన. ఆల్లు సీడు గింజలకు పోతరంట. మనకు తెమ్మంటే తెస్తరంట' శీను గడగడ చెప్పిండు.

ఎంకటేస్పరావు, అప్పారావు గుంటూరు పక్కన ఎదో ఊరోల్లంట. వొచ్చి గుత్తకు పట్టి పత్తేస్తుండ్రు. ఆల్లను చూసి ఊరంత పత్తికి మరిగిండ్రు. సీడు గింజలు కూడా ఆల్లే తెస్తుండ్రంట. ఊల్లె పత్తేసెటోల్లకు నష్టమైతే రాలేదు.

శెనిక్కాయ కంటే నయమేనయా అని బంటాయిన అన్నడు కూడా మొన్న తనతో.

నారాయణ పెట్టుబల్లు యాదికొచ్చి 'పురుగుల మందు మన్ను మశానం మన తోని అయితాది కొడకా? ' అన్నడు.

నారాయణకు ధైర్యం సరిపోతలేదు. అందునా కిటుకు ఎర్గని పంట. ఏ సైమాన ఏ మందులు వాడాల్నో కూడ తెల్వదు.

'అంతా ఆ కిష్టోల్లు చెవుతరు నాయినా. పురుగుల మందులు కూడ ఉద్దెర ఇప్పిస్త రంట. మన రాములు కొడుకు సైదులు అదే ఫైనాన్సు పెట్టినాయన పురుగుల మందు దుకాణం పెడుతుండట. ఈ ఏడు సొంతం సైదులే ఉద్దెరకు ఇస్తడంట. అప్పారావోల్లకు కూడా అయినే ఇస్తడంట. శీను ఊల్లె తెల్సిన సంగతులన్నీ తండ్రికి పూసగుచ్చినట్టు చెప్పిండు.

కొడుకు అంతయిదిగా చెపుతుంటే నారా యణకు బానే అనిపించింది. శెనగశేను ఏశి ఏశి సారం గుంజినట్టుంది నేల. కాస్త పంట మారిస్తేనన్న బాగుంటది అను కుండు. ఊరంత యేసిండ్రు బానే ఉండ్రు.

# శభాష్ బ్రెయిలీ




అంధులు చదవడానికి అనువుగా ఉన్న దాన్ని బ్రెయిలీ లిపి అంటారు. దీన్ని ఫ్రాన్స్‌కు చెందిన లూయిస్ బ్రెయిలీ కనిపెట్టాడు.

1809లో ప్యారిస్ సమీపంలోని ఓ కుగ్రామంలో పుట్టాడు బ్రెయిలీ. అతని తండ్రి తోలుతో రకరకాల వస్తువులని, గుర్రపు జీనులని తయారుచేసి అమ్మేవాడు. మూడేళ్ళ వయసులో బ్రెయిలీ తోలులో రంధ్రాలు చేసే పదునైన పరికరంతో ఆడుకుంటూ దాన్ని కళ్ళల్లో గుచ్చుకుని గుడ్డివాడయ్యాడు. మొదట్లో అతడు అంధత్వంతో చాలా కష్టపడ్డా, త్వరలోనే సాధారణ జీవితాన్ని గడపసాగాడు. తోటి పిల్లలతో స్కూల్‌కి వెళ్ళేవాడు. అతడు చిన్నతనం నుంచే అసాధారణ తెలివితేటలు కలిగివుండేవాడు. దీనికి తన అంధత్వం అతనికి అడ్డుగా నిలిచేది కాదు.



పెద్దయ్యాక ప్యారిస్‌లోని అంధుల పాఠశాలలో చేరాడు. అక్కడ అంధ విద్యార్థులు చదివేందుకు వీలుగా పుస్తకాలున్నాయి. కాగితం మీద ఉబ్బెత్తుగా ఉన్న అక్షరాలను చేత్తో తడిమి, వాటిని అర్థం చేసుకుని చదవాలి. ఆ అక్షరాలు చాలా పెద్దవి కాబట్టి, పుస్తకాలు కూడా బరువుగా, లావుగా ఉండేవి. దాంతో వాటి ఖరీదు ఎక్కువే. అలాంటివి మొత్తం 14 పుస్తకాలుండేవి. వాటన్నిటినీ అతడు చదివాడు. ఓ వాక్యం చదవడానికి చాలా సమయం పట్టేది. వాక్యం పూర్తిచేసేలోగా మొదట చదివిన పదాలు గుర్తుండక ఇబ్బంది పడేవాడు. అక్షరాలను తేలికగా చదివే మార్గంకోసం బ్రెయిలీ ఆలోచిస్తుండగా, ఫ్రెంచి సైన్యంలో కాగితంమీద కోడ్‌లో రహస్యాలను రాసే ప్రక్రియ గురించి విన్నాడు. ఆఫీసర్లు సైనికులకు ఆజ్ఞలను కోడ్ భాషలో రాసి పంపేవారు. అయితే రాత్రుళ్ళు దాన్ని చదవడానికి అగ్గిపుల్ల గీస్తే, శత్రువులకి తమ ఉనికి తెలిసిపోతుందన్న భయంతో వేలితో చదివేవిధంగా గుర్తులను కాగితం మీద ఉబ్బెత్తుగా రాసేవారు. ఆ గుర్తులు చుక్కలు, గీతల కలయికతో ఉండేవి.

బ్రెయిలీ ఈ కోడ్‌ని సంపాదించి, దాన్ని వేలితో చదివాడు. అయితే ఆ కోడ్ కూడా ఇబ్బందిగా అన్పించింది. అడ్డగీతలు ఎక్కువ స్థలాన్ని ఆక్రమించేవి. ప్రతీ పేజీలో ఒకటి రెండు వాక్యాలు మించి పట్టేవి కావు.

సెలవుల్లో ఇంటికి వెళ్ళినప్పుడు ఆ కోడ్ లిపిని త్వరగా చదివేలా అభివృద్ధి చేయాలనుకున్నాడు. ఉబ్బెత్తుగా ఉన్న చుక్కలు అతనికి సౌకర్యమనిపించినా ఆ అడ్డగీతలు నచ్చలేదు. తన తండ్రి తోలుపనిచేసే దుకాణంలో కూర్చుని ఉండగా, అతని చేతికి ఓ పరికరం తగిలింది. దాంతో చర్మంలో రంధ్రాలు చేస్తారు. తక్షణం ఉబ్బెత్తు చుక్కలతోనే కోడ్‌భాషని రూపొందించాలన్న మెరుపులాంటి ఆలోచన తట్టింది.

ఆరు చుక్కలతో అన్ని అక్షరాలకు కోడ్‌ని రూపొందించాడు. దాన్ని ఉపయోగించి, ఆ పరికరంతో కాగితం మీద ఉబ్బెత్తుగా వాక్యాలని రాసాడు. ఎక్కువ వాక్యాలు పట్టడమే కాక చదవడం తేలికయింది.

అతని జీవితకాలంలో ఈ విధానం ప్రాచుర్యం పొందలేదు. 1952లో అతడు మరణించాడు. తర్వాత అది ప్రపంచ వ్యాప్తమైంది. మూడు చుక్కలు పైన, మూడు చుక్కలు కింద ఉండే బ్రెయిలీ లిపిని ప్రపంచంలోని దాదాపు అన్ని భాషలకు ఉపయోగిస్తున్నారు. అంతేకాక సంగీతం, లెక్కలు, కంప్యూటర్ ప్రోగ్రాం, ఆఖరికి చదరంగంలో కూడా ఉపయోగిస్తున్నారు. ఏ పరికరం వల్ల బ్రెయిలీ గుడ్డివాడయ్యాడో దాంతోనే స్ఫూర్తి చెంది అంధుల లిపిని కనిపెట్టడం విశేషం.

## కొత్తగాలి...

**ఎన్నికల**
**రుతువులో**
**వాగ్దానాల**
**వర్షం!!**

– భాస్కర స్వర్ణాంబ, తిరుపతి

తనకు మాత్రం ఏమైతది? పెట్టుబల్లకు శీనుగాడు ఉపాయం చెప్పి అనుకుండు.

కాదనడమెందుకనుకొని 'సరేలేరా శీను. ఒ రొండెకరాలు ఏద్దాం.. అదేందో ఆ అప్పరావును ఓసారి కనుక్కో' అన్నడు.

శీనుకు సంబూరమయ్యింది. తన తండ్రి ఇంత కష్టపడి పనిచేస్తుండు. యవుసాయం... కష్టాలు చూసుకుంట తనేడ సదువుకుంటడు. మనసేడ నిమ్మలంగుంటది. నాయినకు ఆసర కావాలె. పత్తిపంట ఏసి నాలుగు రాల్లు సంపాయించాలె. దాపులేకపోతే నాయిన ఆయింత గుండెబలిగినట్టయితడు. నా కొడుకు కష్టంతోనైనా నా ఇద్దరు బిడ్డల పెండ్లిజేస్త అని నాయిన అనుకోవాలె. అమ్మకు కూడా పాణం తృప్తిపడ్తది అనుకుండు శీను.

బీడి ఎలిగించి దమ్ము గుంజిండు నారాయణ తృప్తిగా. కొడుకు ఉషారును చూసి సంబూరపడుకుంట కమలమ్మ లేసింది. 'ఈ సంసారాన్ని నిలబెట్టినా పడగొట్టినా నా కొడుకే. ఆడు ఈ అమ్మ పేరు నిలబెట్టకపోతాడు' అనుకుంది.

శీను జాలార్లకల్ల బోయి కాల్లు జేతులు కడుక్కొని వొచ్చిండు. 'ఇగో నాయిన. ఈ సద్దరొట్టెలు నవులు' అని కొడుక్కో రొండిచ్చి తనూ రొట్టెలు పట్టుకుని కూసుంది కమలమ్మ.

పొద్దు నడినెత్తికెక్కింది. పైన మబ్బులెప్పలు ఉర్కులబెడుతున్నయ్. అంతల్లనే చీకటి కమ్మినట్టయ్ వానపడ్తదా అనిపిస్తుంది. జర్రసేపటికే ఎండ దెబ్బతీస్తుంది. వానకాలమంటెట్టు లేదు. ఎండకాలమంటెట్టు లేదు. నారాయణ ఉక్కపోతకు అంగి ఇడిసేసి తువ్వాలతో అటిటు ఊపుకుంటుండు. పై మెకాన తల్కాయ ఎత్తేసరికి ఆరెగట్ట కనపడ్డది. దూలానికి ఏలాడేసిండు. కిందేస్తే తొక్కుల్ల పడ్తదని. ఎల్కలు ఉంచెనా పాడుజేసెనా సూసుకుందామని లేసి ఆరెగట్ట కిందికి దించిండు. పలుపులు పగ్గాలు ఓ సారి నేలకు కొట్టి ఇప్పి చూసుకుండు. బానే ఉన్నయ్.

ఆంద్రనే సొంతం పాతబడ్డది. ఆC ఈ దున్నే దున్నుడుకు పనిచేస్తదిలే అనుకుండు. పురి ఊడిన పగ్గాన్ని సరిచేసిండు. మల్ల సుట్టి అటు పక్కన పెట్టుకుండు.

వాకిట్ట గోడ నీడకు కూసున్న శీను లేసి 'నాయినా అప్పారావు పోతుండు. పిల్వనా?' అన్నడు.

నారాయణకు పత్తి గురించి తెలుసుకోవాలనిపించింది. 'ఏది ఇటు పిలువు ఆ పత్తి సంగతి జర మాట్లాడదాం' అన్నడు.

'అప్పారావు.. నాయిన పిలుస్తుండు. జర్రవొచ్చి పోరాదు' శీనుకేక యినబడ్డది.

నారాయణ లేసి మంచం మీద కూసుండు. అప్పారావు పొరసుట్ట గుప్పుగుప్పున గుంజుకుంట ఇంట్ల కొచ్చిండు. ఇంత నూనెపెట్టి పాపెడ తీసి దువ్విన జుట్టు, ఉజ్యోగానికి పోయే నల్లగొండోల్లు గీసుకున్నట్టు దినం గడ్డంగీస్తట్టుంది. రోజోలిగనే చెప్పులు నున్నగా మెరిసిపోతున్నయ్. భుజంమీద చక్కగ మడతపెట్టిన కండువ. తెల్లలుంగి. దానికి నాలుగేళ్ల మందం అంచు. శింగులు తొక్కుకుంట నడుస్తడు.

'దా అప్పారావు కూసో' నారాయణ మంచంల వో పక్కకు జరిగిండు. కూసో

మ్మనట్టుగా చెయ్యి సూపిచ్చిండు.

అప్పారావు మంచం మీద కూసుండు. సుట్ట పొగ వొదుల్తనే ఉండు. కాలుమీద కాలేసుకొని అడ్డలుంగీ సదురుకుండు.

'ఏంటి బాగున్నారా నారాయణగారూ?' అప్పారావు పలకరింపుగా అంటూ కొద్దిగా నవ్విండు.

'ఆc ఏం బాగయా సచ్చినట్టు లేదు బతికినట్టులేదు' ఊపిరి పొడుగ్గా తీసిండు నారాయణ.

అప్పారావు విలాసంగా కాలూపుతుండు.

'ఏంటి మీ అబ్బాయి శీనా పిలిచాడు. మీరు పిలవమన్నారేంటి' అన్నడు అప్పారావు.

'ఆ ఆ మావోడు నువ్వీన్నుంచి పోతున్నవంటే నేనే పిలువమన్న. ఏంలేదు. ఆ పత్తి పంట సంగతి జర చెప్తవేమోనని. మా వోడు ఒకటే పత్తీ పత్తీ అంటుండు. నేనేమో ఎన్కముందాడుతున్న?' నారాయణ అప్పారావు మొకం దిక్కు చూసుకుంట అన్నడు.

'భయమెందుకండీ పత్తి పంట ఏస్తందుకు? అది తెల్ల బంగారం. మా విజయవాడ, గుంటూరు సైడు సూడండి. అయితే వరి లేకుంటే పత్తి. ఏం లాభం లేకుంటే భార్య, పిల్లల వొదిలిపెట్టి ఇంతదూరం వస్తామండీ. మరేం ఆలోచించకండీ. మీరు ఎప్పుడేం చేయాలో నేను చెపుత గదా' అప్పారావు భరోసా ఇచ్చిండు.

'అయ్యేంటియి... సీడుగింజలంట. మరి తెప్పిచ్చి జర సాయం జేయరాదు' నారాయణ అన్నడు.

అప్పారావు నవ్విండు. 'భలేవారండీ. అదేమన్న భాగ్యమానండీ. గుంటూరులో మంచి సీడు గింజలు దొరుకుతయండీ. రేపో మాపో పోతనండీ. ఈ వూల్లె కూడా చానామంది అడుగుతున్నారండీ. మీరు కూడా డబ్బులిచ్చినారంటే తెస్తనండీ' అన్నడు.

'సరే పోయేటప్పుడు చెప్పు' అన్నడు నారాయణ.

'మరి నేను వెళ్లొస్తానండి. ఆ ఫైనాన్సు సైదులు ఇంటికొచ్చిండని తెలిస్తే కలిసొద్దామని పోతున్నండీ' అని లేసిండు అప్పారావు.

'సరే నీ మాట ధైర్నంతోనే యేస్తమరి. సైమానికి మాట సాయంజేయి. ఎర్కనోల్లం మున్గతం మల్ల' అన్నడు నారాయణ.

'ఏం శీనా పత్తిపంట ఏపిస్తందుకు మీ నాన్నను ఒప్పించినావే' అనుకుంట అప్పారావు ఎల్లిపోయిండు.

'ఏం పంటలో... ఏం ఆందానో... అంతదూరం నుండి కిష్టోల్లు వొచ్చి చేస్తుంద్రు. ఎంతయినా ఆల్ల ధైర్నమే వేరు. పెండ్లాం పిల్లలు వున్న ఊరును వొదిలిపెట్టి బయటికొస్తరు. మరి తనో... తనేంది... ఈ ఎర్రగూడెంల వోడయినా సరే. ఇల్లిడిస్తే పిల్లి కర్సుద్ది అన్నట్లు ఊల్లెనే వుంటరు. పనుంటే చేస్తరు. లేకుంటే ఉపాసముంటరు. ఆల్లెంతయినా నీల్ల ఆయం తెల్సినోల్లు. పైస రుచి మరిగినోల్లు' అనుకుండు నారాయణ.

కమలమ్మ ఇత్తన గింజలు ముందలేసుకొని కూసుంది. సాట తీసుకొని పొతం జేస్తుంది. చెరుగుకుంట ఉఫ్ ఉఫ్ మని ఎగురుతున్న గింజలతో పాటు తల్కాయ ఆడిస్తుంది. సాట కింద వేల్లు దరువేస్తున్నయ్. తల్లి చెరుగుతుంటే కండ్లుకొట్టకుండ చూసుకుంట నిలబడ్డడు శీను.

'ఏందిరా ఏందో కొత్తగ చూస్తవు. ఎన్నడు చూడనట్టు' అన్నది కమలమ్మ.

'అది కాదమా నువ్వు చెరుగుకుంట తల్కాయ ఆడిస్తుంటే... అట్ల గుడ్లెల్ల బెట్టి ఎగురుతున్న ఇత్తనాల దిక్కు చూస్తున్నవ్. పైనుంచి పైకే పోతయామా' శీను







పరాశికంగా అన్నడు.

కమలమ్మకు నవ్వొచ్చింది కొడుకు మాటలకు. 'నీకెందుకురా నేను తల్కాయ ఎట్లా డిస్తే. పన్లేని మాటలు' అని పక్కన కోల్ల కొట్టటానికి పెట్టుకున్న కట్టెపుల్ల అందుకుంది.

తల్లి తమాషాగా కోప్పడుతుంటే చూసి 'మనం పత్తి పంట ఏసినమంటే నువ్వెప్పుడూ ఇట్టనే నవ్వొచ్చుమా. మన దరిద్రం తీరుద్దనుకో' అన్నడు.

'ఏమో నాయినా నీ పోరును బరాయించలేక మీ నాయిన ఒప్పుకుండు. ఆయిన తల్కాయ ఊపిండని నేను నోరెత్తలే. నలుగురు నవ్వే పని కాకుంటే సాలు' అన్నది.

'నీ ముద్దుల కొడుకు మాటనమ్మమా. అంతా మంచే జరుగుతది' అన్నడు శీను. తల్లి మల్లా పనిలో పడిపోయేసరికి బయిటికి పోయిండు.

కొడుకును ఎన్కనుంచి తృప్తిగా చూసుకొని నవ్వుకుంది కమలమ్మ. భార్య ముసిముసి నవ్వులు చూసిన నారాయణ 'ఏందమ్మ ఇత్తనాల గింజల్లు రాల్ల బదులు బంగారమేమన్న దొరికిందా' అన్నడు నవ్వుకుంట.

'అవునయా బంగారమే. అట్టపోతుండు సూడు. ఆడే నా బంగారం' కొడుకు పోయిన దిక్కు చూపిచ్చి అన్నది కమలమ్మ.

'నిన్నమన్నటిదాంక లాగులేసినోడు. నిండా పదిహేడు వానికి. అడ్డలుంగి ఎట్ట కట్టిండో సూడు నా కొడుకు. వాన్ని చూస్తుంటే కడుపు నిండినట్టు అయితుందయా' అన్నది కమలమ్మ.

'ఆ ఆ ఆడేదో నీవొక్కని కొడుకయినట్టు...' అన్నడు నారాయణ సన్నటి మీసం దువ్వుకుంట.

'ఓ సాల్లే సంబడం' అని మూతి ఇరిసింది కమలమ్మ.

నారాయణకు మల్లా ఆలోచనలు కమ్మినయ్. 'పాము నోట్లె ఏలుపెట్టినా ఉన్నూరోనికి పావలా అప్పు పుట్టదు. అదే కిష్టోల్లు చూడు సరిగ్గ వొచ్చి రొండేండ్లు కాలే. నోరుతెరిసి అడిగితే సాలు ఒకలికి తెల్వకుండ ఒకలు బొడ్లెదాసున్నయ్ తీస్కపోయి ఇస్తరు. ఉన్నూరోనికాడ లేంది ఆల్లకాడ ఏముందో' బయిటికే అన్నడు నారాయణ.

'ఏమున్నదంటవేందయా. తెల్లగా పుల్లగ వుంటరు. ఇండ్లల్లకు దూస్కపోయి ఏవండీ ఏవండీ అని ముచ్చట బెడ్తరు. నిన్నియాల్ల వొచ్చికూడ గుత్తలకు తీసుకొని యవుసాయం చేస్తున్నా ఆల్లు నాగలిపట్టిదున్నరు. మనూరోల్లతోనే దున్నిస్తరు. ఆడోల్లను కూల్లకు పిలుస్తరు. పొద్దూకంతల కూలి పైసలు ఇస్తరు. ఈ వూల్లె కూలికి పిల్సినోడు వోడన్న... ఏ కూలోని కన్న కూలిదానికన్న పొద్దూకుంతల పిల్సి ఓ నోటు ఇచ్చిండా. ఆల్లు చూడు అంగీజేబుల పెట్టుకొని అట్ల తీసియిస్తుండ్రు. ఆల్ల చేతుల అన్ని పైసలు ఆడుతుంటే చూసి అప్పియ్యబుద్ధి గాదా ఎవల్కైనా పైసలుంటే' అని అన్నది.

'ఎంతయినా కిష్టోని మాటతీరుకు ఓడయినా పడాల్సిందేనమా' అన్నడు నారాయణ.

'ఆ ఆ అందుకేగ ఆ నిన్నమన్న ఆల్లకు కూలికిపోయేటోల్లు కూడ 'అప్పారావుగారు ఓ సారి ఇంటికొచ్చి కాఫీ తాగిపోండి' అని పిల్సేది అన్నది కమలమ్మ.

నారాయణకు అది తెల్సు. ఊల్లె చాలామంది ఆల్ల యాసను అలవాటు చేసుకుంటుండ్రు. ఎర్రగూడెం బాస మాట్లాడితే 'ఏం మాటలవి. వాల్లను చూసి నేర్సుకోరాదు' మార్వాక మాదిగామె కూడా అన్నది మొన్న.

# నాణ్యమైన నాయకుడు




అమెరికా ప్రెసిడెంట్ హార్డింగ్ మరణించాక, అప్పటి వైస్ ప్రెసిడెంట్ కూలిడ్జ్ ప్రెసిడెంట్ అయ్యాడు. ఐతే హార్డింగ్ భార్య కొంత కాలం వైట్‌హౌస్‌ని ఖాళీ చేయకపోవడంతో కూలిడ్జ్ దానికి దగ్గర్లోనే వున్న విల్లర్డ్ హోటల్‌లో మూడో అంతస్తులో బస చేసాడు.

ఓ రాత్రి కూలిడ్జ్‌కి మెలకువ వచ్చి చూస్తే ఓ దొంగ తన దుస్తులని వెదుకుతుండటం కంటపడింది. జేబుల్లోంచి ముందు పర్స్‌ని, తర్వాత వాచీని తీసుకున్నాడా దొంగ. కూలిడ్జ్ చీకటిలోంచి ఆ దొంగతో మాట్లాడాడు-

"నువ్వు ఆ వాచీని మాత్రం తీసుకోవద్దు."

ఆ దొంగ వెంటనే ఉలిక్కి పడ్డాడు. తర్వాత అడిగాడు,

"ఎందుకని?"

"ఆ వాచీ, దాని బంగారు చెయిన్ కాదు నాకు ముఖ్యం. దానికున్న సెంటిమెంటల్ విలువ వల్ల. ఆ వాచీ వెనక ఏం రాసివుందో ఓసారి చదువు."

దొంగ దాన్ని కిటికీ దగ్గరకి తీసుకెళ్ళి చదివితే దాని వెనక ఇలా చెక్కి వుంది.

'ప్రజెంటెడ్ టు కాల్‌విన్ కూలిడ్జ్, బై ది మసాచుసెట్స్ జనరల్ కోర్ట్'

"మీరు అమెరికా అధ్యక్షుడు కూలిడ్జా?" సంభ్రమంగా అడిగాడు ఆ దొంగ వెంటనే.

"అవును. నువ్వు ఎందుకు దొంగతనం చేస్తున్నావు?" ప్రశ్నించాడాయన.

"నేను, నా మిత్రుడు వాషింగ్‌టన్ డి.సిని చూద్దామని కాలేజి సెలవులకి వచ్చాం. మా వెంట తెచ్చుకున్న డబ్బంతా ఖర్చయిపోయింది మేం బస చేసిన హోటల్ బిల్లు చెల్లించడానికి, తిరిగి వెళ్ళడానికి రైలు టిక్కెట్‌కి కూడా డబ్బులేదు. మీరేం అనుకోకపోతే మీ పర్స్‌ని తీసుకువెళ్తాను" చెప్పాడు దొంగ.

"కూర్చో మీ ఇద్దరి హోటల్ బిల్‌కి, రైలు టిక్కెట్‌కి ఎంత కావాలి?" దయతో ప్రశ్నించాడు కూలిడ్జ్.

"ముప్పై రెండు డాలర్లు."

"సరే, పర్స్‌లో ఎనభై డాలర్లు వున్నాయి. నాకు కూడా ఈ హోటల్ బిల్ చెల్లించడానికి డబ్బు అవసరం కదా? ముప్పై రెండు డాలర్లు అప్పుగా తీసుకో. దాన్ని తిరిగి నీ ఆర్థిక స్థితి బాగుపడ్డాక నాకు చెల్లించాలి. తప్పని తెలిసీ దొంగగా ఎందుకు మారతావు? నువ్వు తప్పు మార్గంలోకి మళ్ళావు. ఇంకా నీకు అవకాశం వుంది కాబట్టి తిరిగి సన్మార్గంలోకి మళ్ళు."

అతను కూలిడ్జ్‌కి థాంక్స్ చెప్పి ముప్పై రెండు డాలర్లు తీసుకొని వాచీని వదిలేసాడు.



"నువ్వు వచ్చిన కిటికీలోంచి బయటికి వెళ్ళు. తలుపు తెరచుకుని వెళితే బయట కారిడార్‌లో కాపలా ఉన్న సీక్రెట్ ఏజెంట్లు నిన్ను అరెస్ట్ చేస్తారు."

మరోసారి థాంక్స్ చెప్పి అతను వచ్చిన దారినే వెళ్ళిపోయాడు.

ఈ ఉదంతం 1957లో శ్రీమతి కూలిడ్జ్ మరణించేదాకా ప్రపంచానికి తెలీదు. మొదటగా ఈ ఉదంతాన్ని లాస్ ఏంజెలెస్ టైమ్స్ ప్రచురించింది. ఆసక్తికరమైన విషయమేమంటే తను తీసుకున్న ముప్పై రెండు డాలర్లు తిరిగి కూలిడ్జ్‌కి ఆ దొంగ చెల్లించాడు. ఆ సందర్భంలో అతను రాసిన వుత్తరాన్ని ఆమె వారసులనించి కొన్న ఆ పత్రికకి లభించడంతో ఇది బహిర్గతమైంది.



'ఏవయా ఇయ్యాల్నేమో అట్లనే మంచా నికి అత్తుకపోయినవ్? శల్కల ఎడ్లకట్టేసి వాస్తివి. ఆటి దూపేమాయే మేతేమాయే యెల్లరాదూ' అన్నది కమలమ్మ.

అదాట్న యాదికొచ్చినట్లయ్ నారాయణ లేచి చెప్పులేసుకుండు. 'ఏదో కమ్మర్తిల పడి అట్లనే వుంటి. ముందే మూసలెడ్లు. దూపగొని సచ్చినా దిక్కులేదు' అని బయ ల్దేరిండు.

★ ★ ★

శీనుకు లుంగీ కట్టుకోవడం కొత్త కొత్తగా వుంది. మొన్నటిదాక లాగులేసిన ప్రాణం. కొద్దిశేపు లుంగిని పైకి మల్సికడుతుండు. ఎవలు లేకపోయేసరికి జారయిడిసి సింగులు తొక్కుతుండు. అట్ల నడుసుడు కుశాలుగా వుంది శీనుకు. నడుసుకుంట నడుసుకుంట సాలోల్ల బజారుకు పోయిండు. ఎండవాన లేకుంట పనిచే స్తోల్లు వాల్లే అనుకుండు. అంతా మగ్గాల సప్పుడు. టక్క టక్కమని కండెలాడు తున్న సప్పుడు. ఎంతో లయబద్దంగా విని పిస్తున్నయ్. ఇండ్లల్లకల్ల చూసుకుంట పోతుండు. ఆడోల్లు కూడ ఏదో నూలు చేతుల పట్టుకొని పనిచేస్తుండ్రు. యాప చెట్టు కింద ఆడికి ఈడికి నూలు దారాలు కట్టి రంగులద్దుతుండ్రు. మధ్య మధ్యన దారాలతో కట్లు కడుతుండ్రు. రకరకాల రంగులు బకెట్లల్ల కలిపి వున్నయ్. ఒక్కొక్క రంగు దారాలు ఒక్కోచోట కడు తుండ్రు. ఆడీకీడికి కట్టిన దారాలు చూస్తే సింగిడి వొడ్డినట్టుగా వుంది. దగ్గరికి పోయి నడుం మీద చేతులేసుకొని నిలబ డ్డడు.

'ఏంది పిలగా ఊరికి కొత్తనా, నల్లగొం డకు పోయి మర్సిపోయినవా?' అన్నది రంగులద్దేటామె.

'ఏం లేదత్తా నీ చేతుల బొమ్మలు పుడు తుంటె చూస్తున్న' అన్నడు శీను.

'అబ్బో నల్లగొండ బాస నేర్సిండే పిల గాడు' అన్నది ఆమె.

శీను నవ్వుకుంట కదిలిండు. అత్త చేతు లకు చిక్కటి రంగులు అంటించుకోకుండ ఉండదుకదా అనుకుండు.

నాలిగిండ్లు దాటి ఓ ఇంటి తలుపు తోసిండు. పాక కింద మగ్గం ఆడుతుంది. పరంధాములు మగ్గం గుంటల కూసుండు. ఓ నిమిషం మగ్గం ఆపిండు తలుపు సప్పుడుకు. తొడమీదున్న పల్సటి ఎర్ర తుండును తీసుకొని తూడ్సుకుండు. ఎర్రటి ఎర్రదేలసుంటి రంగు. దోతికట్టు. నడుము కాడ గోశి బయట చెక్కినట్టు కన పడుతుంది. కాల్లు గుంటల ఉన్నయ్. పైన జందెంపోగు తప్ప ఇంకోటి లేదు. తుండుగుడ్డను రొండుచేతుల పట్టి వీపును కిందికి మీదికి తూడ్సుకుండు. తుండు గుడ్డతో అటిటు గాలూపుకుండు.

'ఏం శీను సుదర్శన్ కోసమా?' అన్నడు పరంధాములు.

సుదర్శను శీను పదివరకు ఎర్రబెల్లిల కలిసే సదువుకుండ్రు. శీను ఓ ఏడు నల్ల గొండకు పోయిండు గని సుదర్శను మాత్రం మగ్గం పనికి వొంగిండు. శీను రోజు ఓ సారన్న సుదర్శన్‌ను చూడకుంటె నిమ్మలపడడు ఊల్లె వుంటె.

'అవును కక్కయా! లేడా?' అని పోయి పరంధాములు పక్కన వున్న పాత స్టూలు మీద కూసుండు.

'ఇప్పుడే బయటికి పోయిండు నాయనా. నేనే పంపిన పనిమీద' అన్నడు పరంధా ములు.

శీను మగ్గందిక్కు, నేస్తున్న బట్టదిక్కు చూసిండు. చీర ఉన్నట్టుంది. సన్న సన్నటి పూల డిజైన్. చక్కని రంగులు. చూస్తావుంటే చూడబుద్ధి అయ్యేటట్టుగా వుంది. శీనుకు నేతపనిని చూడడం కొత్త కాదు. కాని చూసినపుడల్లా కొత్తగానే అని

పిస్తది. రంగులద్దిన దారాలు ఎట్ల అమ ర్చుతరో, నేతలోనే ఆ రంగుల డిజైన్లు ఎట్ల వొస్తయో? ఎంతకూ అర్థం కాదు. శీను తదేకంగా నేస్తున్న చీరదిక్కు చూస్తుండు.

'ఏం శీనూ డిజైన్ బాగుందా?' అన్నడు పరంధాములు.

పక్కన బీడికట్ట తీసుకొని వో బీడి నోట్లె పెట్టిండు. అగ్గిపెట్టె కోసం వెతికి దొరికేస రికి బీడి ముట్టించిండు.

'బాగుంది కక్కయ్యా. కాని ఆ డిజైన్లు ఎట్ల వొస్తయో నాకెంతకూ అర్థం కాదు. నీ చేతులేమన్న మహత్యముందా అంత అందంగా డిజైన్లు నేస్తవ్?' అన్నడు శీను.

పరంధాములు పొగ వొదులుకుంట పక పకా నవ్విండు. అట్ల ఆయిన నవ్వుతుంటె సన్నటి మనిషి ఊగిపోయిండు. చెంపల మీద ముడతలు మరింత పెరిగినయ్. మగ్గం కొట్టీ కొట్టీ దారం పోగోలిగ అయి పోయిండు గదా కక్కయా, మా నాయినో లిగనే అనుకుండు శీను.

పరంధాములు నవ్వు ఆపి 'మహత్యమా పాడా? తాతలు తాతల నుంచి చేస్తున్న పని. ఆ మాత్రం రాదా మాకు. ఇది తప్ప ఇంకోపని ఏమొస్తది?' అన్నడు.

'ఇంత కష్టపడి రాత్రీ పగలనకుంట మగ్గం గుంటల కూసొని నేస్తవు. ఇంటిరా ల్లాలు ఇదే బతుకుగా పనిచేస్తరు. మరెం దుకు కక్కయా ఈ పేదరికం. లాభాలు రావా?' అమాయకంగా అడిగిండు శీను.

'అదంత పెద్ద కతలే నాయినా. ఇగో ఇది నేస్తున్ననా. ఈ చీర నాది కాదు. ఆడ వున్న నూలు నాది కాదు. ఆ మూల కున్న రంగులు నాయి కావు. నేను ఉత్తి కూలి మనిషినే. నేనింత కొట్టుకున్నా తిండి మందమే' అని పొడుగ్గా గాలొదిలిండు.

'అదేందీ?' శీను ఆశ్చర్యంగా అడిగిండు.

'అదంతే. సరఫరా చేసేవాల్లు వేరే. లాభాలు గీబాలు వాల్లవే. మాది వుట్టి రెక్కల కష్టమే' పరంధాములు బీడిముక్క

## కొత్తగాలి... 

**నోరు నవ్వి**
**నొసలు వెక్కిరించిందా?**
**అది**
**నిజంగా మనిషి పనే...!**

—ఎస్.ఆర్. భల్లం, తాడేపల్లిగూడెం

యిసిరేసి మగ్గం మొదలు పెట్టిండు.

టక్కు టక్కు కండె ఆడుతుంది. అటు ఇటు కండె తిరుగుతుంటె ఒక్కొక్క పువ్వు పడుతుంది. అంతా విచిత్రంగా వుంది. అందమైన బట్టలు నేయడము వాల్లపని. వాల్ల బతుకు మాత్రం మరెవరి చేతు ల్లోనో. శీను నిట్టూర్చిండు.

బయటికి పోయిన సుదర్శన్ వొచ్చిండు. శీనును చూసి నవ్వు మొకం పెట్టిండు. కండ్లతోనే పలకరింపులు. ఎవరి మన సులో ఏముందో ఆ ఇద్దరికి తెలుసన్న ట్టుగా ఇంట్లకు పోయిండ్రు.

'ఏం సుదర్శన్ యాడికి పోయినవ్?' శీను పలకరించిండు.

సుదర్శన్ ఒక క్షణం మౌనంగా వుండి, 'శేటు దగ్గరికి పోయి వస్తున్న ఏమన్న పైసలిస్తడేమోనని' అన్నడు. ఇవ్వలేదు అన్నట్టుగా చేతులు ఆడించిండు.

'ఎందుకియ్యడు?' శీను అడిగిండు.

'ఆయిన దగ్గర లేవంట. మాలు రేపు మార్కెట్ల అమ్మినంక ఇస్తడంట! లోగొం తుతో అన్నడు సుదర్శన్. శీను మాట్లాడ కుంట వుంటేసరికి మల్లా సుదర్శనే అన్నడు. ఆయిన దగ్గర పైసలు లేక కాదు. ఇయ్యదరియ్యక. ఎందుకియాలె వెంటనే అని.

సుదర్శన్ తల్లి కొడుకు మాటిని అడగ డానికొచ్చినట్లుంది. కొడుకు నోటిలో మాట ఇని మొకంల నెత్తురు సుక్కలేనట్లు నిలబ






డిపోయింది.

శీనుకు అక్కడ వుండటం చానా ఇబ్బం దిగా అన్పించింది. రెక్కలు ముక్కలు చేసుకునే బతుకులే ఇట్ల గోసెందుకు పడు తున్నయో అనుకుండు.

"సుదర్శన్ వొస్త... చాలా సేపాయే ఎల్లి" అనుకుంట ఇంటిబాట పట్టిండు.

## 2

**పొ**ద్దు కడవుల కొంగుతుంది. కమ లమ్మ బియ్యం కడిగి వొరుపునీల్లు కుండల పోస్తుంది. బల్లెకు పోయి అప్పుడే వొచ్చింద్రు రమ, ఉమ. కాళ్లు మొకం కడ క్కుంద్రు.

"అమా రొట్టెలు చేయాల్నా" ఉమ అడి గింది.

"ఓపిక వుందా బిడ్డ, నేంజేస్తలేరి" కమ లమ్మ బిడ్డల కష్టపెట్ట దరియ్యక అన్నది.

"ఎందుకు లేమా, మేం చేస్తం లే" అన్నది రమ. ఇద్దరు బక్క పల్సగున్నరు. ఒకర్ని తీసి ఒకర్ని పెట్టరాదు. ఒకోసారి రమను పట్టుకొని ఉమా అని పిల్సతది. ఆల్ల పంతుల్లయితే ఇప్పటికి సరిగ్గ ఎర్కప ట్టరంట. పిల్లలు చెప్పుతుంటె తను ముసి ముసిగా నవ్వుకుంటది. బిడ్డల చూసేసరికి కమలమ్మకు కడుపు నిండినట్లుగా అయ్యింది. అంతల్లనే ఆల్ల రూపం చూసి బెంగపట్టుకున్నట్లు అయ్యింది. ఈ వొయి సుల బిడ్డలెట్ల వుండాలె. ఈ దరిద్రపు ఇంట్లో ఏం ఉందని జంట కట్టుకొని పుట్టింద్రే బిడ్డలాలా అనుకుంది మన సులో.

నారాయణ రొండెడ్ల కట్టుకుని ఇంటికొ చ్చిండు. వాటిని కొట్టంల గుంజలకు కట్టేసి ఇంట్లె కొచ్చిండు. కమలమ్మ ఎదురుబోయి అన్ని మంచినీల్లు అందించింది. తాగి మంచంల కూసుండు నారాయణ. మనిషి



అలిసిపోయినట్లుండు.

"కోంటోళ్ల ఇంటికిపోయి రావాలె. ఆ అప్పారావు సీడుగింజలు తెస్త. డబ్బులి వ్వండి" అన్నడు.

"కోంటాయినకు ఇప్పటికే ఇంత బాకీ వుంటిమి. ఇస్తడంటవాయ్యా. ఏవన్నా తాక టపెడ్తడా?" కమలమ్మ బెంగగా అన్నది.

"ఏమో అడిగి చూద్దాం. రైతు పుట్కపు ట్టినంక అప్పు తప్పదుగా" అన్నడు నారా యణ.

కమలమ్మ మొగురం దాపుకు నిలబడి భర్తదిక్కే చూస్తుంది. ఈ పాడబడ్డ యవు సాయంల పడి మనిషి సొంతం కంకికంకి అయ్యిండు అనుకుంది.

"పురుగు మందులు మరి, సైదులిస్తడో ఉద్దర. ఓసారి తెలుసుకోవాలి. అదును మీద ఆడు తాకటపెట్టిండనుకో.. మల్ల దిక్కు తోయదు" అన్నడు నారాయణ.

"ఆ మనమేమన్న ఎగదొబ్బుతమా. అయినా మిత్తీలకిస్తోడు దాసుకుం టాడు? మా యిస్తడులే" అన్నది కమ లమ్మ.

ఉమ, రమ పుస్తకాల సంచులేసుకొని ఓ మూలకు కూసుండ్రు. తల్లి తండ్రి మాటలు ఇనుకుంటనే హోంవర్కు చేసు కుంటుండ్రు.

శీను రావడం రావడం "అమా అన్నం" అని కేకేసిండు.

"వొచ్చినవా నాయినా. నీ కోసమే కాలు శిడం ఆగకుంట ఊరంత తిరుగుడు. చీకటి పడ్డంక ఇంటికొచ్చుడు, ఇట్లాంటో నివి పత్తేస్తే ఏం చూసుకుంటవురా. మమ్ములనయితే ముందుకు తోసి ముంచ వుగా" కమలమ్మ తెచ్చిపెట్టుకున్న కోపం తోని అన్నది.

శీను 'పనిలేకనే బయటికి పోయిన్నమా! పత్తేసినంక తిర్గుతనా. పత్తి చేన్లనే పండు కోను రేయింబగుల్లు" అన్నడు. కమలమ్మ ముసిముసిగా నవ్వింది. "చాల్లే ఈ మాట లకేం తక్కువ లేదు. కడుపు నిండేటట్లుగా మాట్లడ్తవ్" అని వొంటింట్లకు పోయింది.

"శీనూ ఆ సైదులొచ్చిండని అప్పారావు చెప్పిండు పొద్దున. ఉండేమో కనుక్కో ఓసారి కలుసొద్దాం" నారాయణ అన్నడు. శీను బయటికెల్లబోతుంటె "మల్లేడికిరా, తినిపో అన్నం పెట్టిన" అన్నది కమలమ్మ.

"తినిపోరా శీను" అన్నడు నారాయణ.

"లేదు నాయిన, ఎంతసేపు? పొయ్యొచ్చి తింట" అని శీను బయిటికె ల్లిండు.

★ ★ ★

కోంటాయిన దగ్గర అప్పు తీసుకొని అప్పారావుకు ఇచ్చిండు నారాయణ. నాలుగు దినాల తర్వాత సీడు గింజలు నారాయణ చేతికొచ్చినయ్. సైదులును అడిగితే కొద్దిగ బెట్టు చేసిండుగని కావల్సిన ఎరువులు పురుగు మందులు ఉద్దరిస్తనని మాటిచ్చిండు.

కట్టె, కంప కొట్టి పొతం చేసిన నేల. వాన కోసం రోజూ మబ్బుల దిక్కు చూస్తుండ్రు. ఓనాడు మల్సి మల్సి కొట్టింది. నారాయణ మొకంలో కల వొచ్చింది. చేతినిండ పనిదొరికింది కదా అని సంబూరం. అయ్యాల సొంతం ఒక్కో చోట నిలవకుండా హడావుడి చేసిండు. శీను సంబూరమైతే పట్టపగ్గాలు లేకుండ పోయింది.

ఊల్లె సొంతం ఇత్తనాలేయడానికి తయారైండ్రు. అర్కలు కొరాడేసుకొని పోతుండ్రు. నారాయణ జత ఎడ్లకు కొరా దేసిండు. శీను సీడు గింజల మూట నెత్తిన పెట్టుకుండు.

"ఏమే ఉమా మీరింత తిని తాళమేసి బడికిపోరి" అని బిడ్డలకు చెప్పి కమలమ్మ తను బయలుదేరింది.

నారాయణ నాగలికట్టి కోండ్రేసిండు.

కమలమ్మ ముత్యాలు రాల్సినట్లుగా ఒక్కొక్క పత్తిగింజ సాల్లల్ల ఏసింది. శీను ఎనకమార్ల ఊరియాను సాల్లల్ల యేసిండు. తండ్రి నాగలి దుంతుంటె తల్లీ కొడుకులు ఉరుకుల బెట్టుకుంట పనిచే సిండ్రు.

"ఇంకో జత ఎడ్లుంటే రేపయిపోవుగదా నాయనా" అన్నడు శీను తండ్రి ఒక్కడే ఆయాసపడుతుంటే చూసి.

"అదును కాలంరా, ఇప్పుడెవలు ఎడ్లని స్తరు? " అన్నడు నారాయణ.

"బొర్రెంకయ్యకు దొడ్డి నిండ గొడ్లే నాయె. ఓ జత ఇయ్యమనరాదయ్యా ఆ మందమయితే ఓ రొండు దినాలు పనికి పోదురుగని" కమలమ్మ సలహా ఇచ్చింది. నారాయణకు బానే అనిపించింది గని బొర్రెంకయ్య గుణం తెలిసి తటపటాయిం చిండు. 'ఓర్వలేని ముండాకొడుకు. ఇంకో మనిషికి అసరయిదాం అన్నది ఆని జాతి జల్మాన లేదుకదా. ఆన్ని ఈ నోటితో అడిగి లేదు అనిపించుకోవడంఎందుకు? " అన్నడు. మూడు నాల్గు దినాలు ఒక్కడు దున్నిండు. పత్తి గింజలు యేసుడు అయి పోయింది.

"రేపన్నుంచి ఎకరం మందమన్న సద్దలు, జొన్నలు ఎయ్యాలే. లేకపోతే తిండికి సస్తం" అన్నడు.

మధ్య మధ్యల వాన పడతనే వుంది. ఊటగ పడ్డనాడు నాగలి కడ్తలేదు. మల్ల తెరిపియ్యిగానే సద్దలు కూడ ఏసిండ్రు. ఇత్తనాలు ఎయ్యటం అయిపోయేసరికి ఊపిరి పీల్చుకున్నట్లుగా అయ్యింది ఇంటి రాజులకు.

'ఇంత కష్టపడి యేసినం. ఆశ పెట్టుకున్నం. మరీ పత్తి ఏంచేస్తదో చూడాలే' కమలమ్మ మనసులో భయాన్ని బయిటికే అన్నది.

'అంతా మంచే జరుగుతుందిలేమా' శీను ఆశగా అన్నడు. నారాయణ వినుకుంట కూసుండు.

★ ★ ★

ఇత్తనాల పని వొడిసింది. ఏసిన గింజలు మొలకెత్తి బెత్తెడు బెత్తెడు మందం చేనయ్యింది. ఊల్లె హడావుడి అంతా తగ్గింది. యవుసాయదార్లు చేను కల్ల పోయి చూసుకొని వొస్తుండ్రు. వొడ్ల కొండయ్య దాటికాడ మల్ల జనం జమ య్యిండ్రు. దాటి కాడ పని ఉంటె రైతులు లేకుంటె జమ్మాయ జక్కాయ జమైతరు. ట్రాక్టర్లు వొచ్చినంక ముందే దాటి పని దగ్గింది. ఇప్పుడు ఆయింత తగ్గింది. పొయిల పేళ్లకోసమే కొండయ్య ఏరుకుం టుండు. పని ఉన్నప్పుడు పేళ్ల దిబ్బబ డేది. శీను ఇంట్లె పొద్దుపోక దాటికల్ల పోయిండు.

'ఏం శీనూ పత్తిశేను ఏపిచ్చినవంటగా మీనాయినతోని' పలకరించిండు కొండయ్య.

'అవును మావా. ఎంతకాలం సద్దలు, జొన్నలు ఎయ్యాలే చెప్పు' అన్నడు శీను.

'మంచిపనే చేసినవ్‌గని జర కాపాడు కోరి. లేకపోతె నెత్తిన తెల్లగుడ్డే' అన్నడు కొండయ్య.

'కంటెరెప్పోలిగ కాపాడుకోను మావా' అన్నడు శీను.

బాగోతం ఎంకులు, ఎర్కలి సాయిలు అంతా జమయ్యిండ్రు. కొండయ్య ఇంట్లె టీవీల వార్తలు ఇనబడుతున్నయ్. ముఖ్య మంత్రి రోడ్లమీద ఎంత శ్రద్ధ పెడు తుందీ... ఎన్ని కోట్లు అమెరికా నుండి తెలివిగా అప్పు తెచ్చింది చెపుతుండు. హైటెక్ సిటీ ఆంధ్రప్రదేశ్‌కు ఎంత గొప్ప పేరు తేబోతుంది చెపుతుండు. హైదరా బాద్ ఫ్లైవోవర్ల గురించి కూడ బొమ్మలు చూపిస్తుండ్రు. ఆ పనులన్నీ అయితే పట్నం అద్దమోలక అయ్యిద్దంట. అమెరి







కోడు అడగకున్నా అప్పిస్తడంట రోడ్లు చూసి.

వార్తలు ఇనుకుంట కూసున్న కొండయ్యా బీడిముక్క నోట్లెపెట్టుకుని కొరికి థూ అని ఊసిండు.

'ఈ రోడ్లు, ఫ్లై వోవర్లు ఎవనికి కావాలె చెప్పు. అసలు చేతినిండ పనుంటే ఓడన్న రోడ్లమీద తిరుగుతడా. అట్లాంటి పని గురించి ఆలోచించకుంట ఈ పైపై సోకు లెందుకో' అన్నడు ఈసడింపుగా.

కొండయ్యా మాట్లాడుతున్నపుడే ఆరెంపీ డాక్టరు సోవబెమ్మం సైకిలు మీద రయ్యిన వొచ్చి ఆగిండు. 'అనా నువు ఎవన్నయినా అనుగాని.. మా ముఖ్యమంత్రిని ఒక మాటన్నా బావుండదు ఆ...' అన్నడు.

సూదుల సోవ బెమ్మంఎన్టీవోని వీరా భిమాని. సినిమాలు చూసి అభిమానిన్నైనా అంటాడు. సూదులోని ఇంట్లె ఎన్టీవోని సినిమా బొమ్మలు గోడలనిండా పెట్టిండు. అంతటి అభిమానం. ఆయన పోయినా అదే అభిమానం ఆయన పెట్టిన పార్టీ మీద.

ఎనకమార్ల కూసున్న పడిదలోనికి సోవ బెమ్మం మాటలు సూదులు పొడిసినట్ట య్యింది.

దిగ్గునలేసి 'ఏం ఎందుకు వొద్దా. ఆ రోడ్లు తిండి పెట్టేయా? ' అన్నడు. పడిదలో నికి మూడు రంగుల జెండంటే మా ప్రాణం. అది మా రక్తంలోనే వుందని కోసుకొని చూపిచ్చేంత పనిచేస్తడు.

'మీ వోల్లు ఇంతకాలం దేశాన్ని ఏలిండ్రు. ఆల్లేమన్న చేసిండ్రా. ఆల్లు చెయ్యలేని పని మా ముఖ్యమంత్రి చేస్తుం డనేగా మంట' అన్నడు సూదులోడు.

'ఎన్నుపోటు విద్య తెలిసినోనికి జనానికి ఎన్నుపోటు పొడవడం ఓ లెక్కా. ఇట్లాంటి అత్తిలి బిత్తిలి మాటలు చెప్పి చెవుల పూలుబెడతుండు' అన్నడు పడిద లోడు ఆక్రోశంగా.

సూదులోనికి రోషమొచ్చి ఊగిపో యిండు 'ఏహే నీకేం తెలుసులే. మీవోల్ల మొకం మీద తన్నినట్లు మొన్న గెలవ లేదా. ఇంకా ఎన్నుపోటు మాటలేనా' అన్నడు.

పడిదలోడు సూదులోడు తన్నుకునేంత పౌరుషానికి పోయిండ్రు. అప్పటిదాంక మంచం మీద పండుకున్న కొండయ్యా పెద నాయిన గురువయ్యా బీడి తాగుకుంట 'ఓరారి పిలగా నువ్వు సైసు. ఒరే నువ్వాడ కూసో నేనోమాట చెపుత' అని నిమ్మలపర్సిండు.

గాల్లెక పొగొదులకుంట 'అరెయ్ స్వర్ణాంధ్రప్రదేశ్ అని ఊరూరా డప్పుకొట్టుకుంట పెచారం చేసుకున్నా, రోడ్లు ఫ్లై ఓవర్లు కట్టించినా అది సొంత బుర్రల తెలివి కాదు. మీరెందుకురా తన్నుకుంటరు' అన్నడు.

అంతా నోరెల్లబెట్టి కూసుండ్రు. ఎర్కల సాయిలుకయితే అంత మాయలెక్క అని పించింది. అదేంది వొడ్లాయిన గట్ల మాట్లాడుతుండు. సొంత ఆలోచన కాకుంట ఎట్లుంటదీ? దేబె మొకం ఏసు కొని గురువయ్యా దిక్కు చూసిండు. సూదులోడు పడిదలోడయితే బెల్లంగొట్టిన రాల్లయిండ్రు.

గురువయ్యా సన్నగా సరాయించిండు. 'సూడ్రీ మనకు సోతంత్ర్యమొచ్చింది. ఏడా దికోసారి జెండా పండగ చేసుకొని పిప్పర మెంట్లు నోట్లేసుకుంటం. మన నాయకుల మనం ఎన్నుకుంటం. మన నాయకులు మనల గురించి ఆలోచిస్తరు. ఇదంత ఓడన్న చెపుతుంటే బాగుంటది. ఇంటే బాగుంటది. కాని అసలు మాయ ఆడనే వుంది. మన దేశానికి సోతంత్ర్యమొ చ్చింది. కాని ఆ తెల్లనాకొడుకు ఇచ్చేది ఇచ్చిపోక జనం సోతంత్ర్యాన్ని నాయకుల

# వరికి ఎంతో చరిత్ర




ప్రపంచంలో అధికంగా పండేది గోధుమ అయినా, అధిక శాతం ప్రజల ప్రధాన ఆహారం వరి. వరిని ఆసియాదేశాల ప్రజలు అధికంగా తీసుకున్నా, పాశ్చాత్యులు కూడా బియ్యాన్ని తరచూ ఆహారంగా తీసుకుంటారు. తొలి వ్యవసాయం వరితోనే మొదలైందని చాలామంది శాస్త్రజ్ఞులు భావిస్తారు. ఓ మహిళ తమ గుడిసె పక్కనున్న చెరువు దగ్గర పెరిగే మొక్కల్లోని ఓ మొక్క గింజలని కోసి, వండి, కుటుంబ సభ్యులకు పెట్టిందట. అది అందరికి నచ్చింది. ఆ విధంగా వరి చైనాలో మొదటిసారిగా తినే ధాన్యంగా కనుగొన్నారని, ఆ గింజలని పాతి మళ్ళీ ఎక్కువ వరిని పండించారని, ఇలా వరిసాగు మొదలైందని ఓ చైనీయుల జానపద గీతం ద్వారా తెలుస్తోంది.

థాయ్‌లాండ్‌లోని కరక్ అనే ప్రదేశంలో వరిసాగు మొదలైందని, బర్మాలోని షాన్ అప్ లాండ్‌లో, అలాగే భారత దేశంలోని అస్సాంలో వరిసాగు ప్రారంభమైందనే కథనాలు ప్రాచుర్యంలో ఉన్నాయి.

క్రీ.పూ. 344-324లో అలెగ్జాండర్ సైన్యం వెనక్కి వెళుతూ తీసుకెళ్ళిన వరి ధాన్యంతో గ్రీస్‌లో, అక్కడి నుంచి యూరప్‌లో వరి సాగుబడి మొదలైందని అంటారు. 16, 17 శతాబ్దాలలో యూరప్‌లో ప్రబలిన మలేరియా రోగం వరి పండే బురద నేలనుంచి వీచే గాలులవల్ల వ్యాపిస్తుందని నమ్మేవారు. దాంతో ఇటలీలో ఊరి చుట్టుపక్కల వరి సాగుబడిని నిషేధించారు. అమెరికాలో వరిని 20వ శతాబ్దంలో లూసియానాలో మొదటగా పండించారు.

వరిలో రెండు రకాలున్నాయి. మొదటిది ఒ. సాటివా, రెండోది ఒ. గ్లాబెర్రిమా. వీటిలో మొదటి రకమే అధికంగా సాగుబడిలో వుంది. ఇది వివిధ దేశాల్లో ఏడు రకాలుగా వాతావరణాన్ని బట్టి మారింది. మూడో రకమైన ఒ. రూఫీపోగోన్ చైనా, ఆస్ట్రేలియా, అమెరికాలో అధికంగా పండుతుంది. ఇవన్నీ కోటీ ఏభై లక్షల సంవత్సరాల క్రితమే రూపొందాయని శాస్త్రవేత్తల అంచనా. గోధుమ కన్నా వరే ప్రాచీనమైన పంట అని శాస్త్రవేత్తల అభిప్రాయం.

ప్రపంచంలో అధికంగా బియ్యాన్ని తినేది జపనీయులు. సగటున ఒక్కొక్కరు ఏడాదికి 230 కిలోలు తింటారు. బియ్యాన్ని జపాన్‌లో ముద్దుగా 'లిటిల్ బుద్ధా' అంటారు.



హిందూ, బౌద్ధ, యూదు, క్రైస్తవుల మతగ్రంథాల్లో వరి గురించి వుంది. 1960లలో మన దేశంలో సరిపడే వరి పండేది కాదు. కానీ నేడు భారతదేశం వరిని విదేశాలకి ఎగుమతి చేసే స్థాయిలో వుంది. పంజాబ్‌లోని బాసుమతి బియ్యం అన్నిటికన్నా ఖరీదైంది.

చాలాచోట్ల బియ్యాన్ని ఉడకపెట్టి, అన్నంగా వండితే, చైనాలో ఆవిరి మీద వండుతారు. అమెరికాలో రైస్ జూస్ అమ్ముతారు. పాశ్చాత్యదేశాల్లో వరిని ప్రధాన ఆహారంగా వాడేది ఒక్క మెక్సికో లోనే. జర్మన్, స్విస్ శాస్త్రజ్ఞులు పోషక విలువలు అధికంగా గల గోల్డెన్ రైస్ అనే కొత్తరకం వరిని సృష్టించారు. థాయ్‌లాండ్‌లోని వరికి సహజమైన సువాసన ఉండటం విశేషం.

నేడు బియ్యపు పొట్టునుంచి నూనె తీస్తున్నారు. ఇందులో హార్ట్‌అటాక్‌ని నిరోధించే, కొలెస్ట్రాల్‌ని తగ్గించే గుణాలు అధికంగా ఉంటాయి. ప్రపంచంలోని 60% మంది వరినే ప్రధాన ఆహారంగా వాడుతున్నారు.

## కొత్తగాలి...



**డబ్బు**
**క్లబ్బు**
**పబ్బు**
**మిగిలింది జబ్బు!**

*-జి.విజయశ్రీ, అరసవిల్లి*

కిచ్చి పోయిండు. నాయకులు ఇంతకాలం అది జాగర్తగా కాపాడుకుంట వొస్తుండ్రు.

గురువయ్య చెప్పేది శీనుకు అదోతీరుగా అనిపించింది. ఏదో అర్థమైతున్నట్టుగా అనిపిస్తుంది. మల్ల అంతల్లనే అర్థం కానట్టుగా వుంటుంది. 'ఏంది తాతా నువ్వు చెప్పేది? ' పూసగుచ్చినట్టు చెప్పరాదు. మర్మంపెట్టి ఎందుకు చెప్పుడు' అన్నడు.

'అయ్యాల తెల్లోడు సక్కగ మన నెత్తిన కూసుండు. కాని ఇయ్యాల అట్ల కాదు. ఆడు మల్చుకున్న లబ్బరి బొమ్మల మన నెత్తిన కూసబెడుతుండు. అయ్యాల నయినా ఇయ్యాల నయినా తెల్లోనిదే పెత్తనం' గురువయ్య ఆలోచించటానికన్నట్టుగా ఆగిండు.

'ఎట్టెట్లా' అన్నడు ఎర్కలి సాయిలు ఇచిత్రమనిపించి.

'అదంతే అందుకే ముఖ్యమంత్రి హైటుక్కు, ఫ్లైఓవర్లు, రోడ్లు అని పాట పాడుతుండు' ఈ పాట ఆయనది కాదు. తెల్లోని నీడన వున్నోల్లంతా పాడాల్సిందే'.

వింటున్న శీనుకు ఎక్కడో ఏదో దారమోలిగ మెదులుతోంది. లీలగా కదులుతుంది. అర్థం కాదేందీ అనుకుండు.

'తోలుబొమ్మలాటలకు మాటలు రాసిపెట్టుకున్నట్టుగా అమెరికోడు మనకు కొన్ని మాటలు రాసిండు. ఆ మాటల్నే ముఖ్యమంత్రి నాటకంలో చెప్పి మరీ యినిపిస్తుండు. దాని ప్రకారమే రోడ్లు, హైటెక్కు ఎందుకో తెలుసా. దొరలు ఊల్లెకు రావాలంటే బానిసలే బాటలెయ్యాలి. ఆ పని ముఖ్యమంత్రి చేస్తుండు. దాని వల్ల మనకు దమ్మిడాదా ఉందా? గోశీ గుడ్డ గాండ్లకు ఫ్లై వోవర్లు హైటెక్కులు తిండిపెడతాయా పిలగా' గురవయ్య చెప్పాల్సింది చెప్పిండు.

సూదులోడు సైకిలెక్కి పోయిండు. పడిదలోడు తల్కాయ నేలకేసుకొని లేసిండు. అందరి మొకాల్లో ఏదో దిగులు, ఏవో మబ్బు తెరలు, మాయతెరలు కమ్ముతున్నట్టుగా అనిపించింది. ఒకిరికి చెప్పకుంట ఒకరు జారుకుండ్రు. చివరికి శీను లేసి పోబోయి ఆగిండు. గురవయ్య దిక్కు చూసిండు. ఆయన ముసిముసిగా నవ్వింది.

'నువ్వెందుకు చూస్తున్నవో నాకు తెలుసు. ముసలోనికి ఈ సంగతులు ఎట్లా తెలుసని గదా నీ అనుమానం. తెలంగాణ పోరాటం, అనుభవాలు, లోతైన విషయాలు చెప్పెటోల్లు చెపుతరు. మనకు వినాలనిపిస్తే వినొచ్చు ఆల్లవల్లనే నాకీ మాత్రం బుద్ధి అబ్బింది' అన్నడు.

గుండె బరువు దించుకున్నట్టుగా ఊపిరి పీల్చుకుండు. బీడి ముట్టిచ్చి నాలుగు దమ్ములు రప్ప రప్ప గుంజిండు.

శీను మెదడంతా భారమై అడుగులో అడుగేసుకుంట ఇంటి బాట పట్టిండు.

★ ★ ★

నారాయణ పత్తి చేన్ల తిరుగుతుండు. ఒకొక్క చెట్టు దగ్గర కూసొని పశానతుగా చూస్తుండు. చేను బానే జానెడు పైబడి నిక్కింది. ఇంకో పది పదిహేను దినాలల్ల పూతకొస్తది అనుకుండు. చేనును తేరిపార చూసుకుండు. పత్తి చెట్లు పచ్చగా నిగనిగలాడుతున్నయ్. సాల్లల్ల నిలబడి చూస్తుంటే గీతలుకొట్టి ఏసినట్టుగా ఉన్నయ్. సుట్టు తిరిగి చూసుకుండు. సూడ సక్కదనంగ నిగనిగలాడే చేను.

చూస్తుంటే సంబూరమైతుంది.

అంతల్లనే ఏదో ఆలోచన మెదలి గుండె గుబిల్లు మన్నది. పురుగు బూషి ఆశప డితే... కాల్లు జేతులు వొనికిపోయినయ్. అరవశాకిరి చేసిండు. తిండితిప్పలు మరిసి కంటికి రెప్పోలిగ చూసుకుంటుండు. కొండంత ఆశలు పెంచుకుండు. తేడా వొస్తే... ఊహించలేకపోయిండు. అను మానం తీర్సుకుంటందుకు చెట్టు చెట్టు ఆకులు తిప్ప మరీ చూస్తుండు.

'నాయినా ఈ ఆకులు చూడే' శీను గొంతు ఇనబడేసరికి అటుమల్లి చూసిండు. పత్తిశేను ఆలోచన్లపడి శీనొ చ్చింది కూడా గమనించలే. శీను గొంతులో వొనుకు చూసి నారాయణకు వొనుకొచ్చింది. ఉరికినట్టేపోయి శీను చూస్తున్న చెట్టును కండ్లు బూతద్దాలు చేసుకొని చూసిండు' గుండె ఆగిపోయి నంత పనయింది. చెట్టు ఆకుల మీద మచ్చలు. ఆకుముడత తెగులు.

'నిండా మునిగే యాల్లొచ్చిందిరా శీనూ' కూలబడ్డంత పనయ్యింది నారాయణకు. తండ్రీ కొడుకులకు గొంతెండిపోయింది. ఒక చెట్టు... రొండు చెట్లు.... చూసింగ్రు... చూసింగ్రు. నిజమే అక్కడ క్కడ ముడత. నారాయణ కండ్లల్ల నీల్లు తిరిగినయ్. శీనుకయితే దుక్కమే వొస్తుంది. ఒకరినొకరు చూసుకుంట ఇంటి బాట పట్టింగ్రు. కొడుకు మొకం చూసిన నారాయణ గుండె తరుక్కుపో యింది.

'ఎందుకురా అంత దిగులు. పురుగు మందులు వాడుదాం' అన్నడు ధైర్యం తెచ్చుకొని.

శీను కోటి ఆశలు రాలిపోతున్నట్టు కొయ్యబారిపోయిండు.

'పొద్దునే నల్లగొండకు పోయి సైదులు దుకాణంల మందులు తెస్త. ఫికరు బెట్టు కోకు' అన్నడు నారాయణ. కాల్లీడ్సుకుంట ఇల్లు చేరింగ్రు. తండ్రి కొడుకుల మొకాలు చూసి కమలమ్మ గుండె గుబిల్లుమన్నది. కాస్త అయినంక తెలుసుకొని పైటకొంగుతో కండ్లొత్తుకుంది.

'పత్తంటే అంతేగదయ్యా.. వొస్తే మూడు, పోతే ఆరు. ఏంజేస్తం కర్మ ఎట్లుంటె అట్లనే అయితది' కమలమ్మ ధైర్యం చెపుతుంది.

రొండేండ్ల బట్టి ఊల్లె పత్తి ఏస్తుంగ్రు. అంతో యింతో యెనకేసుకుంగ్రు. ఆల్లను చూసి మనమూ ఆశపడితిమి. కష్టపడి తిమి. కల గన్నమా మనకు కష్టాలొస్త యిని' నారాయణ దిగులు గొంతుతో అన్నడు.

'అయినా రైతు పుట్కపుట్టినం. రెక్కలు భూవమ్మకు దాపోయడానికే పుట్టినం. మన పని మనం చేసినం. పాలముంచేది నీటముంచేది... మన చేతులుందా' నారా యణ ఊరట మాటలు అన్నడు.

బడికి పోయిన ఆడపిల్లలు వొచ్చింగ్రు. తల్లీ తండ్రీ మొకాల్లో దిగులు చూసి ఆల్లకు దిగులు పట్టుకుంది. గనగన ఉరు కుల బెట్టి పనిచేసే పిల్లలు కాల్ల అడుగుల సప్పుడు రాకుండ తిరిగింగ్రు. పుస్తకాలు ముందేసుకున్నా దిగులు.

కమలమ్మ బిడ్డల దగ్గర కూసుంది. ఉమ, రమల తలలమీద చేతులేసి గుండె తకత్తుకుంది. బిడ్డల బతుకు యాదికొచ్చి కిందమీదయ్యింది. ఆ మాపు ఎవలి కంటి మీదా కునుకు రాలేదు. నారాయణ కండ్లు చీకట్లె పైకప్పును చూస్తనే వున్నయ్.

★ ★ ★

చీకటి మొకానలేసి నల్లగొండకు పోయిన నారాయణ పురుగుల మందులు తీసుకొని ఇంటికొచ్చిండు. నిన్నటి సంది గుండెతావుల లేకుంట అయ్యింది. నీర సంగా మంచంల కూసుండు. అప్పటికే







పొద్దొంగింది. కమలమ్మ అన్ని మంచి నీల్లు తెచ్చి ఇచ్చింది. పగటి ఎండ మండి పోతుంది. పొద్దుననంగ పోయిండు. దిగులుకు సద్దిబువ్వ కూడా ముట్టలే. పాపం నకనకలాడుతున్నాలె అనుకుంది కమలమ్మ.

'అన్నం పెడుతున్నయా' అంటూ ఆమె వంటింట్లకల్ల పోయింది.

నారాయణ మారు మాట్లాడకుండలేసి జాలాట్ల కాల్లు కడుక్కొచ్చుకొని కూసుండు. అన్నం తింటున్నట్టేగని నారాయణకు సయిస్తలేదు. అసలే పత్తిశేనుకొచ్చేది మాయదారి రోగాలు. మాపు పురుగుబడితే సాలు తెల్లారేసరికి నాశనం. ఎట్లుందో ఏమో. దిగులు పట్టుకుంది.

'సైదులు పురుగుల మందులిచ్చిండయా. ఏవన్న అన్నడా ఉద్దరియమంటే' కమలమ్మ పలకరించింది.

ఇంతకుముందు సైదుల్ని అడిగినపుడు ఆ దుకాణం అయితె పెడుతున్న సూద్దాంలే అని నవ్విండు. తీర సైమానికి ఎవని మతి ఎట్ల తిరుగుతదో. అందుకే అడిగింది కమలమ్మ.

అన్నంముద్ద మింగి 'ఆ ఇచ్చిండు. ఉద్దెరిస్తోడు. అంత అల్కగిస్తాడు. బతిలాడిచ్చుకుండు. ఇంకేదేదో అడిగిండులే' అన్నడు.

'ఇంకేం అడిగిండయా' కమలమ్మ గుండెలు అదురుతుంటే అడిగింది.

'ముందే ఫైలాన్సుబేరం జేస్తాడు. ఉట్టిగనే ఇస్తడా, అయినా పత్తిపంటల సంగతి ఎర్గకుంటనే దుకాణం పెట్టిండా, అందుకే ఉద్దెరయితే ఇస్తగని అప్పు తీసుకున్నట్టు గీడ సంతకం పెట్టన్నడు. తప్పుతాది' నారాయణ నీరసంగా అన్నడు. ఎక్కడో ఓడిపోతున్నట్లుగా ఉంది.

'ఉన్న ఊరోడు. నమ్మకం లేదంటనా ఆనికి' కమలమ్మకు ఆ మాటిని కాస్త రోషం వచ్చినట్టయ్యింది.

'పైస ముందు అంతా ఒకటేనమ్మా' నారాయణ వేదాంత ధోరణిలో అన్నడు.

అయినా కమలమ్మకు తృప్తిగా లేదు. 'ఎక్కన్నుంచో వొచ్చిన ముండాకొడుకులకయితే తియ్యతియ్యని మాటలు చెప్పితే ఓనికి తెల్వకుంట ఓడుపోయి ఇస్తడు. అదే కష్టం చేసుకొని బతికేటోల్లం. అందునా కండ్ల ముందల తిరిగెటోల్లం. ఆనికి నమ్మకం కుదరలేదంటనా ఇచిత్రం కాకపోతే. అంత నడవంత్రపు కాలం? ' కమలమ్మకు గుండె గాయబడ్డట్టు అయ్యింది. బ్రమని ముక్కుచీది కొంగుతో తూడ్సుకుంది.

'అల్లయితే నాలుగురూపాల మిత్తిస్తరు. ఆ ఆశకు ఆల్ల ఇంటికి పోయిస్తరు. మనమెంతిస్తము మిత్తి. అదీ పంటను నమ్ముకున్నోల్లం' నారాయణ ఇంకేదో చెప్పబోయి ఆగిండు. చేయి కడుక్కొని లేసిండు.

కమలమ్మ తట్టి తీసేసి మల్లా పెనిమిటి కాడికొచ్చి నిలబడ్డది. మంచం పక్కన పురుగుమందుల సంచి, దాని పక్కన మందుకొట్టే పంపూ వున్నయ్.

'ఈ పంపు ఎవర్ని అడుక్కొచ్చినవయా కొత్తదానోలిగుంది' కమలమ్మ అడిగింది.

'కొత్త దానోలిగేంది? అది కొత్తదే. తొమ్మిదొందలట. అదీ సైదులు దుకాణంలనే' నారాయణ పైపులు అవి తీసి సైజేస్తుండు.

'ఎందుకయా అంత తగలబెట్టి తెచ్చినవ్ ఒక్కనాటి బాగోతానికి. దండగ' కమలమ్మ పంపును చూసుకుంట అన్నది.

'ఇది ఒక్కనాటి బాగోతమెందుకైతది. సావో బతుకో తేలిందాంక వుండేదే గదా' నారాయణ దమ్ముగుంజి అన్నడు.

'ఎవర్నన్న అడిగితే గడిసిపోవు గదనయా'

'ఎవర్నడుగుతం. ఊరంత ఇదే లొల్లిల

వుంద్రు. ఎవనిగోసి ఆడు సదురుకుంటం దుకే సరపోతలేదు. అంతా పంపులు ఈపుల ఏసుకొని పత్తిశేన్ల తిరుగుతుంద్రు. మనం ఎవల్నన్న అడిగినా రేపో మాపో ఇస్తమంటరు. అప్పటిదాంక ఆగితే ఇంకేం మిగిలుద్ది చేతిల చిప్ప' అన్నడు.

కమలమ్మ మనసు భారంగా కదిలింది.

'శీనుగాడెటు పాయె. పత్తి మందన్నా కొడదాం' అన్నడు నారాయణ. ఆడు నిన్న సందకాన్నుంచి గుండె బలిగినట్లయిండు. నువ్విట్ల నల్లగొండ దిక్కుపోంగనే పత్తి శేను చూసొస్తమా అని పోయిండు' కమలమ్మ చెప్పింది.

'ఏం చూస్తడు. చూస్తే గండం గడుసుద్దా' నారాయణ అంటుండంగనే శీను ఇంట్లెకొచ్చిండు. మొకమంత పీక్కపోయి వుంది. ఎండల తిరినట్టుంది బూషిబూషి అయ్యిండు.

'యాడికి పోయినవు శీనూ' నారాయణ అన్నడు కొడుకును చూసి.

'చెల్కలకు' నీరసంగా అనుకుంట ఇంట్లె కల్ల పోయిండు.

'ఏంది కొడకా. పొద్దున పోయినవ్. కూడు నీల్లు ఎడబాసి కూసుంటే పత్తిశేను బాగయిద్దా' అనుకుంట అన్నం పెట్టింది తల్లి. శీను పరధ్యానంగా అన్నం తిన్నడు. పురుగుమందులు, పంపు చూసిండు.

'ఇయ్యాల కొట్టకుంటే శేతికందదు నాయినా' అన్నడు లోగొంతుతో.

'పోదాంపా. ఎండ సల్లబడ్తది ఈ లోపుల. గాశారం కూసున్నంక తప్పుతాది' అని మంచంల నుంచి లేసిండు నారాయణ.

పంపు, రొండు బిందెలు, పురుగుమందులు తీసుకొని తండ్రి కొడుకులు యెల్లింద్రు.

కమలమ్మకు సీడుగింజల కర్సు, పురుగు మందుల కర్సు, అప్పు పత్రాలు యాదికొచ్చినయ్. కష్టం చేసుకుంటోనికే కష్టాలు పెడతవు గదరా బగమంతుడా' అనుకుంది.

పత్తిశేను కాడికొచ్చింద్రు తండ్రీకొడుకులు. యాప చెట్టునీడకు పంపు, బిందెలు

## ఋణపడి ఉంటా!



ఎలికట్టె శంకరరావు

పుట్టింది నల్లగొండ జిల్లా, మారుమూల ఊరు ఎర్రగూడెంలో. అమ్మ అమృతమ్మ, నాయిన ఎలికట్టె లింగారావు.

నలభై కథలు రాసిన. 'జారుడుబండ', 'ఉనికిపాట్లు' పేరుతో కథాసంపుటాలు వెలుగు చూసినయ్. 'యాది' పేరుతో దీర్ఘకవిత కూడా.

నాతో కలం పట్టించింది డాక్టర్ నోముల సత్యనారాయణ. ఈ నవల రాయించింది దేవులపల్లి కృష్ణమూర్తి. సాహిత్యంలో నాకు తోడు నాజీవిత సహచరి అరుణ.

నాతొలి నవలకు బహుమతినిచ్చి ప్రోత్సహించిన 'చతుర' ఋణం తీర్చుకోలేనిది.

చిరునామా:

**ఎలికట్టె శంకరరావు,**
కేరాఫ్ నోముల సత్యనారాయణ,
రవీంద్రనగర్, నల్లగొండ,
నల్లగొండ జిల్లా (ఆం.ప్ర)





పెట్టింగ్రు. నారాయణ పురుగుమందుల సంచిల నుండి డబ్బాలు తీసి బయిట పెట్టిండు. శీను బిందె తీసుకొని 'నాయినా బొర్రెంకయ్య బోరుపోస్తుంది, నీల్లు పట్టు కొస్త' అని కదిలిండు.

బొర్రెంకయ్య ఆయిన శెల్కల నడిమద్దెల ఆరించుల బోరేసిండు.. మట్టసంగ నీల్లు పోస్తది. బత్తాయి తోట పెట్టిండు. ఈ యేడే కాతకు కూడా వొచ్చింది. నారాయణకు పక్కగెట్టే.

నారాయణ పంపు పశానతుగ చూసిండు. మూత, పైపు సరిచూసుకుండు. దోతి మోకాల్లమీదికి చెక్కి కాశబోసిండు. సైదులు చెప్పినట్టుగా కొలిచి పంపుల పోసిండు. ఈ లోపల శీను నీల్లు తెచ్చి పంపుల పోసిండు. మూత బిగిచ్చిండు నారాయణ. గాలిగొట్టి సరిగా పని చేస్తుందో లేదోనని పత్తిచెట్ల మీదికల్ల కొట్టిండు. కొత్త పంపు. మందు ఎగజిమ్ముతుంది. పంపు బెల్టులను పట్టుకొని భుజానికేసుకుంటందుకు కొద్దిగా ఒంగిండు. శీను ఆసరా పట్టిండు. వీపున పంపు సంసార భారమోలిగ అనిపించింది నారాయణకు. రైతు ఎన్ను మీద విషం కూసున్నట్టుగా అనిపించింది.

'నాయినా నేను నీల్లకు పోత' అని మల్లా బిందె అందుకుండు శీను. జప్ప జప్ప వురుకుతున్నట్టే శీను బిందెలతో నీల్లు మోస్తుండు. నారాయణ అంతకంటే కాల్లాడించుకుంట పత్తి చెట్ల మధ్య తిరుగుతుండు. నాలుగైదు వరుసలకు మునుంబట్టి మందు కొడుతుండు.

ఎండ సల్లబడ్డది. ఉరుకుల పరుగుల మీద కొడుతుండు నారాయణ. వీపున పంపు. గుండు మోస్తున్నట్టుగా వుంది. బీడీ తాగాలనిపించినా మందువాసన అని ఊకుండు. శీనుకు కాల్లు, మాడు నొప్పులు మొదలయినయ్. కొడుకు గసపెట్టుకుంట నీల్లు మోస్తుంటె నారాయణ కండ్లు తడిబారినయ్.

నీల్లబిందె పట్టుకొచ్చిన శీను కిందపెట్టి గస తీసుకుంటుండు. ఒంటి మీద బట్టలు తడిసి ముద్దయినయ్. మాడు ఒత్తుకుంటుండు. ఎర్కలేని పానం అనుకుండు నారాయణ.

'శీను జర అలిపిరి తీసుకో' అన్నడు నారాయణ.

తండ్రి మాటకు ఆగిండు. నారాయణ కూడా పంపు ఖాళీకాంగనే కింద పెట్టిండు. చేతుల మందు బిందెల కడిగి బీడి ముట్టించిండు.

తండ్రికొడుకులు యాపచెట్టుకింద తెల్ల బండమీద కాల్లు జాపికూసుండ్రు. నారాయణ మనసు ఆందోళనగా వున్నట్టుంది. గుప్ప గుప్పమని పొగ వొదులుతుండు.

పత్తిచేను దిక్కు తేరిపార జూసిండు. ఇంకా సగానికి ఎక్కువనే వుంది. చీకటి పడేటట్టుంది. అయినా సరే ఇయ్యాల ఖతం జేయాలె. లేకుంటే చేతికందదు అనుకుండు.

యాపచెట్టు కింద ముంతల నీల్లు ఎత్తి గడగడ తాగిండు నారాయణ.

'శీనూ కూసుంటె కూసున్నట్టే అయితది కొడకా లే అన్నడు' నారాయణ.

మల్లా తండ్రి పంపు ఎత్తుకున్నదాంక ఉండి బిందె అందుకుండు.

బాగా చీకటి పడ్డదాంక కొట్టిండ్రు. పత్తి చెట్లు చీకట్ల నల్లగ కనిపిస్తున్నయ్. అయినా సాల్లల్ల బడి తిరుగుతుండు నారాయణ..

తండ్రికొడుకులు మొత్తం మీద పని ఖతం చేసిండ్రు. ఒల్లు హూనం అయినట్టనిపించింది. బొర్రెంకెయ్య బోరుకాడ కాల్లు జేతులు కడుక్కుండ్రు. తెచ్చిన వొస్తువులు తీసుకొని ఇంటిబాట పట్టిండ్రు.

ఒంటి అలసట, పత్తిచేను గురించి

బెంగ. కాళ్లీడ్సుకుంట నడిచింద్రు. చీకటి చీకటిగా వుంది. బాట మసక బారినట్లుగా వుంది.

★ ★ ★

అది మొదలు నారాయణ యిరాము లేకుంట పత్తిశేను సుట్టు తిరుగుతుండు. వారందినాలు గడవకముందే మల్లా పంపు భుజాన ఏసుకోవాల్సి వస్తుంది.

'ఒక్కరోజు అటిటు అయినా నిండ మునిగిపోతం కొడకా' అన్నడు శీనుతోని.

కంటిమీద కునుకు లేకుంట అయ్యింది. గుండె తావు దప్పినట్టుయ్యింది. ఒక్కోసారి ఎందుకు పెట్టుకుంటిరా భగమంతుడా అనుకుంటుండు. ఇట్టాంటి నడమంత్రపు పంట తెచ్చిన గుంటూరోల్లను అమ్మనాబూతులు తిట్టుకుండు. కొర్రలు, సద్దలు తినె టోల్లకు పత్తి అని ఏగర బెట్టిరి. ఇంట్లె వుండేటోల్లు బజార్ల పడేకాలమొచ్చె నారాయణ ఆలోచనలు సాగిసాగి కొడుకు మీద కొచ్చినయ్.

సదువుకుంటోడు ఎవుసాయానికని వొచ్చె ఎంత చెప్పినా యినడాయె. ఏందీ బాద? ఏం బతుకు ఉంటదనుకుండో. ఎవుసాయమంటే మట్లె మానెడు బోసి ఇంట్లె పుట్లు పోసుకోవడం అనుకుండేమో. ఆ రోజులు ఇపుడున్నయా. యవుసాయం జూదమయిపాయె. కొడుకు ఎర్గక ఇండ్ల బడె. కొడుకుమీద కోపం కూడా వొచ్చింది. ఈడు ఒకటే చెవుల జొర్రీగోలిగ పత్తి పత్తి అనబటికే తను తలపూపె. తనన్నా గట్టిగ వొద్దనడాయే. అయినా తను మాత్రం అనుకున్నాడు ఇంతమాల కష్టం వుంట దని. నారాయణ ఆలోచనలు సాగిసాగి సైదులు దుకాణం అప్పు కాడికి చేరినయ్. ఇంతకు ముందు తిన్నమా పన్నమా అన్న ట్టుండే సంసారం. ఇపుడు అప్పుపత్రాల మీదికి ఎక్కె. అప్పు యాదికొచ్చి గుండె లటలట కొట్టుకుంది.

ఇంట్లె ఆలోచనలు. తల తాకట్టు పెట్టుడు. చెమట దారబోసుడు. నిమ్మలం లేని బతుకు అయపాయే గదా అని దిగులు పడ్డడు.

ఒక్క నారాయణ పరిస్థితే కాదు. ఊరు ఊరంతా తలపట్టుకొని కూసుంది. నల్ల గొండ బస్సెక్కుడు పురుగుల మందులు తెచ్చుడు. పంపులు భుజాలకేసుకొని పత్తి చేన్ల తిరుగుడు. ఇంట్లె వున్నా పత్తి చేన్లే కండ్లల్ల తిరుగుతున్నయ్. పడుచుపోరలు పెండ్లాల పక్కనున్నా పత్తిచేను యాది కొచ్చి దిక్కున లేసి కూసుంటుంద్రు. పత్తి ముచ్చట్లు తప్ప మరో ముచ్చట లేదు.

ఈ ఏడు మరీ కడుపుల పేగులు లేని బంటు ఎల్లయ్య కూడా సీలింగు భూమిల పత్తేసిండు. బక్కపానానికి కింద మీదయి తుండు. అప్పు పుట్టేయాల్ల లేదు. మందు కొట్టే పంపు లేదు.

ఎల్లయ్య కాళ్లీడ్సుకుంట నారాయణ ఇంటికొచ్చిండు. మొగురానికి ఆనుకొని నిలబడ్డడు.

'ఏం ఎల్లయా ఏమొ పనిమీదొస్తివి' నారాయణ బీడి ఎలిగించి అడిగిండు.

ఎల్లయ్య చూస్తుంటే ఓ బీడి ముక్క ఇచ్చిండు. ఎల్లయ్య ముట్టిచ్చిండు.

'ఏందివాయ్ దిగులు? ఎట్లుంది పత్తి చేను? ' నారాయణ అడిగిండు.

నారాయణ మాటకు ఎల్లయ్యకు బోరున ఏడవాలనిపించింది. తలపైకెత్తి బీడిపొగ వొదిలిండు. దుక్కాన్ని దిగమింగిండు.

'కాల్లయేల్ల బడి సైదులు కాడ పత్తి మందు తెచ్చిన. పంపు తాకతు లేదాయే. బొర్రెంకయ్య ఇంట్లె నాలుగు పంపులుంట యికదా. ఇయ్యకపోతడా అని నోరుతెర్సి అడిగిన. మా దరమాత్ముడు పంపులు మూలకు పెట్టుకొని ఇయ్యాల మందుకొడు తున్నం వాయ్ అన్నడు. అయిన జీతగాడేమో ఇంకో నాలుగుదినాల దాంక పనేం







లేదు అనిచెప్పె. ఆశపడి అడిగి లేదనిపిం చుకుంటి. ఎటుతోయక ఇటొచ్చిన' ఎల్లయ్య దిగులు గొంతుతో అన్నడు.

నారాయణకు అర్థమైంది.

'ఇప్పుడే కొట్టి ఇంటికొచ్చిన రేపు తీరు బాటే తీసుకపోయి కొట్టుకో' అన్నడు.

ఎల్లయ్య మాట ఇన్న కమలమ్మ అటొ చ్చింది.

'ఏం ఎల్లాయ్ అడగక అడగక ఆ పీతిల ఇత్తులు యేర్కతింటోన్ని అడిగితివా? బొర్రెంకయ్య ఏ అక్కరకన్న ఓ పనిముట్టు ఇచ్చిండా. అని పాపపు పనిముట్టుతోని ఎవడన్న ఓ పూట గడపుకుండా. సాటి కులమోల్లం మేమే ఓ సారి మొద్దులు తీస్తందుకు గడ్డపార అడిగితేనే కాలీగనే ఉన్నయ్ గాని మొనలు పెట్టిచ్చిన అరిగి పోవా అన్నడు. అసుంటోడని తెలిసి ఎంత బాగ అడిగినవ్ వాయ్. ఎర్రిబాగులోనివా ఏంది' అన్నది కమలమ్మ. మాటల్లో కసి, బొర్రెంకయ్యను ఏదో తిట్టాలన్న కోపం. ఓర్వలేని ముండాకొడుకు అనుకుంది.

ఆయనకు అక్కరున్నపుడు మాత్రం తియ్యతియ్యగ మాటలు చెప్పి 'రావాయ్ కూలిస్త. మాపటీలు రొండుసీసాలు చెపుత గౌండ్ల కాశయ్యకు అంటండు. తీర మన అక్కరకు పోతె మాత్రం పురుగుని తీసి నట్టు తీసేస్తడు. ఎంతయినా మా దొడ్డమ నసు' అన్నడు. ఎల్లయ్య బీడిముక్కను బయిటికి ఇసిరేసి,

'ఆ సరే సరేగని పంపు తీస్కపోయి పనయ్‌పోయినంక కడిగి తీస్కరా. అట్నించి అటే మల్లెవరికన్న ఇచ్చేవు. నేను బజాట్లపడాలె' అన్నడు నారాయణ.

ఎల్లయ్య 'అయ్యో పని కాంగనే మల్ల బద్రంగ అప్పజెప్పను' అని పంపు తీసుకొనిపోయిండు.

★ ★ ★

కాలం గడిసింది. పత్తి పూత పిందె కాడికొచ్చింది. పంపులు ఆడ్తనే వున్నయ్. నల్లగొండకు పత్తిమందుల జాతర సాగుతనే వుంది. దిగులు పెరుగుతనే వుంది.

పురుగుమందులు కొట్టి అలిసిపోయిన రైతులు చేనుమీద తెల్లటిపత్తి కని పించే సరికి ఆశపడ్డరు. పొయ్యింది పోంగ మిగిలింది దక్కినా బయిట పడ్తం అను కుంద్రు.

అటిటు అయ్యేసరికి ముందుగాల్ల ఏసి నోల్లు పత్తి తెంపుడు మొదలు పెట్టింద్రు. పొద్దాకంతల పత్తి జల్లలల్ల, బస్త సంచు లల్ల ఇంటికి చేరుతుంది.

రొండు మూడుసార్లు తెంపినోల్లు మల్ల పత్తిమందు కొట్టలేక వొదిలిపెట్టింద్రు. అప్పటికే చేతులు కాల్చుకున్నోల్లు కాల్చు కుంద్రు. ఇంకా ఆశ సావనోల్లు ఇంకో పదే నుదినాలు కాపాడుకుందాం అని పత్తి యెంట బడుతుంద్రు.

## చతురోక్తులు



**ఆల్బెర్ట్ ఐన్‌స్టీన్ ప్రఖ్యాత భౌతిక శాస్త్ర వేత్త. ఆయన చమత్కారి, హాస్యప్రియు డు. వివిధ సందర్భాల్లో ఆయన పేల్చిన చతురోక్తులు...**

### నేనలా చేశానా?

**ఓ**సారి ఐన్‌స్టీన్ ఒక పార్టీలో వయొలిన్ వాయిస్తున్నారు. తనతోపాటు వచ్చిన ప్రఖ్యాత హంగరీ హాస్య నాటక రచయిత ఫెరెంక్ మోల్నార్ అతడు తప్పు వాయించడం చూసి, నవ్వి, దాన్ని ఎలా సరిగ్గా వాయించాలో చెప్పాడు. దీంతో ఐన్‌స్టీన్, 'మీరెందుకు నవ్వారు? నేనెప్పుడైనా మీ హాస్య నాటకాలను చూస్తున్నప్పుడు నవ్వానా?' అని ప్రశ్నించాడు.

బేరగాండ్లు దిగిండ్రు. అడ్డికి పావుశేరుకా డికి అడుగుతుండ్రు. పురుగు మందులు కొట్టేటప్పుడు బంగారమోలిగున్న ధర పడి పోయింది. ఎవలి నోట ఇన్నా మరీ ఇంత అన్యాయమానల్ల అంటుండ్రు.

నారాయణ లెక్కలేసుకుండు. రొండెకరా లకు పన్నెండువేల అప్పు. కష్టం ఇంక లెక్కలేదు.

ఆటిటు ఏరుకున్న పత్తి ఈ దోపకం ధరలకు అమ్మితే అప్పు తీరదు. సీడుగిం జల అప్పు అట్టనే వుంది. అదో మూడు వేలు.

గీతలు గీసుకుంట కూసున్న నారాయణ కాడికి ఎల్లయ్య వొచ్చిండు. మొకంల సొంతం సావుకల. మొగురానికి జారగిల బడి కూసుండు. నెత్తిన చేతులు పెట్టు కుండు.

"ఏం వాయ్ ఏందీ దిగులు. ఏమాత్రం వొచ్చింది" నారాయణ ఓదార్పుగా అడి గిండు.

'ఎక్కడి పత్తయా. ఒకటి రొండుసార్లు మందుకొట్టిన. అస్సలు పురుగు చేతులకు రాదయే. ఇంగ వొశంగాక వొదిలిపెట్టి. ఈ యేడు పంట పానంమీదకి వొచ్చె. సైదులు ఉచ్చ బోయనిస్తలేడు' గుడ్లల్ల నీల్లు తిర్గుతున్నయ్ ఎల్లయ్యకు.

'పత్తి ఉందంటే సరే అమ్మినంక ఇస్తడు అనుకుందు. చెయ్యలేక ఒదిలిపెట్టివి. మరి అప్పు కట్టు అని సైదులు పానంమీద కూసుండు' ఎల్లయ్య వలవల కన్నీరు కార్సిండు.

ఎల్లయ్యను చూస్తుంటే నారాయణకు నాలిక పిడ్స కట్టినట్టయ్యింది.

'లంజకొడుకులు పత్తికి వొరిగినమని అడ్డగోలు ఇత్తనాలు ఇచ్చిండ్రు. అయ్యన్ని గుంటూర్ల తయారయ్యేయేనట. సంచులల్ల బోసి సీలు కొట్టి అమ్ముతుండ్రు.

పురుగుమందులు కూడా వొట్టి దోపకం. కొడుకులు అంతా కల్తీ తెచ్చి అమ్మిండ్రు. లేకపోతే పత్తి రోగానికి ఇంతింత మందులు కొట్టాల్నా' ఎల్లయ్య ఆక్రోశంగా బూతులందుకుండు.

ఎల్లయ్య అనేదాంట్లె నువ్వు గింజంత అబద్ధం లేదు. ఎంత మంది నోట్ల ఇన లేదు నారాయణ. నల్లగొండ షాపులమీద పడి రైతులు గొడవలు చెయ్యలేదు. అయినా ఏం లాభం. ఎవడు చూసినా రైతును నిలువున ముంచుదాం అని అను కుంటోడేనాయె.

ఎల్లయ్య ఎందుకొచ్చిండో ఏమోగని ఓ రొండు బీడీలు తాగి లేసిపోయిండు. కొండంత దిగులుతో పోయిండు. అసలే బక్కపానం గిలగిల లాడుతుండు. దేవుని మీద బారమేసి కదిలిండు.

నారాయణ అయినకాడికి సాలని అమ్మి అప్పు కట్టిండు. ఆరునెల్లు కష్టం పోను ఎనిమిదివేల అప్పు తేలింది. సైదులు కాడి పత్రాలు అట్టనే ఉన్నయ్.

★ ★ ★

పత్తిచేను పనిమీద పడ్డ శీను చానా దినాలయ్యింది సుదర్శనను కలవక. ఓసారి కలిసొద్దాం అని బయలుదేరిండు. బజాట్లె ఒకలిద్దరు పత్తి బేరగాండ్లు ఎదు రుబడ్డరు. అప్పటికే ఊల్లె పత్తి అంతా అమ్మేసిండ్రు. ఇంకా సందుల గొందుల ఎవలి దగ్గరుందా అని బేరగాల్లు ఆరాతీ స్తుండ్రు.

అయినా అప్పులు తలమీద పెట్టుకొని రైతులు ఇంట్లె పత్తి నిల్వదాచుకుంటరా? అప్పులోల్లు ఊకోనిస్తరా? ఏ ఎల్లినమా రాజో దాసుకుంటడు బొర్రెంకయ్య అసుం టోడు.

బేరగాళ్ళ మాటల్లో పత్తి ధర పెరిగి నట్టు ఇన్నడు శీను. గుండె కలుక్కుమ న్నది. ఎంత దగా? రైతులు ఇత్తనాలకు పోయినపుడు ఆ ధరలు ఆకాశాన్నంటు







తయ్. ఎరువులకు, పురుగు మందులకు పోయినపుడు ఆ ధరలు చుక్కలు తాకుతయ్. అప్పుడు పంట ధరలు బాగుంటయ్. పత్తి చేను ఏసినపుడు పత్తి ధరలు మీద ఎట్ల మాట్లాడింద్రు. కింటాలుకు అంత పలుకుద్దా? ఇంతవరకు ఎపుడు చూడలే.

అయితే ఈసారి ఎయ్యాలె అని ఏసింద్రు. తెగించి ఇత్తనాలు, పురుగుల మందుల మీద ఖర్చు పెట్టింద్రు. పత్తి పువ్వ పడేదాంక అదే ధర వుంది. తీరా పత్తి చేతికొచ్చేయాల్లకు ధరలు తగ్గడం మొదలు పెట్టినయ్. బలుపుగ పంటొచ్చే నాటికి మందులిచ్చేయాళ్ల లేకుంట అయ్యింది. ఎక్కడుంది మోసం. ప్రభుత్వం ధరల రేట్లను చూస్తుంది తప్ప పట్టించుకుంటుందా? పంట లేనపుడు పలికిన ధర పంట వొచ్చేసరికి ఎందుకు పడిపోతుందో ఆలోచించిందా? ఆలోచించదు.

ప్రభుత్వాలకు ఈ రైతులు, కాయకష్టం చేసుకునెటోల్లు ఓటరు లిస్టులో ప్రాణాలతో వుంటే సాలు. వారి బతుకుల గురించి అక్కరలేదు. దళారులు అంత బాహాటంగా ధరల హెచ్చుతగ్గులతో మోసం చేస్తున్నా ప్రభుత్వం పట్టించుకోదు. నిజంగా ప్రభుత్వానికి చిత్తశుద్ధి వుంటే ధరలను కంట్రోలు చేయలేదా? దానికి అవసరం లేదు. దళారుల క్షేమమే కావాలి. రైతులు పట్టరు. ఏ ఉత్పత్తికయినా ఉత్పత్తిదారుడు ధర నిర్ణయిస్తుండు. పురుగు మందులు ఎరువులు చూస్తలేమా? ఆడ చెప్పిన కాడికి ధరపెట్టి కొంట లేరా? రైతు పండించిన పంటకు ధర నిర్ణయించే హక్కు రైతుకెందుకుంటలేదు. ఉండదు. ఉండటం ప్రభుత్వానికి ఇష్టం లేదు. రైతుకు ధర నిర్ణయించుకునే శక్తి ఉంటే రాజకీయ పార్టీల పప్పులుడకవు. ఆల్లు పెట్టే మాయదారి పథకాలకు ఆశపడరు. అప్పుడు ప్రభుత్వాలను, పార్టీలను నిలబెట్టి కడిగేస్తరు. వాళ్లకు ఎదురు నిలిచే రైతును భరించగలరా? ఈ లఫంగి రాజకీయాలు తట్టుకుంటయా? దేశానికి రైతు వెన్నెముక అని చెప్పుకుంటరు. కాని రైతుకు వెన్నెముక ఉంచరు.

అంతా మోసం, దగా. రైతుల బతుకుల మీద గద్దోలిగ వాలి కష్టాన్ని తన్నుకుపోతరు. అయినా రైతు అమాయకుడు కదా. నోరు లేనోడు కదా అడగలేడు. అదీ రాజకీయుల ధైర్యం. తరతరాలు మోసపోవడానికే పుట్టినట్టుగా రైతు తలవొంచుకొని కష్టం చేసుకుంటూనే ఉంటడు.

శీను ఆలోచనలు ఎటెటో తిరుగుతున్నయ్. ఎక్కడ మోసం జరుగుతుందో స్పష్టంగా కనిపిస్తుంది. అయినా ఎవరాపగలరు? ఆపాల్సినోడే మోసం చేస్తుండె.

ఆలోచనల్లోపడి సుదర్శన్ ఇంటికొచ్చిండు. సాలోల్ల బజారులో మగ్గాల సప్పుడు. రంగులద్దే ఆ బతుకుల్లో కళ లేదు. పాలిపోయిన మొకాలు. బతుకును భారంగా ఈడుస్తున్న ప్రాణాలు.

సుదర్శన్ ఇంటి తలుపు తెరిసే ఉంది. మగ్గం ఆడతలేదు. పరంధాములు కక్కయ్యా లేడా? ఊరికి పోయిండేమో అనుకుండు. మగ్గం పక్కన నూలు. మగ్గం మీద నేస్తున్న చీర సగంలో ఉంది.

'సుదర్శన్... సుదర్శన్'

శీను గొంతుకు సుదర్శన్ బయిటికొచ్చిండు. శీనును చూసి కాస్త నవ్వు మొకం పెట్టుకుండు. మగ్గం పక్కనున్న స్టూలు జరిపేసిండు. ఇద్దరు కూసుండ్రు.

'ఏ శీనూ! పత్తి అమ్మింద్రా! ఏవన్న గిట్టుబాటు అయ్యిందా' సుదర్శన్ అడిగిండు.

'ఏ గిట్టుబాటు సుదర్శన్? సావు దప్పి కన్ను లొట్ట బోయినట్టయ్యింది. ఎనిమిది వేల అప్పు మిగిలింది. చేసిన కష్టం బోయింది. మా నాయిన తల పట్టు

కుందు. అమ్మయితే గుండెలు బాదుకుం టుంది. ఈ పిల్లల పెట్టుకొని ఏంజేసి తీరుస్తం దేవుడా ఈ అప్పులు అని శోకాలు పెడుతుంది' శీను చెప్పిండు. గొంతులో దుక్కం.

సుదర్శన్ సడీ సప్పుడు లేకుండ విన్నడు. చెమటను నమ్ముకున్నోనికి ఎప్పుడు మిగిలేది అప్పులు, కంటతడి. తమ బతుకులేందీ? చూస్తలేడా అను కుందు.

శీను తేరుకుండు, తనేదో దంటగాన్ని పోదామనొచ్చి కష్టాలు చెపుతుండు అని దిగమింగిండు.

'సుదర్శన్! కక్కయ్య లేడా మగ్గం ఖాళీ గుంది'

'ఉన్నడు. ఇంతకుముందే ఇంట్లకొ చ్చిండు. ఇంత తిని మంచం మీద వాలిండు. అయినా ఇన్నాటోలిగ పనులు లేవు. రోజు రోజుకు తగ్గుతున్నయ్? ఇక్కడా దళారులు. మాకు మిగిలేది కష్టమే. స్పిన్నింగు మిల్లులొచ్చినంక నేత బట్టలు ఎవడు కడుతుండు? అయినా ఈ మగ్గాలను పట్టుకొని బతికే ధైర్యమెవరి కుంది. బ్రోకర్లు తయారయి నూలి స్తుంద్రు. వేసిన బట్టలు వాల్లే అంగట్ల అమ్ముకుంటుంద్రు. ఏదో పని వుంది. బయిటికెల్లితె అయింత బతకలేమని చేస్తుంద్రు. ఈ నడుమ పనిగూడ తగ్గింది. ఇగో అదొక్కటే చీర మగ్గం మీద. నూలు కోసం బ్రోకరు కాడికి పోయెచ్చిన నిన్ననే. నాలుగు రోజులు ఆగి ఇస్త అన్నడు. ఇగ ఈ చీర ఒక్కటే గదా. పని లేకపాయే అని నాయిన దిగులు పెట్టుకుండు.

సుదర్శన్ మాటలకు శీనుకు పత్తిశేను యాదికొచ్చింది. కష్టాల్లో మాత్రం తేడా లేదు అనుకుండు.

'శీనూ నేత కార్మికుల పరిస్థితులు మరీ దారుణం. నీడపట్టున్నే వానపాములోలిగ మాడిపోతుంద్రు. వార్తలలో చూస్తున్న వుగా ఎన్ని ఆత్మహత్యలో! ఎప్పుడు మగ్గం ఆగుతదో, ఏ కార్మికుని ప్రాణం పుటుక్కు మంటదో తెలవదు. మగ్గం మీద కాదు మరణ శయ్యమీద కూసున్నట్టుగా ఉంది నేత కార్మికుల పరిస్థితి"

"ప్రభుత్వం ఏదో చేయూతని... మరమ గ్గాలని ఇస్తుంది. రుణాలు కూడా ఇస్తుంది గదా' శీనుకు ఆ పథకాల సంగతి తెల్సినా మరోమాట తోయక అడిగిండు.

సుదర్శన్ ఏదో చెప్పబోయేంతలో ఇంట్లె నుండి దగ్గు యినిపించింది. పరంధా ములు నీరసంగా నడుసుకుంట వొచ్చిండు. కాస్త వొంగినట్లుగా ఉండు. బహుశా కూసోని కూసోని నడుములు పాడైన ట్టుంది. ఒంటి మీద అంగిలేదు. పల్సని పొట్ట ఎండుకపోయింది. పొట్టమీద అడ్డంగా ముడతలు. కండ్లల్లో దిగులు. సొంతం తెల్లబడ్డ జుట్టు. నిండ నలభై ఏండ్లయినా లేని మనిషి పండుముసలో లిగ.

పరంధాములు దగ్గరికి వొచ్చేసరికి శీను తేరుకుండు. "ఏం కక్కయా ఏమన్న సుస్తి చేసిందా, దగ్గుతున్నవ్" అడిగిండు. సుద ర్శన్ లేసి గోడవారకున్న మంచాన్ని వాల్సిండు. పరంధాములు 'అమ్మమ్మ...' అని మూల్గుకుంట కూసుండు. నుల్క మంచం మీద చేతులు ఆనించి వాలిండు.

'ఆ ఏం బాగులే నాయినా' అని మూల్గిండు.

'నాయిన బావుండా? చానారోజులాయె కనబడక అని పరంధాములు సమాధానం కోసం ఎదురు చూడనట్టుగా ఏదో అడుగు తున్నవ్ సుదర్శన్‌ను. 'సర్కారు పథకాల గురించా' అన్నడు.

శీను తలాడించిండు.

'శీనూ నీకింకా తెల్వదు. మా చిన్నప్ప ట్నుంచి గద్దెనెక్కిన ప్రతోడు ఈ పథకాలు

పెడతనే ఉండు. ఎవడన్న బాగుపడ్డడా? ఇంతెందుకు ఇందిరమ్మ గరీభీ హఠావో అని గద్దెనెక్కింది. ఎంతమంది గరీబు గాండ్లు బాగుపడ్డరు? గరీబీ గాండ్లను ఈ సర్కారోడు బాగుపర్సడు. అసలానికి ఆ కోరికే ఉండదు. ఇపుడు పేదరికం దేశంలో తగ్గుతుంది అంటుంండ్రు. నిజమే ఎట్లనో తెలుసా? కూటికి లేనోల్లంతా ఉరి బోసుకొని సావడం వల్ల' పరంధాములుకు ఎవరి



మీదనో కసి.

ఇంత తెలిసి వాండ్లు ఎందుకు నిమ్మ లంగ ఉంటరు. శీనుకు అర్థం కాలేదు. పరంధాములుకు శీను మనసు అర్థమైన ట్టుంది.

శీను ఆయన దిక్కే చూస్తుండు. పొద్దున లేస్తే, మగ్గం నేసే మనిషి, గుండెల్ల ఇన్ని అగ్నిపర్వతాలు పెట్టుకొని అందమైన బట్ట ఎట్ల నేస్తడు? బతుకు మీద భరోసా లేని మనుషులు. ప్రభు త్వాల మీద ఆశలేని మనుషులు. ఇంత మౌనంగా ఎట్ల ఉండగలుగుతుండ్రు. శీనుకు ఓడిపోతున్న బతుకులు కండ్లల్ల మెదిలినయ్.

'శీను నీకో కథ చెపుతా విను'

దేవాంగులు ఒక ఊరికి వచ్చిండ్రంట. దేవాంగులూ చేనేత పనోళ్లలే. మేము దేవాంగులం. మామూలు పద్మశాలీలం కాము. మా పూర్వీకులు దేవతల వస్త్రాలు నేసేవారు. అందుకనే మమ్ముల దేవాంగు లంటారు అని పరిచయం చేసుకుండ్రు.

బంగారు దారాలతో వస్త్రాలు నేస్తాము అని గ్రామ పెద్దలతో చెప్పిండ్రు. వారు నిజమే అని నమ్మిండ్రు. ఒకరికి తెల్వ కుండ ఒకరు బంగారు నగలిచ్చి చీరలు, దోతులు నేయమన్నరు. సరే అట్లనే అని చెప్పిండ్రు. మా పనోళ్ళను తీసుకొని ఫస్తం అని ఎల్లిపోయిండ్రు. అప్పుడే బంగారం తీసుకుంటామని నమ్మమబలికిండ్రు. కొద్దిరో జులకు మళ్లీ వొచ్చిండ్రు పనోళ్ళతోని, మగ్గాలు ఏర్పాటు చేసు కుండ్రు. అంతా బంగారం నగలు దేవాంగుల చేతుల్ల బోసిండ్రు.

రోజులు గడుస్తున్నయ్. బంగారం ఇచ్చి నోల్లు ఎంత వరకయినయా చూద్దామని ఒక్కొక్కరు పోయి చూస్తుండ్రు. ఏవీ బంగారు వస్త్రాలు అని అడుగుతుండ్రు.

అక్కడ పనివాండ్రు మగ్గం నేస్తున్నట్టు, కండెలు ఆడుతున్నట్టు, సరి చేస్తున్నట్టు నటనలు చూపుతుండ్రు. ఎంతకూ వస్త్రాలు పూర్తి కావట్లేదు.

"ఏంది సంగతి నేస్తుండ్రా. సరే వస్త్రాలు ఏవీ" అని అడిగిండ్రు బంగారం ఇచ్చి నోల్లు.

అప్పుడు దేవాంగులు ఏమన్నారో తెలుసా?

ఇదుగో... మీ వస్త్రాలు కనిపించట్లేదా అని అడిగిండ్రు. ఎదురు దాడికి వారు తెల్లమొకాలు ఏసిండ్రు.

"మేము బంగారు వస్త్రాలు, దేవతా వస్త్రాలు నేసేవాళ్లం. మేము నేసే వస్త్రాలు ఒక అయ్యకు అమ్మకు పుట్టినోళ్లకే కనిపి స్తయ్. మీకు కనిపించట్లేదా" అని ఎదురు దాడికి దిగిండ్రు.

ఒక అమ్మకు అయ్యకు పుట్టలేదని ఎవడు వొప్పుకుంటడు. అంతా ఎన్కకు మల్లిండ్రు. ఆ రాత్రికి రాత్రే దేవాంగులు బంగారంతో సహా ఉడాయించిండ్రు'

మధ్య మధ్య దగ్గు వొస్తున్నా ఆపు కుంటూ కథ ముగించిండు పరంధా ములు. శీను, సుదర్శన్ కన్నార్పకుంట ఆయిననే చూస్తుండ్రు.

గొంతు సవరించుకున్న పరంధాములు 'మన ప్రభుత్వ పథకాలు కూడా అంతే.. అన్నీ నటనలే. అవి ఎప్పటికీ అందవు. ఎవడూ బాగుపడడు' కండ్లు చెమ్మగిల్లు తుంటే పరంధాములు ఆగిండు.

శీనుకు ఏదో స్పష్టంగా కనిపిస్తుంది. ఎక్కడో ప్రజల బలహీనత. ప్రభుత్వం



మోసం. దీనికి అంతం లేదా? కుంగి కృశించి పోవలసిందేనా? ఇంత ఘోరంగా ప్రజల జీవితాలతో ఆడుకునే ప్రభుత్వాలు పేదల బతుకుల గురించి ఆలోచించవా? జనం గురించి ఆలోచించే ప్రభుత్వాలు ఎన్నటికైనా ఈ దేశంలో వస్తాయా?

శీను అనుభవం, వింటున్న అనుభవాలు కాదు కాదనే చెపుతున్నయ్. మనసు మూగబోయి భారంగా లేసిండు శీను. దర్వాజ కాడికొచ్చి ఎన్కకుమల్లి చూసిన శీనుకు పరంధాములు రసం పిండిన చెరుకు గడోలిగ కనిపించిండు.




**ప**త్తి మీద అప్పు తేలిన తర్వాత నారాయణకు దిగులు పట్టుకుంది. ఎంతయినా మాయదారి పంట. దానికంటే సద్దలు, జొన్నలే అక్కరొచ్చినయ్. అర్వకష్టం చేసిండు. సీడు గింజల దగ్గర నుంచి ఇప్పటి దాంక పానానికి తృప్తి లేకుంటాయె. అప్పుల నుండి ఎట్ల బయిటపడాల్నో! ఎప్పుడు బయిట పడ్తమో. నారాయణ మనుసుల మాటలు సన్నగా బయటికే యినబడుతున్నయ్.

పెనిమిటి గులుగుతుంటే కమలమ్మకు అర్ధమయింది. అది అప్పు గురించేనని. ఆమె పరిస్థితీ అంతే. కాల్లు జేతులు ఆడ్త లేవు. ఏదో పనిచేస్తుందంటే చేస్తుంది కాని మనసు మనసుల లేదు.

'ఎందుకయా ఒకటే మనాది పెట్టుకుంటవ్. అప్పు లేనోడెవడు. ఇయ్యాల కాకుంటె రేపు తీరుస్తం. రెక్కలు లేవా?' కమలమ్మ గుండె అదురుతున్నా భర్తకు ధైర్యం చెప్పే మాటలన్నది.

కమలమ్మ మాటలు ధైర్యం మాటలయినా ఆమె గొంతులో వొనుకుడు నారాయణ వింటనే ఉండు. పాపం పిచ్చి మాలోకం. తనకు ధైర్యం చెప్పాలని తపన పడుతుంది అనుకుండు.

బడికి పోయిన ఉమ, రమ జంటగా వొచ్చిండ్రు. పుస్తకాల సంచులు పడేసి వంటింట్ల కల్ల పోయిండ్రు. తల్లి తండ్రిని చూసి వాళ్లు ఈ నడుమ దిగులుగా ఉంటుండ్రు. 'లేడి పిల్లలోలిగ చంగనాలు కొట్టుకుంట తిరుగటోల్లు బిడ్డలు. ఈ పాపిష్టి ఇంట్ల పుట్టి ఎట్ల దిగులు పడుతుండ్రో చూడు' భర్తకు చెప్పింది.

నారాయణకు అది కొత్త విషయం కాదు. గమనిస్తనే వుండు. ఇంట్ల బాగుంటెనే సంతోషం గదా పిల్లలకు. ఏం ఎర్గనట్లు ఎట్ల చెంగనాలు కొడ్తరు. నారాయణ బయటికి అనలే.

'ఏం వయా లేవరాదు ఓ ముద్ద తిందువు. ఒకటే దిగులు పడితే మాత్రం అప్పు తీరుద్దా. లే లేసింత తిను'

తల్లి మాట విన్న ఉమ, తట్టె ఇంత అన్నం కూరపెట్టుకొని వచ్చింది. రమ గుండుచెంబుల నీల్లు పట్టుకొచ్చింది. 'నాయినా అన్నం' ఉమ తండ్రి చేతికిచ్చింది తట్టె. నారాయణ అట్లనే మంచం మీద కూసొని అన్నం కలుపుతుండు.

కమలమ్మ మనసు నూటొక్క ఆలోచనలు చేస్తుంది. అప్పు పరిస్థితులు తల్సుకుంటె గుండె గుభిల్లుమంటుంది. అంతల్లనే ధైర్యం తెచ్చుకునే ప్రయత్నం చేస్తుంది. ఏదో ఓటి తెగింపు చేసుకోకుంటే బతకలేము. అప్పుల అప్పు ఓ బోరు ఏసుకుంటే అనుకుంది. గిన్ని నీల్లుంటే ఆ

ధైర్నమే వేరు కదా. చేతి నిండ పని. ఈ దాగుడు మూతలాడే మబ్బుల కోసం ఎదురు చూడాల్సిన పనుండదు గదా అను కుంది.

నోటిదాకా వొచ్చినా భర్తకు చెప్పలేకపో తుంది. తనకే ఆ మాట చెప్పితందుకు ధైర్యం సాలటంలేదు. ఆలోచనలు మాత్రం ఊకోనిస్తలేవు. కమలమ్మ భర్త తట్టికల్ల చూసి 'రమా పిడికడంత అన్నం పట్టక రావే నాయినకు' అని కేకేసింది.

హోం వర్కు చేసుకుంటున్న రమ తల్లి మాటతో లేసింది.

సడీనప్పుడు లేకుంట అన్నం తింటున్న నారాయణ మనసు పరిపరి విధాల ఆలో చిస్తుంది. తను పది పదిహేనేండ్ల పిలగా నిగ ఉన్నపుడు ఎట్ల వుండె బావుల్ల నీల్లు. అలుగు లెల్లినయ్. చేదుడు బావుల్ల అట్ల చెంబుతో నీల్లు ముంచుకున్న గుర్తు. అప్పు డప్పుడే ఊల్ల కరంటు వొచ్చింది. మోటర్లు బిగిచ్చిండ్రు. బక్క రైతులు ఇంకా మోటలే కొడుతుండ్రు. అయినా వాన కాలమైతే మోటలు కొట్టకపోయేది. మోటర్లు తీసి బాయి గడ్డమీద గుడిసెలల్ల పెట్టేటోల్లు. నీల్లు వాటంతటవే కాలుతోని కాలువ తీస్తే బాయిల నుంచి జాలు వారేయి. కారు పంట చేతికొచ్చేది. ఆ రోజులు మ ల్లొస్తయా. పాపపు కాలం. రోజు రోజుకు జల అడగంటుతుంటె. ఊట బాయిలన్ని బొందలయిపాయె. ఆ బొందలు కూడ ఒక్కొక్కటి మాయమైతుండె. అంతా బోర్లు నాలుగించుల బోర్లు ఆరించుల బోర్లు, సబ్‌మెర్సిబుల్ మోటర్లు. భూమిని పిండి నీల్లు తీసే కాలమొచ్చె. సరిగ్గ పదిమైల్లున్న నిల్వానూరు మీది నుంచి కాలువ పోతది. కాల్వ కుడి రోకు పొలాలు ఎట్లుంటయి. చూస్తందుకు రొండు కండ్లు సాలవు. కాలువ ఎడమ రోకు దిగితె సాలు. ఏముంది వొట్టిదే. దుమ్ము, ముప్పారం, ఎర్రబెల్లి, ఎర్రగూడెం ఒట్టి రాల్లగుట్ట, అడివి. పట్టుమని పది గుంటలు వరి పెట్టుకునే రాత లేదాయె. ఆ కాల్వ నీల్లు పాడుగాను. సాగర్ నుంచి అట్లపడి ఏ కొసకో పోతయంట. పక్కనున్న ఈ ఊర్లకు ఎందుకు రావో. నీరు పల్లం ఎరుగు, నిజం దేవుడెరుగు అని పిల్లలు చదువుతుంటె విన్నడు. తన అనుభవం మాత్రం అది కాదనిపిస్తుంది. నీరు బలము ఎరుగు, నిజం నాయకులెరుగు. ఇక్కడ నాయకులంతా కుర్చీల సుట్టె తిరి గెటోల్లేనాయె. ఇక్కడేంది ఆ జాతి లక్ష ణమే అది కదూ. ఓట్లు అడిగితందుకు తప్ప ఇక్కడ ఇబ్బందులను పైన అడిగితం దుకు నోరు రాదు కొడుకులకు.

నారాయణ ఆలోచన్ల పడి ఎక్కడి కెక్కడికో పోయిండు.

'ఏందయా అన్నం ముందల పెట్టుకొని ఎటెటో సూస్తవు'

కమలమ్మ అనేసరికి నారాయణ గబ గబా తిని చెయ్యి కడుక్కుండు.

నారాయణ చెయ్యి తూడ్సుకుంటుంటే శీను ఇంట్లెకొచ్చిండు.

'ఏంరా శీనూ అన్నం పెట్టనా, తింటవా, కొద్దిగ ఆగుతవా' అడిగింది తల్లి.

'పయిటాల్ల పొద్దుపోయినంక తిన్న గదమా జర ఆగు తింట. చెల్లెండ్లు తిన్న రామా' శీను అనుకుంట నారాయణ కూసున్న మంచం మీద కొసకు

**కొత్తగాలి...**

**రోడ్డు పక్కగా**
**నడిచేటప్పుడు**
**ఆలోచనలే ఆలోచనలు...**
**అవే నాకు**
**నడకలు నేర్పేయి!!**

-శైలూషి, శ్రీకాకుళం







కూసుండు.

'ఆల్లు జెరాగి తింటనన్నరు కొడకా. కలి సితిండ్రి మరి' అన్నది కమలమ్మ.

'నాయనా ఈ సంగతి తెల్సా, అప్పారా వోల్లు పది దినాలయ్యిందంట గుంటూరు పోయి, ఇంకా రాలేదు. జనం నాల్గుతీర్ల గనుకుంటుండ్రు' శీను చెప్పిండు.

'ఏమనిరా' తల్లి అడిగింది.

'ఆల్లు ఇగ రారని. అప్పులు ఊటగయి పారిపోయిండ్రని'

'వాల్ల వాలకం చూస్తెనే తెలుసు. యవు సాయం చేసెటోని లక్షణాలు లేవని. లుంగి కట్టుకొని ఊల్లె యవారాలు చేసుడు. జల్సాలు.. అప్పులు గాక ఏం జేస్తయ్. అందునా ఎకరాల కొద్ది పంట. అదీ ముంచె' నారాయణ తన మనసులో ఉన్నది చెప్పిండు.

'నిండ ముంచి పోయిండ్రు గాడ్డి కొడుకులు, ఇంకేడొస్తరు' కమలమ్మ అన్నది.

'ఊల్లెగూడ సరిపోను అప్పులు చేసిండ్రంట నాయినా. బడికాడ కూడ మాట్లాడుకుంటుండ్రు. నేనిచ్చినంటె నేనిచ్చిన అని ఆడోల్లు కూడ అప్పుల లెక్కలు చెవుతుండ్రు. ఊల్లె కోంటాయిన కాడ బానే ఉందంట ఉద్దెర. అప్పు గూడ కూల్లకియ్యలే రేపిస్త అని ఈ నడుమనే తీసుకుండ్రంట. మూడేండ్ల సంది ఉంటుండ్రు. యాడికిబోతయ్ అని ఇచ్చిన అని కోంటాయిన లబోదిబో మంటుండు' శీను ఇంకా చెపుతుండు.

'ఇంతకు ఆల్లు రారా. అప్పుడే ఇయన్ని అనుకుంటుండ్రుగని' నారాయణ ఆ వైపు కూడా ఆలోచించాలి గదా అనిపించి అడిగిండు.

'సైదులు ఎరువుల దుకాణంల అప్పు అట్లనే ఉందంట. ఊల్లె అప్పులున్నయ్. ఈ సారి పండిన పత్తి అంతంతమాత్రమే నాయె. ఆ వొచ్చిన పత్తి అమ్మి ఎవలి పైసలు ఆల్లకు పడేస్త అని గుంటూరు లారీ కెత్తిండ్రంట. ఆ పైసలు తీసుకొని వొస్త మని ఎన్కంగ ఈల్లు పోయిండ్రంట. పోయిన పోకడ అదే'

చూసీ చూసీ ఆల్లు చెప్పిన గుంటూరు పక్క ఊరికి పటేలు పోయొచ్చిండంట.

'వాల్లకేమున్నయండీ ఇక్కడా. వాల్లు నైజాము జిల్లాకే వచ్చారుగదా సేద్యానికి' అన్నరంట పక్కోల్లు.

ఆల్ల జాడ దొరకలేదంట. అమ్మిన పత్తి పైసలు తీసుకొని ఉడాయించిండ్రని పటేలు కూడ అంటుండు' శీను విన్నది సొంతం చెప్పిండు.

'పరాయి ఊరోడు పచ్చగుంటె ఉంటడు. అప్పులుంటె ఉంటడా' అన్నడు నారాయణ.

'ఇంత కతున్నంక ఇంకేడొస్తరు ముండా కొడుకులు. ఊర్ను నిండా ముంచి పోయిండ్రు' కమలమ్మ రొండు చేతులు ఆడించుకుంట అన్నది.

తర్వాత 'ఈ ముచ్చట్ల కేంగని





రమా అన్నం తింర్రే' కమలమ్మ కేకేసినట్టే అన్నది.

ముగ్గురు పిల్లలు ఒకసారే లేసి అన్నం ముందు కూసుంర్రు.

నారాయణ బీడి ముట్టిచ్చిండు. పొగతో పాటు ఆలోచనలు సుళ్లు తిరుగుతున్నయ్. ఇక్కడ యవుసాయం జూదమయ్యింది. నాయకులు జూదమాడుతుంర్రు. బతుకు దెరువుకోసమొచ్చినోల్లు జూదమాడు తుంర్రు. ఎవడు జూదమాడినా బక్క రైతుల బతుకులతోనె గదా! రైతు బతుకు యాదికొచ్చేసరికి కటికోని చేతుల మేకపిల్ల మతిల మెదిలింది. ఎప్పుడు పానం పుటుక్కుమంటదో తెల్వదు. రైతు బతుకు అంతే. ఏ మాపో, ఏ పగలో, దినదిన గండం నూరేళ్ళ ఆయుస్సు, ఎవనికి పట్టని బతుకులు. మట్టిని నమ్ముకున్న బతుకులు మట్టి బతుకులు.

'నాయన రేపు ఊల్లెకు బోరుబండి వొస్తుందంట. ఉత్తకాల్ల రాములు ఏస్త డంట' శీను చిన్నగ అన్నంతినుకుంట తంర్డికి చెప్పిండు.

ఇంతకు ముందే భార్య ఎంతయినా నీటి సౌకర్యముంటే బాగుండయా అనే. అంటే శీను మనసుల కూడా అదే ఉన్నట్టుంది. బోరు ఎయ్యాలని ఉన్నట్టుంది. ఆ మాట సక్కగ చెప్పలేక ఇట్ట చెపుతుండు అను కుండు నారాయణ.

'అట్లనా' అన్నడు నారాయణ మరో మాటనలేక.

తంర్డి ఒక్కమాటతో ఊకునే సరికి శీనుకు అర్థమైంది తంర్డి భయపడుతుం డని. ఏమయితె అదాయే అడిగి సూద్దామ నుకుండు.

'నాయినా మనం ఏద్దాం. ఆలోచించు నాయనా. ఈ దుమ్ముని దున్ని దుక్కపడే బదులు అప్పయినా ఏద్దాం నాయనా' శీను గొంతులో అర్థింపు.

కమలమ్మకు మనసులున్న మాటే కాబట్టి కొడుకు చెపుతుంటే అడ్డుపోలేదు.

'ఏడ బోరేస్తం కొడకా, అది పడ్డదో పడదో తెల్వదు. పడ్డా ఎంత కాలం నీల్లు పోస్తదో తెల్వదు. అప్పు పుట్టేయాల్ల లేదు. ఉన్నప్పుకే తలపానం తోకకొస్తుంది' నారా యణ లోగొంతుతో అన్నడు.

తల్లీ కొడుకుల మొకాలు చూసిండు నారాయణ. ఆల్ల మనసులో బలంగా ఉందని అర్థమయ్యింది, అట్లాగని ధైర్యం సాల్తలేదు.

'చూద్దాంలే' అన్నడు.

★ ★ ★

తెల్లారి పొద్దున్నే పండ్లపుల్ల నములు కుంట దాటికాడికి పోయిండు నారాయణ. వొడ్లకొండయ్య అప్పటికే స్నానం చేసిన ట్టుంది తలమీదంగ. జుట్టు తడితడిగా వుంది. ఇంటి ముందల జనం కూసుంర్రు.

'ఏందర్రా' అన్నడు కొండయ్య జనం గుసగుసలాడుతుంటె.

'బంటు ఎల్లయ్య రాత్రి ఉరి బోసుకుం డంట' బక్కులు అన్నడు.

'అయ్యో మొన్ననే వొచ్చిండు మా ఇంటికి మనిషి. మనాదితోటి ఉన్నట్టుంది. ఏవయా అంటె ఆ ఏం లేదనుకుంట పోయిండు' నారాయణ అన్నడు.

'ఆ మరి శరంగల్లోడు సావకేంజేస్తడు' బక్కులు అన్నడు నేల గీతలు గీసుకుంట.

'ఏముంర్దరా! ఎందుకు. అంత పానం తీసుకునే ఆపదేమొచ్చె ఆనికి? ' కొండయ్య జంజం సరిచేసుకుంట అడిగిండు.

'ఆపద కాకేంది. కడుపుల పేగులు లేని ముండాకొడుకు. ఊల్లె అందరు పత్తేసి ఓ బాగుపడిపోతుంర్దని ఆడూ ఏసే. అప్పాయె. తీరిస్తందుకు ఆనికాడ ఏముంది గోశిగుడ్డ. అయినా అప్పిచ్చినోడు ఊకుం టడా. ఆ సైదులు దుకాణంల ఉద్దెర తెచ్చె కదా. అయ్యి అట్లనే ఉండె. రాత్రి సైదులొ

చ్చిండంట. ఇంటి మీదికి పోయి గాలి గాలి చేసిండంట. అయ్యా అప్పా అని రొండుకాల్లు పట్టుకున్నా ఈ పనికిమాలిన మాటలు ఎన్నాల్లు చెపుతవురా అన్నడంట. చివరాకరికి అమ్మని, పెండ్లాన్ని పొతం జేసిండంట. ఇంగ ఆనిది మాత్రం పానం కాదా. శరం రాదూ. పానం ఇసుక్కు మని పించిందేమో. బిడ్డడు మంది పన్నంక దూలానికి ఉరేసుకుండు' చెపుతున్న బక్కులు కంట్లె నీల్లు తిరిగినయ్.

నారాయణకు గుండె పిసికినట్టయింది. మొన్న వొచ్చినపుడే సైదులు ఉచ్చబోయని స్తలేడయా అనె. ఇంత జరిగినంక ఇంగేం తట్టుకుంటడు. బతుకు చేతుల లేకున్నా సావు చేతుల ఉందనుకుండేమో. నారాయ ణకు ఎల్లయ్య కండ్లల్ల మెదిలిండు. ఎంత ఆశతోటి పత్తేసుకుండు.

వాకిట్ల జనం ఎల్లయ్య సావు గురించి మాట్లాడుకుంటుంటే గురువయ్య మంచం మీద నుంచి లేసిండు దగ్గుకుంట వచ్చి ఓ మొద్దును దాపుచేసుకొని కూసుండు.

'ఎర్రగూడేన ఈ ఎల్లని సావొక్కటే. దేశ మంత ఎంతమంది సస్తుంద్రు. టీవీలో చూడు. అటు పేపరు సదివెటోల్ల అడు గురి. ఊరికో సావుంది. కరువు దెబ్బకు పత్తి దెబ్బకు పుట్ట పుట్ట రైతులు పానాలు తీసుకుంటుంద్రు' అన్నడు గురువయ్య.

కూసున్న జనం వాల్లు విన్న సావుల గురించి ఓల మీదంగా ఓలు చెప్పింద్రు. ఎన్నెని బతుకులు దూలాలకు ఏలాడుతు న్నయ్. ఎన్ని పానాలు పురుగు మందు లకు బలయితున్నయ్. పూసగుచ్చినట్లు మాట్లాడుకుంట్రుండు.

గురువయ్య దగ్గుడు ఆపి మల్లా అందు కుండు. 'ఇంత మంది రైతులు సస్తుంద్రు. ఇంత మంది రైతుల పెండ్లాలు ముండ మోస్తుంద్రు. పండించిన పత్తి రైతు పెండ్లాలకు తెల్ల చీరలు అయితున్నయ్. అయినా ఈ సర్కారోడు కదులుతుండా.

## కొత్తగాలి...

**నాయకుడు వచ్చితే-**
**ఇంద్రుడు చంద్రుడు**
**మొహం మొత్తితే-**
**నియంత నిరంకుశుడు**

**– అద్దేపల్లి భరత్‌కుమార్, చిలకలూరిపేట**

దున్నపోతు మీద ఉచ్చబోసినట్టే గదా!

నిన్న పొద్దూకంతలనే టీవీల ముక్య మంత్రి మాట్లాడుతుండు. అసలు రైతులు సస్తనేలేరంట. ఒకలిద్దరు సచ్చినా మొగుడు పెండ్లాల గొడవల వల్లనో, తాగిన అప్పులు తీర్సలేకనో నంట. రైతు లంతా సుబ్బరంగా యవుసాయం చేసు కుంట సంబూరంగ ఉంద్రంట. ఏ కండ్లు పెట్టుకొని చూస్తరో ఏమో. రైతులు నల్లు లోలిగ రాలిపోతున్నా ముసిముసి నవ్వులు నవ్వుతుంద్రు?' గురువయ్య దగ్గు తెర అడ్డమొచ్చి ఆగింది.

సరాయించి ఖాంద్రించి ఉమ్మేసిండు.

బంటు ఎల్లయ్య ఇంటి దిక్కు కది లింద్రు. 'ఎవల్ని ఏ దినం దూలానికి సూడాల్సివస్తదో' గురువయ్య తనకు తానే అనుకున్నట్టుగా బయిటికన్నడు.

జనంతోపాటు నారాయణ కదిలిండు.

ఎల్లయ్య పీనిగ ఇంట్లె దూలానికేలాడు తుంది. ఏ నడిజాంకాన్నో ఉరివేసుకున్న ట్టుంది. పీనిగ కట్టె జర్సినట్టయి బిర్ర బిగి సింది. నాలిక, కండ్లు బయిటికెల్లినయ్.

ఎల్లయ్యకు భార్య ఇద్దరు చిన్నపిల్లలు. పిల్లలు నోరెల్లబెట్టి చూస్తుంద్రు. భార్య గుండెలు అదిరేటట్లు ఏడుస్తుంది.

"పిల్లల ఆగంజేస్తివి గదరా. అయ్యా అయ్యా పత్తిమీద మన్నుబోయ అయ్యా అయ్యా. ఆ అప్పుమీద దుమ్ము బొయ్య





అయ్యో అయ్యో. ఏం పాపం చేసుకుంటి దేవుడా దేవుడా" తీరొక్కతీరు రాగాలు పెడుతుంది.

పీనిగను చూసినోల్లు కండ్లు నల్సుకుంట బయిటకొస్తుండ్రు.

"పోలీసోల్లు రావాలంట. అప్పటి దాంక పీనిగను దించొద్దంట. దించితె తప్పు బడ్త రంట" ఎవలో విన్న మాట చెపుతుండు.

"పోలీసోడు ఇప్పుడొస్తడా? బారెడు పొద్దుకూకేసరికి నిల్వానూరునుంచి వొస్తం దుకు అడేమన్న మస్కూరా. బిల్లబం ట్రోతా. తిని చేసి వొచ్చేసరికి ఏ ఏళ్ళ అయితదో ఏమో' ఇంకో మనిషి అన్నడు.

ఎవలకి తోసినట్లు ఆల్లని కండ్లు తడిజే సుకుంటుండ్రు.

నారాయణ చూసి గిరక్కున ఎన్కకు మల్లిండు. మొన్న ఇంటికొచ్చిన ఎల్లయ్య కండ్లల్ల మెదిలిండు. తను అప్పులల్ల ఉండు. అప్పులు పెరిగి పెరిగి తనూ ఇంతేనా. ఒల్లు జల్లుమన్నది. ముగ్గురు పిల్లలు కండ్లల్ల మెదిలిండ్రు. బోరేద్దా మంటె సరే అనే. ఎల్లయ్య పీనిగను చూస్తుంటె తనకు ఒల్లు సల్లబడుతుంది.

ఏమైనా సరి ఆలోచించుకొని దిగాలె. ఇయ్యాల మాత్రం బోరొద్దు పాడొద్దు అను కొని ఇంటిబాట పట్టిండు.

ఎల్లయ్య పీనిగను చూసిన పత్తి రైతుల భార్యలు పుస్తెలు కండ్లకద్దుకుంటుండ్రు. భద్రంగా చేతులు పట్టుకుంటుండ్రు. 'పుటు క్కుమనె పుస్తలయిపాయే' ఎవరిదో ఆడ గొంతు దుక్కపు జీరతో అన్నది.

★ ★ ★

బడినుంచొచ్చిన ఆడపిల్లలు బిందెలు పట్టుకొని నీల్లు మోస్తుండ్రు. కమలమ్మ బిందె పట్టుకొని ఎదురుబోతుంది. నారా యణ అప్పుడే వాకిట్ల ఎదురొచ్చిండు.

భార్యను చూసి 'అక్కడేడ తెస్తుండ్రమా. యాపచెట్టు కాడ బోరింగు ఉండెకదా' అన్నడు.

కమలమ్మ బిందె కిందబెట్టి కొంగుతో మొకం తూడ్సుకుంది.

'ఏం నీల్లయ్యా అయ్యి రోజు రోజుకు ఒట్టి కషం అయితున్నయ్. బోరింగు నీల్లు తాగినోల్లకు కాల్లు జేతులు ఆడ్తలేదంట. నడుము నొప్పులు పిల్లలు ఒకటే- వద్దమా ఆ నీల్లు. అయ్యి ఫ్లోరిన్ నీల్లంట. విషంతో సమానమంట- అని పోరుబెట్టిండ్రు. అసెడె పానీయ్ కష్టమే కదా అని ఆ కాపోల్ల బాయికాడ పట్టుకొస్తున్నం'

కమలమ్మ చెపుతుండంగనే రమ బిందె పట్టుకొని వొచ్చింది. తల్లికి అందిచ్చి మల్ల ఎన్కకు మల్లింది కాలి బిందె పట్టుకొని.

అవును ఊరంతా ఉప్పునీల్లే అయినా తాగక సస్తరా జనం. ఇంకోదారి లేదాయె. నారాయణకు బరువు పనిచేసినప్పుడు నడుముల నొప్పి యాదికొచ్చింది.

ఎన్నికలప్పుడల్లా 'నేను మంత్రిని కాంగనే మంచినీల్లిస్త' అని చెపుతడు. పోటిజేసినాయిన గెలుస్తడు. మర్చిపో తడు. 'ఏంది పోయిన సారి ఇస్తంటివి ఇంతవరకు ఇయ్యవైతివి. మల్లదే మాట చెపుతవని' అడిగితె పిట్ట కతలు చెపు తాడు. మాటలు నేర్చిన మన్సులాయే.

'నీకు బిడ్డలు, ముగ్గురికి దసరాకే బట్టలు పట్టిస్తవా. అహ పట్టియ్యాలని ఉంటది. చేతుల పైసలుండవు కదా. అందుకని దసరాకు ఒకరికి, దీపావలికి ఇంకొకరికి, సంక్రాంతికి మరొకరికి కొని స్తవ్. అట్టనే ముందు ఆయకట్టు కింద మంచినీల్లు ఏర్పాటు చేసిన, రోడ్లేసిన, ఈసారి గెలిపించిండ్రనుకో మీకు జేస్త. ఏమంటవు' అంటడు. ముందు మనకు రాజ్యాధికారం రావాలె అంటడు.

అంత తెగబడి మాట్లాడెటోని తోని ఎవడు మాట్లాడ్తడు. కండ్లు మూసుకొని ఓట్లేసుడు. ఆడు కనబడకుంట బోవుడు.







ఊరికి మాత్రం కన్నమ్మ కష్టాలు.

★ ★ ★

మరీ ఈ ఉప్పునీల్లకు ఒంట్లె బొక్కలు సుద్దముక్కలు అయితున్నయ్. పండ్లు గారె పడుతున్నయ్. ఊరికెవడకన్న సంబంధానికొచ్చినా మనుసుల పండ్లు చూసే 'అమ్మో ఈ కొంపల నా బిడ్డని స్తనా' అని ఎల్లిపోతుండ్రు. కొంతమంది నడుస్తుంటే మోకాల్లు తగుల్తుంటయ్. అంతా కర్మ.. ఎవనికి పట్టని బతుకులు. నారాయణ పొద్దుగ్గా గాలొదిలి ఇంట్లెకు పోయిండు.

'ఇయ్యి మాత్రం సొక్కం నీల్లాగని బోరింగునీల్ల మీద మెరుగు. కాస్త నయం గదా అని తెస్తున్నం' అని కమలమ్మ బిందె తీసుకొని వంటింట్ల దించింది.

'కూడు లేకుంట పోతుండె. గుక్కెడు మంచినీల్లు కూడ దొరకని రోజులొచ్చె' నారాయణ సలిగిండు.

★ ★ ★

నడెండకాలం. రోకండ్లు పగిలే ఎండ. ముసలి ముతక ఎండదెబ్బ కొట్టి లటుక్కున పానమిడిసే కాలం. గడ్డి గాదర కట్టెపుల్ల అంత సదురుకున్నంక కాల్లు బార్ల సాపి కూసుండ్రు రైతులు. కూలోల్లు ఇదుపుల పొంటి కూసొని ఒకలి తలల వొకలు పేల్లు చూసుకుంటుండ్రు. గంజో గట్కో తాగుడు నీడపట్టున ఉండుడు.

గుంటూరోల్లు ఎగదొబ్బి పోవడం, పత్తిశేను ఏసి చేతులు కాల్చుకోవడం ఊరింకా మర్సిపోలేదు.

'థూ దీనమ్మ పత్తికినా చెప్పు. పత్తికి పెట్టే పెట్టుబడితోని ఏడాదిపాటు కూసొని తినొచ్చురా. దీన్ని మెడకు పెట్టుకోవడమంటె ఉరితాడు పెట్టుకున్నట్టే? ' రైతులు యాష్టకొచ్చి అంటున్న మాటలు.

నారాయణకు ఎటూ దిక్కుతోస్తలేదు. కాలాన్ని నమ్మేటట్టులేదు. పత్తిని నమ్మేట్టు లేదు. ఎట్లా కాలం గడవాలె. ఎట్ల పూట కెల్లాలె. ఒకటే ఆలోచనలు. నారాయణ మంచం పక్కన కింద సాపేసుకొని అడ్డ మొరిగింది కమలమ్మ. ఆరోజు నుంచే ఒకటే బోరు గురించిన ఆలోచనలు. ఎట్లయిన ఆ బోరేదో ఏస్తెనే బాగుంటది. కాని చేతుల పైసలేదు. బోరోడు ఉత్తపుణ్యానికే స్తడా? ఈ గొట్టె రాజ్యాన ఎవడిస్తడు అప్పు. అయినా సరే ఎట్లన్న సతులాయించుకోవాలె. కమలమ్మ పానం కొట్కులాడుతుంది.

'ఏవయా పండుకున్నవా' భర్త దిక్కు తిరిగి పిలిసింది.

'ఆc ఆc' నారాయణ నిద్రపోలేదన్నట్టుగా పలికిండు.

'కాల్లు జేతులు ముడ్సుకుని కూసుంటె కాలం ఎట్లెల్తది. కూలినాలికి పోతోలం కాదైతిమి. అయినా ఆల్లే మొత్తలపొంటి ఈగలు కొడుతుండ్రు. ఎలమ పుట్కపుట్టి ఎవనికి కూలికి పోతం. అంతో యింతో యవుసాయం చేస్తేనే కదరు. బోరేద్దమయా' కమలమ్మ మనసుల మాట చెప్పింది.

'నేల దుమ్మలేస్తుంది. మట్టి బండ బారింది. ఈ కరువుల నీల్లు పడ్తయో పడవో తెల్వదు. బోర్ల మీద బోర్లేసే శక్తి మనకేడుంది. అప్పు తెచ్చి బోరు గుంతల్ల పోసుడు గనీ' నారాయణ గుండె దడదడలాడుతుంటె అన్నడు.

"ఎందుకు నాయినా అంత భయపడుడు. మొన్న ఉత్తకాల్లాయన ఏస్తే పడలేదా? ముందే భయపడుకుంట కూసుంటె ఎట్లా' శీను ధైర్యం తెచ్చుకొని అన్నడు.

నారాయణకు నిజమే అనిపించింది. మొన్నటికి మొన్ననే ఏసిండు ఉత్తకాల్లాయిన. బానే రొండించుల నీల్లు పోస్తుందంట. ఊల్లె ఎవలో అంటుంటె ఇన్నడు.

నారాయణ ఎటూ తేల్చుకోలేక తటపటా యిస్తుంటె ఊరి బైటి పటేలు వొచ్చిండు. గడపట్ల నుంచే సరాయించుకుంట వొచ్చిండు. పటేలును చూసి నారాయణ లేసి కూసుండు. కమలమ్మ లేసి కూసుంది. పటేలు వొచ్చి మంచం మీద కూసుండు.

'ఏం నారాయణ ఏదో ఆలోచిస్తున్న ట్టుంది' పటేలు అన్నడు.

నారాయణ ఆ మాటకు ఏం చెప్పాల్నో తోయక రాని దగ్గును దగ్గిండు.

'పటేలేమో ఎండలబడి వొచ్చిండు' పటేల్ను ఉద్దేశించి అడిగిండు నారాయణ.

'ఆ పనిబడి ఊల్లెకల్ల వొచ్చిన. ఇట్ల పోతుంటె కనబడ్డవు. పలకరిద్దామని వొచ్చిన' పనేం లేదన్నట్టుగా చెప్పిండు పటేలు.

'ఏందమ్మా మొగుడు పెండ్లాలు ఏదో ఆలోచిస్తు న్నట్లుంది'

కమలమ్మ సదురుకొని కూసుంది.

'ఏం ఆలోచన పటేలా! కాల్లుజేతులు ఒల్లె పెట్టుకొని ముడుసుకునే కాలమొచ్చె. ఎటూ తోస్తలేదు' కమలమ్మ పొడుగ్గ గాలొదిలింది.

'బోరేద్దామంటుంది. నాకేమో గుండె ధైర్యం సరిపోత లేదు. ఈ కరువుల ఎవన్ని రూపాయ అప్పడుగుతం. అసలు పాముNోట్ల తల్కాయపెట్టినా పైస పుట్టని కాలం' నారాయణ నీరసంగా అన్నడు.

పటేలు కొద్దిగా నవ్వు మొకం పెట్టిండు. 'దానికెందుకయ్య అంతా ఫికరు. బోరె య్యాలె అనుకోవాలె గని పైస పుట్టదా. అంత పైసలుండే చేస్తుండ్రా! మన ముఖ్య మంత్రి అప్పు తెచ్చి అభివృద్ధి పనులని చూపిస్త లేడా. మనం అట్ల కూడా కాదుగా. బోరేసుకోని బతికేటందుకేగా?' పటేలు అన్నడు.

'కాని యాడ దొర్కుతయ్ పటేలా' నారాయణకు ఇంకా ధైర్యం సాల్త లేదు. ఎవల్ని అడగాల్నో కూడా తోస్తలేదు.

'ఇగో నారాయణ నువ్వింత ఫికరు బడ్తున్నవ్ కాబట్టి చెపుతున్న. మరి నీకు సై అనిపిస్తె చెయ్. మా అల్లునికి బోరు బండి ఉందిగా, మొన్న ఉత్తకాల్లాయినకు బోరేసింది కూడా మా అల్లుడే. మల్ల రేపో ఎల్లుండో బండొస్తదంట. మరి నువ్వో సగం పైసలు తయారు చేసుకో. తతిమ్మ పైసలకు ఆపుత. పంట పన్నంక ఇద్దువు' పటేలు ఉసులు బాటు చూపిండు.

శీను, కమలమ్మ మొకంలో పానం వొచ్చినట్టయ్యింది.

'ఆయినయితె ఉద్దెర పట్టడు. సరే నేను చెపుత ఆ కోంటాయినకు ఇచ్చే మిత్తే ఇయ్యరాదు. తతిమ్మ పైసలకు' పటేలు

## ఎక్కడయినా చేసుకోగలను!

బెర్లిన్‌లోని ఖగోళ-భౌతిక శాస్త్ర ప్రయోగాలయాన్ని సందర్శించే ముందు పోట్స్‌డామ్‌లోని ఫలానా బ్రిడ్జిపైన కలుసుకుందామని మరో భౌతిక శాస్త్రవేత్త ఫిలిప్ ఫ్రాంక్, ఐన్‌స్టీన్ ముందుగానే మాట్లాడుకున్నారు. ఆరోజు ఐన్‌స్టీన్‌ను బ్రిడ్జిపై ఒంటరిగా చాలా సేపు వేచివుండేలా చేసినందుకు, తను ఆలస్యంగా వచ్చినందుకు ఫ్రాంక్ చాలా బాధపడుతూ, 'మీ విలువైన సమయాన్ని వృధా చేశాను? మీరు ఇంట్లో ఉంటే ఎన్నింటి గురించి ఆలోచించేవారో' అన్నాడు. దానికి ఐన్‌స్టీన్, 'నేనెందుకు పోట్స్‌డాం బ్రిడ్జిపైకంటే ఇంట్లోనే ఎక్కువ ఆలోచిస్తాననుకున్నారు? నా పని ఎలాంటిదంటే.. నేనెక్కడున్నా దాన్ని చేసుకోగలను' అన్నాడు ఎంతో నమ్రతగా.









అన్నడు.

'జర మంచినీల్లియమ్మ. మా దూపయ్ తుంది' పటేలు అడిగిండు.

కమలమ్మ దిగ్గున లేసింది.

'అయ్యో నా కమ్మర్తి పాడుగాను. ముచ్చట్ల బడి ఎండల పడొచ్చిన మనిషి మంచి నీల్లయ్యడంగూడ మర్చిపోతి' అను కుంట లేసింది.

పటేలు మంచి నీల్లు తాగి ఎల్లిపో యిండు.

'ఇంకేంది నాయినా సగం పైసలాపుతం టుండు గదా పటేలు' తండ్రి ఇంకా తల ఊపకపోయేసరికి శీను అన్నడు.

★ ★ ★

'ఏవయా ఓ ఐదువేలు ఊల్లె కోంటాయి నను అడుగుదాం, కాదనడులే' అన్నది కమలమ్మ.

ఒల్లు అదురుతుంది కని తెగింపు చేసు కోక తప్పదనిపించింది నారాయణకు. పది వేలదాక బోరుగుంతకయితది. కోంటాయి నకాడ ఐదు తెచ్చినా పటేలు అల్లునికాడ ఐదువేలు అప్పుంటది. బోరు బడితె మల్లా మోటారు పైపులు తేవాలె' అదో ఫికర య్యింది నారాయణకు.

భర్త మనసుల సంగతి ఎర్గినట్టే 'బోర యితె ఏద్దామయ్య. ఇంత జలపడ్డంక... అది చూస్తే మోటరు ఎట్లయినా తెచ్చుకో వచ్చు. జల చూసినంక ఎవలికైనా అప్పు ఇయ్యబుద్ధి కాదా' కమలమ్మ తోవ సూపింది. 'ముందుగాల కోంటాయినను అడుగుదాం' అన్నడు నారాయణ.

బోరెయ్యడానికే నిర్ణయించుకున్నట్లు శీను మొకంలో కళ వొచ్చినట్టయ్యింది.

'శీను ఆ బోరు బండి ఎప్పుడొస్తదో తెలు సుకో' అన్నడు నారాయణ. ఎప్పుడో ఎందుకు? కోంటాయినతోని మాట్లాడ్తే పానం కుదుటపడ్తది గదా అనుకుని లేసిండు నారాయణ.

'కోంటోల్ల ఇంటిదాంక పోయొస్తనమా' అని నారాయణ బయటపడ్డడు.

★ ★ ★

'యాపారం నడ్సినపుడు చేతుల పైసలా డినయ్. అడిగినోల్లందరికి ఇచ్చిన. ఊరి నిండ అప్పులు పెట్టిన. అడగబోతె ఎవలి బాధలు ఆల్లు చెపుతుండ్రు. మొకం కండిం చుకోని అడుగుదామంటె ఉన్నోరోల్లాయే. ఏండ్ల బట్టి తిరుగుడే తప్ప పైస చేతికొస్త లేదు. కోంటపుట్క పుట్టి గట్టిగ అడగలే నైతి. ఒకవేల అడిగినా ఎవడు ఏ మాట అంటడో. ఎవడు పుటక్కున సస్తడోనాయె. ఆ బదనాం ఎందుకని కూసున్న'.

నారాయణ ఐదువేలు అడిగేసరికి కోంటాయిన చెప్పిన మాట. నారాయణకు ఎటూ తోయలేదు. కోంటాయన అన్న దాంట్లె కూడ తప్పులేదు. ఉన్నమాటే అది. ఇంకోమాట అడగలేక కూసుండు.

'రైతుకు కరువొచ్చిందంటే మా కొచ్చి నట్లు కాదా. మీరంత పండిస్తేనేగా మాకు బేరం నడిసేది. ఊల్లె పంట లేదాయె. నా బేరం లేదాయె. కూలినాలోల్లకు కూడ చిల్లర సామానుకు ఉద్దెర పెడ్తి. లెక్కలు పత్రాలు చూసుకునుడు తప్ప పైస ఎన్కకు తీసుకునుడు లేదు' కోంటాయిన బేరం గురించిన దిగులు.

నారాయణకు ఏద్దామనుకున్న బోరు కండ్లల్ల తిరిగింది. కోంటాయినేమో కుండ బద్దలు కొట్టినట్లు చెపుతుండు. ఇంకేమడు గుతడు. నీల్లు మింగిండు నారాయణ.

కోంటాయినే మల్లా సంలాయించుకొని 'ఇంగో నారాయణ. ఊల్లె అప్పులు పెట్టిన. ఇంగ పెట్టొద్దనుకున్న. కాని నువ్వడిగితె నేమో కాదనలేకపోతున్న. పాతంగ చేసు కునేటోనివి. నువ్వు పనిలేకుంట ఉంటె ఎట్ల చెప్పు. ఏమైతె అదయ్యింది. నీ మీద నాకు నమ్మకముంది. ఆ బోరు బండి వొచ్చిన్నాడు చెప్పు. ఎట్లన్న సదురుత'

అన్నడు.

నారాయణకు ఊపిరి పీల్చుకున్నట్ల య్యింది. 'నీ నమ్మకాన్ని నిలబెట్టె. మంచి ఆపదల ఆదుకుంటున్నవ్. బోరు బండొచ్చి న్నాడు కలుస్త' నారాయణ తృప్తిగా లేసిండు.

'ఇంతవరకు ఏ పైసా పత్రం మీద తీస్కపోయినోడు కాదు. నియతుగల్ల మనిషి. ఊల్లె చిల్లర మల్లరోనికి ఇచ్చేబ దులు నారాయణకు ఇద్దాం. ఎలమ పుట్క పుట్టి ఎగదొబ్బుతడా...' అనుకుండు కోంటాయన.

★ ★ ★

నాల్గుదినాల తరువాత ఊల్లెకు బోరు బండి వొచ్చింది. నారాయణ పోయి పటేల్ను కలిసొచ్చిండు.

'ఆ పొద్దున్నే వొచ్చింది బండి. ఆ దుబ్బుల ఏస్తుంది బోరు. మధ్యాహ్నం వరకు అయిపోతున్నాలే. అన్నాలు తిన్నంక నీది ఏపిద్దాంలే' అన్నడు పటేలు.

అన్నట్టే నడెండల నారాయణ చెల్కల బోరేస్తందుకొచ్చింది బోరు బండి. గంటసే పన్నుంచి నారాయణ మొగుడు పెండ్లాలు యాపచెట్టుకింద బోరు బండికోసం చూసు కుంట కూసుండ్రు. శీను ఆతురతగా ఎదు రుచూస్తుండు.

బోరు బండి రాంగనే లేసి ఎదురుబో యిండు నారాయణ. బండి సప్పుల్లనే 'బోరు పాయింటెక్కడ' అని అడిగిండు డ్రైవరు. రణగొణ సప్పుడకు మాటలు కూడా వినపబడ్తలేవు. బండ్లెనె వొచ్చిన పటేలు డ్రైవరు పక్కనుంచి దిగిండు. డ్రైవ రుకు చెప్పి ఇంజను ఆపిచ్చిండు. యాప చెట్టు నీడకొచ్చి 'యేడ ఏద్దామనుకుంటు న్నవ్ నారాయణ?' అడిగిండు.

నారాయణ దాన్ని గురించి ఆలోచించ లేదు.

అదురుష్టం బావుంటె యాడేసినా పడ్తది గదా అనుకుండు.

## కొత్తగాలి...

ఊసరవెల్లి
సిగ్గుపడిపోయింది
నేతల్ని చూసి!

—లోగిశ లక్ష్మీనాయుడు, సింహాచలం

పటేలు 'ఓసారి చెల్కసుట్టు తిరుగొ ద్దాంపా' అన్నడు.

నారాయణ, పటేలు నాలుగు మూలలు తిరిగిండ్రు. బొర్రెంకయ్య గెట్టెమ్మటి పుట్ట గడ్డ కనిపించింది.

'ఇగో నారాయణ పుట్టగడ్డ ఉన్నకాడ జల ఉంటదంట. ఈడ ఏసుకో' అన్నడు. నారాయణకు కూడ ఇంకో ఆలోచనేం లేదు.

కేకేసి చెప్పేసరికి డ్రైవర్ బండి తీసు కొచ్చి పుట్టగడ్డకాడ ఆపిండు. బండ్లె మను షులు పాయింటు అడిగి తెలుసుకొని ఏర్పాట్లు చేస్తుండ్రు.

ఎండకు మాడు పగిలిపోతుంది. నారా యణ నెత్తిన తువ్వాల ఏసుకుండు. పటేల యితే తలకు మొత్తం బిగిచ్చిండు.

డ్రిల్లింగు చేసే మనిషికి సరిగ్గ పాయింటు సూపిచ్చి యాపచెట్టు నీడకొ చ్చిండ్రు పటేలు, నారాయణ.

కమలమ్మ నిలబడి కండ్లన్నీ తెరిసి చూస్తుంది బోరు బండి దిక్కు. నడుముల మీద చేతులేసుకొని అదే పనిగా చూస్తుంది. మనసుల కోటిన్నొక్క దేవుండ్ల మొక్కుకుంటుంది.

'పటేలు పుట్టగడ్డకాడ ఏస్తె బావుంటద న్నడు. అన్నే ఎయ్యమని చెప్పిన' నారా యణ భార్యతో అన్నడు.

కమలమ్మ సప్పుడు చేయకుండా కండ్ల తోనె సమ్మతి చెప్పింది.







బోరు చాలుజేసినప్పుడు ఎర్రమన్ను ఒక్కసారే మబ్బులోలిగ లేసింది. బోరు బండి కనపడకుంట అయ్యింది దుమ్ముకు.

'అంతా మంచి జరుగుతది. మరి దడ పెంచుకోకురి' పటేలు కూసుండు గుండు మీద. నారాయణ, కమలమ్మ కూసుండ్రు. శీనుకు కాలు నిలుస్తలేదు. బోరు బండి దిక్కు కదిలిండు.

'ఎండల యాడికిరా శీనూ. జరసేపయి నంక పోదువుగాని కూసో' అన్నది కమలమ్మ.

'ఒక్కసారి చూసొస్తమా' అని కదిలిండు శీను.

దుమ్ములేస్తనే ఉంది. బోరు బండి సప్పుడకు చెవులు గిల్లుమంటున్నాయ్. మధ్య మధ్యన పటేలు, నారాయణ పోయి ఎన్ని ఫీట్లు దిగింది అని అడిగొస్తుండ్రు.

చిన్న చిన్న గుండ్లు, పరుపు బండలు తగులుతున్నట్టుంది. దణదణమని సప్పుడొస్తుంది. అప్పుడు తెల్లదుమ్ము లేస్తుంది. అట్లొచ్చినపుడు 'పరుపు బండ వొచ్చినట్టుంది' అంటుండు పటేలు.

ఎండ సల్లబడ్డది.

'డెబ్బయి ఫీట్లు దాటింది' అని చెప్పిండు డ్రిల్లింగ్ చేసే మనిషి.

బోరుబండి కంటె ఎక్కువ కొట్టుకుంటున్నాయ్ మొగుడుపెండ్లాల గుండెలు. శీనుకైతే సావో బతుకో అన్నట్టుగా ఉంది. వంద ఫీట్లు దాటింది. జర్రంత తడి తగిలింది. మల్లా ఒట్టి దుమ్ము.

తడి మట్టి చేతికి తీసుకొని నారాయణకు సూపిచ్చిండు డ్రిల్లింగాయిన. 'పది ఫీట్లు జర్రతడి తలిగింది మల్లా దుమ్మే' అన్నడు.

ఇంకా ముప్పయి ఫీట్లేసినంక బండ తగిలింది. నారాయణ గుండెల్ల గుర్రాలు ఉర్కుల బెడుతున్నాయ్.

'భయపడకు ఈ గడ్డన నూటయాభై దాంక ఎయ్యాల్సివొస్తది. మొన్న మొన్న ఎయ్యలే. ఇగో ఆ బొర్రెంకయ్య కూడ రొండేండ్ల కింద నూటముప్పై ఏసె' అన్నడు పటేలు.

తెల్లబండ ఎంతకు తెగుతలే. ఒట్టిదే పొడి, పదిహేను ఇరవై ఫీట్లు ఏసినా అదే బండ. ఇంత పొర తగుల్తలేదు. నారాయణకు ఆశ సచ్చిపోయింది. కమలమ్మ తల్లికొడుకులు బోరుబండి సుట్టు కాలు గాలిన పిల్లోలిగ తిరుగుతుండ్రు. నారాయణ తెల్ల మొకం ఏసిండు.

అంతల్లనే డ్రిల్లింగు సప్పుడు మారింది. ఆ సప్పుడు విన్న పటేలు 'నారాయణ బండ వొడిసినట్టుంది భయపడుకు' అన్నడు. పొరలు పొరలుగా ఉన్నట్టుంది బండ. నాలుగు ఫీట్లు మెత్తగ దిగితె నాలుగు ఫీట్లు బండ తగులుతుంది.

ఇంకో అరగంట దాంక రప్పరప్పపోతుంది రాడ్డు.

'తడి తగిలింది' డ్రిల్లింగాయిన కేకేసిండు.

నారాయణకు మనసులో ఆశ పుట్టింది.

అంతా కాస్త దగ్గరికి పోయి చూస్తుండ్రు. సన్నటి దార బోరుగుంతల నుంచి బయిటికొస్తుంది. ఇంకో రాడ్డు దిగే సరికి దార పెరిగింది. నారాయనోల్లకు మొకంల తెలివొచ్చింది. అంతల్లనే దార చిమ్మిచ్చికొట్టింది. కమ్మలమ్మలకు పోయిన పానం లేసొచ్చినట్టయింది. శీనుకి చెంగనాలు కొట్టాలనిపించింది. ఫీటు ఫీటుకు నీటి దార పెరిగింది.

అప్పటికే నూట అరవై అన్నడు డ్రిల్లింగాయిన.

పటేలు కూడా 'మాట దక్కింది. అనుకుండు. డ్రిల్లింగు ఆపేసిండ్రు. డ్రైవర్ పక్కకొచ్చి 'ఇంగ ఏసినా లాభంలేదు. రావల్సిన జల వొచ్చింది' అన్నడు బండి తీసేద్దాం అన్నట్టుగా.

నారాయణ సంబూరంల ఏం అనలేకపో

యిండు.

'నారాయణ ఆపుదాం మరి ఇంకేసినా లాభంలేదు అన్నడు' పటేలు.

నారాయణ తలాడించిండు.

అప్పుడప్పుడే చీకటి పడుతుంది.

కమలమ్మ కొడుకు కల్సి ఇంటికి బయలుదేరింర్రు. గాల్లె తేలివొచ్చినట్టుగా వొచ్చింర్రు తల్లీకొడుకులు.

నారాయణ బోరుబండి పోయిందాంక ఉండి గుంతమీద బస్తాలు కట్టి బరువులు పెట్టిండు. పటేలు బోరుబండి ఎక్కిండు.

'ఇప్పుడేం కలుస్తవ్‌గని పొద్దున్నే కలవరాదు, లెక్క చూద్దాం' అన్నడు.

నారాయణ సరే అని జప్ప జప్ప నడుసుకుంట ఇంటికొచ్చిండు. ఎంతైనా జల చూసిన సంతోసం వేరేకదా అనుకుండు. నీల్లను చూస్తేనె గదా రైతుకు కొండంత బలం అనుకుండు.

★ ★ ★

కమలమ్మోల్లకు ఆ మాపు కంటినిండ కునుకుపట్టింది. పొద్దున్నే లేసి ఆర్భాటం ఆర్భాటంగా తిరిగింది. ఇంట్లె కొడుకును చూసి 'శీనూ మన కష్టాలు తీరినయ్ కొడకా' అన్నది సంబూరంగా.

ఊరి బైటికల్ల పోయొచ్చిన నారాయణ యాపపుల్ల పడేసి మొకం కడుక్కుండు. మాపు సొంతం సంబూరంగా ఉన్నా బోరు లెక్కే గుర్తొచ్చింది. కొడుకును పిల్సిండు. ఆ బోరు లెక్క ఎంతయిందో చూడరా శీనూ అన్నడు. శీను పెన్ను పేపరు తీసుకొని తండ్రి పక్కన కూసుండు.

'నూట అరవై ఫీట్లు గద నాయినా, ఫీటెంత మాట్లాడినవే' అన్నడు.

'అరవయ్యయిదో డెబ్బయో మరి లోకంతోపాటు అందాజ కట్టరాదు' అన్నడు.

శీను లెక్కేసి 'పదకొండువేల దాంక అయితుండే నాయినా' అన్నడు.

మరి కేసింగు. ముప్పయ్ ఫీట్ల డ్రిల్లింగు. దానికి కట్టవా లెక్క అన్నడు నారాయణ. శీను ఎంత ఎయ్యాల్నో చూస్తుంటే అది 'వొంద ఫీటుకు' అన్నడు.

'ఇదో మూడు వేలు. మొత్తం కల్పితె పద్నాలుగు వేలు నాయినా' అన్నడు శీను.

నారాయణ గుండె గుభిల్లుమన్నది.

శీనుకు ఏదో గుర్తొచ్చింది. 'నూట అరవై ఫీట్లకు ధర కట్టినంగా నాయినా. మల్ల ముప్పయ్ ఫీట్లకు వొందేంది. ముప్పయ్ ఫీట్లకు వంద కట్టినపుడు మిగిలింది నూట ముప్పైయ్ ఫీట్లేగా' అన్నడు.

'లెక్కకయితే అంతే కావాలె. కాని బోరింగోని లెక్కలు అట్లుండవు. దేనిలెక్కదానిదే' అన్నడు నారాయణ.

శీను గమ్మునుండు.

మల్లా నారాయణే 'అయ్యో నా మతిమరుపు.. మరి కేసింగు పైపుధర ఎయ్యవా? ' అన్నడు.

శీను లటలట గుండె కొట్టుకుంటుంటే చూసిండు.

'అదో ఫీటు నలబై చొప్పున ముప్పయి ఫీట్లు' అన్నడు నారాయణ.

'ఇదో వెయ్యి అయితది నాయినా' అన్నడు శీను.

'అంటె ముద్ద జేస్తే పదిహేను వేలన్నమాట' అన్నడు నారాయణ.

పదిహేనువేలనేసరికి కమలమ్మ పాణం వొనికిపోయింది.

'కోంటాయినను అయిదు అడిగితిమి. ఇంక పది ఉంటది. పటేలు కూడా ఏమంటడో ఏమో' నారాయణ సగం ఇస్తనన్నది

## కొత్తగాలి...

**నేనంటే**
**అమ్మకు జాలి!**
**శ్రీమతికి జాలీ!!**

*గుడిమెట్ల, శ్రీకాకుళం*



యాదికొచ్చి అన్నడు.

'పటేలు ఇంటడులే. మల్ల మోటరు... పైపులు... దానికి కావొద్దు. అదెవని కాల్లు పట్టుకోవాల్నో ఏమో' కమలమ్మ దీర్ఘం తీసింది.

నారాయణ మరో మాటనకుంట పటేల్ను కలిసొస్త ఎదురు చూస్తున్నాలె అని లేసిండు. నారాయణ బజార్లంగ పోతుంటె కలిసినోల్లల్లా 'నీల్లు బాగ పడ్డ యంట గద నారాయణ. నీ కష్టాలు గట్టెక్కినయిలే' అన్నరు. వాల్ల పలకరింపులకు నారాయణ ఛాతి ఉప్పొంగినట్టయింది. పారుగంత ఉన్న రైతుకు ఉండే విలువ వేరే కదా అనుకుండు. పటేలు ఇంటికి పోయి లెక్క సూసుకుండు. దాదాపు శీను లెక్కతో సరిపోయింది. కోంటాయిన కాడతెచ్చిన ఐదు వేలు చేతుల పెట్టి 'తతిమ్మయ్ ఆగాల్సిందే. నీకు తెల్వంది ఏముంది పటేలా' అన్నడు.

పటేలు ఆ పైసలు లెక్క పెట్టుకొని 'ఇంకో రొండు మూడు సూడరాదు' అన్నడు.

'ఎల్లవులే నన్ను ఇబ్బంది పెట్టకు' అన్నడు నారాయణ.

పటేలు మల్ల అడగలే.

నారాయణ లెక్క కాయితం మీదికి ఎక్కించిందాంక ఉండి ఇంటిబాట పట్టిండు. బడికాడి కొచ్చేసరికి బొర్రెంకయ్య ఉన్నడు. నారాయణను చూసి 'ఏం నారాయణ బోరు బాగ పడ్డదంట కదా' అన్నడు రాగి చెంబోలిగున్న బట్టతలను సవరించుకుంట.

'ఆఁ పిల్లల అదురుష్టం' అన్నడు.

'ఆ అంతా బాగుండాలె కదా! దేవుడు సల్లగ చూసిండులే' అన్నడు సన్నగ నవ్వుకుంట. అట్ల నవ్వుతుంటె బాన కడుపు ఊగింది. బొడ్డుకింద కట్టిన దోతి సల్లయ్యింది. సదురుకుండు బొర్రెంకయ్య.

'బోరుబడ్డదన్న సంబూరం కాని మోటారు తల్సుకుంటెనె భయమైతుంది. యాడ పైసపుట్టే యాల్ల లేదు. ఇంతంత చేతుల పైసలాడెటోల్లంత నల్లగొండల ఫైనాన్సు పెట్టిండ్రు. అడిగితే ఐదు రూపాయల మిత్తంటుండ్రు' నారాయణ కడుపుల సుల్లు తిరుగుతున్న భయాన్ని, బాధను ఎల్లగక్కిండు.

'ఇన్నాటి కాలం కాదాయే. అప్పు తీసుకొని అడగబోతె ఎదురు మల్లుడాయె. ఎట్టిస్తరు చెప్పు ఉన్నోల్లు మాత్రం' అన్నడు బొర్రెంకయ్య.

నారాయణ తల నేలకేసుకొని నీల్లు నమిలిండు. అదో యిదో మాట్లాడినంక 'ఓసారి ఇంటికల్ల రా, ఏం తొక్కులాడ్తవ్ గని' అన్నడు.

నారాయణకు నమ్మబుద్ధి కాలేదు. ఏంది ఆ మాట అనేది బొర్రెంకయ్యేనా అనిపించింది.

తలకాయ ఊపుకుంట ఇంటికొచ్చిండు. భర్త మంచం మీద కూసోంగనే కమలమ్మ రొట్టెలు తెచ్చి యిచ్చింది. పిల్లలు అట్ల దూరంగ కూసొని తింటుండ్రు. కమలమ్మ ఓ రొట్టె పట్టుకొని కూసుంది. నారాయణ రొట్టె నములుకుంట బొర్రెంకయ్య అన్న మాట చెప్పిండు భార్యకు. కమలమ్మకు నమ్మబుద్ధికాలే.

'ఏమయ్యా ఎంత యిదయితే మాత్రం ఇట్ల తమాషాలు చెయ్యాల్నా' అన్నది.

'నిజమమ్మా అపద్దం చెపుతనా ఏంది' అన్నడు.

'ఏమోనయ్యా నువ్వు జెపుతున్నవ్‌గని నాకైతే నమ్మబుద్ధి అయితలేదు. బొర్రెంకయ్యకు అంత సక్కని బుద్ధి పుట్టడమేంది' అన్నది.

నారాయణ గంభీరంగ ఉండేసరికి అబద్ధం చెపుతలేడనిపించింది కమలమ్మకు.

## కొత్తగాలి...

**అల్ల నేరడిపండు**
**ఎంతో రుచి**
**నలుపా తెలుపా కాదు**
**దిల్‌సే మత్లాబ్**

— పెరుకరాజు, నర్సింగాపూర్

'ఏమో మరి పక్కగెట్టు. బోరుబడ్డది. తీర్చకపోతారు అనుకుండేమో' అన్నది కమలమ్మ.

నారాయణ రొట్టెలు తిన్నడు. కాలు ఒకాడ పొందుతలేదు. అదేందో తేల్చుకుంటెగని నిమ్మలపడదు.

'మరి పోయెస్త ఏవంటడో ఏందో' అని చెప్పిలేసిండు.

నారాయణ బీడిపొగ వొదులుతూ నడుస్తున్నడన్న పేరేగని మనసు బొర్రెంకయ్య మాటల సుట్టే తిరుగుతుంది. మాటైతే మార్చడు గదా అనుకుండు. అయినా ఇంకో తోవలేదు. ఎవని కాన్నయినా అప్పే. మిత్తి కట్టాల్సిందే. చూద్దాం అనుకొని బొర్రెంకయ్య ఇంటికి పోయిండు. బొర్రెంకయ్య బంకుల్ల కూసుండు. ఏదో జీతగాండ్ల లెక్కలు చూస్తుండు. ఏడెనిమిది మందిదాంక నిలబడ్డరు తూర్పు గూడెం బంటోల్లుంద్రు. మార్వాక మాదిగోల్లుంద్రు. కొత్త జీతాలు కూడా మాట్లాడుతున్నట్లుంది.

నారాయణను చూసి 'దా, ఇటు కూసో' అని మంచం చూపిచ్చిండు.

నారాయణ ఓ మూలకు కూసున్నట్టు కూసుండు.

నారాయణ పానం బిక్కుబిక్కుమంటుంది. జీతగాని మనుషుల కల్ల చూస్తుండు. బొర్రెంకయ్య లెక్కలకేసి చేతుల పట్టుకొని లెక్కలు చేస్తుండు. జర సేపయినంక తల పైకెత్తి ఓ మాదిగాయిన దిక్కుచూసిండు.

'అసలు కంటె మిత్తి ఊటగయ్యింది, ఎప్పుడు గడ్తవ్?' అన్నడు గొంతులో కరుకుతనం కనిపించింది.

'అయ్యా పొల్లగాడు ఊరికి పోయిండు. ఆడు రాంగనె తమర్ని కలుస్త' మాదిగాయిన పబ్బతి పట్టిండు.

'లంజాకొడకా ఎన్ని రోజులురా? జీతం చేయమంటే రెండొద్దులకోసారి నాకాలు పెడ్తడు. ఇదేంది గాడ్దికొడక అంటె ఎదురు మల్లుడు. అవసరానికి అప్పు తీసుకునుడు. మరెవరు కడ్తర్రా ఇంత సొమ్ము నీయమ్మ' బొర్రెంకయ్య హుంకరించిండు.

మాదిగాయన మాట పడిపోయినట్టు గడగడవొనికిండు. బొర్రెంకయ్య మల్లా గుర్రున చూసుకుంట 'రమ్మంటె రారు. ఎన్నిసార్లు తోలింద్రా మనిషిని' అన్నడు.

మాదిగాయినకు సల్ల చెమటలు పడుతున్నయ్.

'పొల్లగాడు గిల్లగాడు అని చెప్పొద్దు. నాల్గు దినాలల్ల అసలు, మిత్తి కక్కాలె. నకరాలు చేసినవంటె కొడకా నడూల్లె చెట్టుకు కట్టేసి కొడ్త. పో నీయమ్మ'.

బొర్రెంకయ్య గద్దింపుకు ఆ మాదిగాయన గుడ్లనీల్లు తీసుకుంట బైటికి పోయిండు.

ఇంక నిలబడ్డోల్ల దిక్కు చూసి 'రేపు మాట్లాడదాం రారి. జరపనుంది' అన్నడు.

అంతా ఎల్లిపోయింద్రు.

మంచం కింద చెంబుల నీల్లు తాగి. 'చెప్పు నారాయణా' అన్నడు బొర్రెంకయ్య.

నారాయణ గొంతు పట్టేసినట్లయ్యింది.

'రమ్మంటిరిగదా. ఓసారి కలుసుదామని' నీల్లు నమిలిండు.

'అదే బోరు మోటారుకు తొక్కులాడుతుంటవు గదా. ఎంతయినా సాటి కులమోనివి. వోని కాడికోపోయి చెయ్యి సాప

డమెందుకు అనిపించింది. మరి నీకు అక్కరుంటె తీస్కపో' అన్నడు.

నారాయణ 'అక్కరేనాయె తెల్వదా నీకు' అన్నడు.

సరే ఆ బోరు మోటరు ఎంతయితదో ఏమో తెల్సుకో. మిత్తి అయితె ఊల్లె మాల మాదిగోల్లకు మూడు రూపాలిస్తున్న తెలుసుగా. నువ్వు రొండు రూపాలు కట్టియ్యి సాలు' అన్నడు.

నారాయణ తల్కాయ ఊపిండు.

'రేపు లేదు ఎల్లుండి రా. కాయితం రాసి తీస్కపో. దేనికయినా లెక్కుండాలెగా' అన్నడు.

నారాయణ సరే అని లేసిండు.

★ ★ ★

నారాయణ ఇంటికొచ్చి బొర్రెంకయ్య అన్న మాటలు చెప్పిండు. కమలమ్మకు కలగన్నట్టుగా ఉంది. ఇంకా నమ్మబుద్ది అయితలేదు. అప్పు పుడుతుందన్న సంబూరమే గని గుండె అదురుతుంది.

'ఏవయా బొర్రెంకయ్య కడుపుల ఇసం పెట్టుకొని అయితె అప్పిస్తలేడు కదా' అన్నది. నారాయణ తేలికగా నవ్విండు. 'నువ్వు ప్రతి దానికి అనుమానిస్తే ఎట్ల చెప్పు. ఆయనకేదో సాయం చేయాలనిపించినట్టుంది. ఎంత ఓర్వలేని మనషయితే మాత్రం ఓ మంచిపని చేయాలనిపించదా. అది మనకు చేస్తుండేమో' అన్నడు.

కమలమ్మ ఇంక పొడిగించదల్చుకోలేదు. నారాయణోల్లు రొట్టెలు నములుతుంటె మెకానిక్ చారి వొచ్చిండు. మొకంమీద నవ్వు.

'ఏం కమలమ్మక్కా బోరు బడ్డదిగా. జర నవ్వు మొకం పెట్టరాదూ' అన్నడు. మంచంమీద కూసుంట.

కమ్మలమ్మ పలకరింపుగా నవ్వి లేసింది. 'ఏవాయ్ రొండు దినాలసంది ఊల్లె లేవా? కనిపించవైతివి' అన్నడు నారాయణ.

'సుట్టపోల్లింట్ల పెండ్లుండె బావ. ఎండ కాలం కదా.. ఏవో పెండ్లిండ్లు అయితనే ఉంటయ్. పోకతప్పదు కదా' చారి అన్నడు.

రొట్టె తీసుకొని వొస్తున్న కమలమ్మ గుండె కలుక్కుమన్నది. ఇద్దరు బిడ్డలు చెట్లోలె ఎదుగుతుండ్రు కదా అని యాది కొచ్చింది. మొన్ననే కట్టగట్టుకున్నట్టు ఒక లెనుకంగ ఓల్లు పెద్దమనిషైరి. మూలకు కూసపెట్టి మురిపం జేద్దామన్నా కరువుకు చేతులు రావాయె. ఇంకో కంటికి తెల్వనియ్యదాయే. ఈ ఏడు పిల్లలు పది. కమలమ్మ గుండె దడదడ కొట్టుకుంది. మనసులో బాధను దిగిమింగింది.

చారికి రొట్టె ఇచ్చి 'ఇగో ఇది నములు' అన్నది.

'ఎందుకక్కా ఇప్పుడే ఇంట్ల తినొస్తున్న' అన్నడు చారి మొహమాటంగా.

'అయితె మానె, పట్టు. మా సద్ద రొట్టె కూడ రుచి సూడు' అన్నడు నారాయణ. చారి చింతకాయ తొక్కుల అద్దుకొని రొట్టె ముక్క నోట్ల పెట్టుకుండు.

'ఇంత కరువుల పెండ్లి జేసిండంటె అదు రుస్టమంతుడే చారీ మీ సుట్టపోడు' అన్నది కమలమ్మ.

'ఏం అదురుష్టంలే అక్కా. ఎదిగిన బిడ్డను ఇంట్ల పెట్టుకోలేక అప్పు తెచ్చి పెండ్లి జేసిండు. పెండ్లంత అయినంక ఆయిన లెక్కలు తల్సుకొని కండ్ల నీల్లు తీస్తుంటె చూడలేక పోయినం. రొండొద్దులు ఉందామనుకున్న అయిన కండ్లల్ల నీల్లు చూసి మూటముల్లె సదురుకుని బయిటపడ్డం' అన్నడు చారి.

కమలమ్మ మనసంతా ఇద్దరు బిడ్డలు. దిగులుగా కూసుంది రొట్టె తిన్నట్టు చేసుకుంట.

'ఏం బావా బోరు బాగ పడ్డదంట కదా.





## కొత్తగాలి...

**పచ్చగానే ఉంది**
**గుప్పెడుమందికి దేశం!**
**ప్రజలకే**
**కామెర్లవ్యాధి!**

*-వారణాసి రామకృష్ణ, హైదరాబాద్*

ముచ్చట్లపడి అడుగుడు మర్శిపోయిన' అన్నడు చారి.

'ఆc బానే పడ్డది వాయ్. బోరు మోటారు తేవాలె. అదే నీ గురించి అడి గితె కనపడలేదన్నరు ఊల్లె. చూస్తున్న' అన్నడు నారాయణ.

'మరి ఏ మోటరో ఏం సంగతో నువ్వ జర ఎంటవుండాలె' అన్నడు నారాయణ.

చారి 'నేనున్నదే అందుకు కదా బావా' అన్నడు.

'రేపు పోయి తెల్సుకుందాం. లెక్కేపిచ్చు కుంటె బొర్రెంకయ్య పైసలిస్త అన్నడు' నారాయణ అన్నడు.

'నువ్వ అదురుస్టవంతునివే బావా. ఏదో సుడి తిరిగినట్టుంది నీకు. లేకపోతే బొర్రెంకయ్య... నీకు అప్పియ్యడమేంది?' అన్నడు చారి.

నారాయణ మాట్లాడకుంట కూసుండు. చారి రొట్టె నమిలి మంచం కింది చెంబు అందుకుని మంచినీలు తాగిండు.

'సరే రేపు పొద్దునే వాస్త బావా, పోదాం' అని లేసిండు చారి.

నారాయణ తల ఊపిండు.

కమలమ్మ మాత్రం 'జర ఎంట ఉండి మాట సాయం చెయ్యి నాయినా. అసలే నకిలీ మోటర్లు ఇస్తరంట నల్లగొండ దుకా ణపు ముండా కొడుకులు. ఆల్తుపాల్తు మోటరు తెచ్చి దాంతోటి సావాలె' అన్నది.

'అమ్మో నేను లేనా అక్కా' అన్నడు చారి.

'నీ కష్టం ఏం ఉంచుకోము గని సాయ పడు. నమ్మినం నాయినో. నువ్వ ఆ దుకా ణపోనితోని కల్సి ముంచేవు' అన్నది నవ్వు కుంట.

'ఛ ఏందక్కా' అనుకుంట పోయిండు చారి.

★ ★ ★

నారాయణ చారిని యెంట తీస్కపోయి లెక్క ఏపిచ్చుకొచ్చిండు. బొర్రెంకయ్యను కల్సిండు. ఆయిన అప్పు పత్రం రాపిచ్చు కొని మోటరు మందం పైసలిచ్చిండు. మోటరు తెచ్చి బిగిచ్చిండు. మూడు దినాలు చారికి అదే పని. బొర్రెంకయ్య చెల్కల ఉన్న కరెంటు పోలు నుంచి సర్వీసు వైరు గుంజి కరెంటు కనక్షని చ్చిండు.

'బావా కరంటోల్లు తిరుగుతుండ్రు. నీకేమో శాంక్షను లేదు. సరే ఇప్పటిక యితే పెట్టుకో. రేపో ఎల్లుండో పోయి మీటర్‌కి డిడి కట్టిరా' అన్నడు.

'ఈ కరంటోల్ల సంగతి నాకు తెల్సు చారి. నిన్ననే మా శీనును పంపించి డీడీ తీయించిన. ఫికరు లేదులే' అన్నడు నారా యణ. మోటరు బిగిచ్చే సైమానికి కమ లమ్మ కొబ్బరికాయ తీసుకొని వొచ్చింది. శీను వొచ్చిండు. ఆడపిల్లలు కూడ మన బోరు ఎట్ల పోస్తదో చూస్తమమా అని యెంటబడి వొచ్చిండ్రు.

'అక్కా నీదే ఆలిసం. మోటరు బిగిచ్చిన. కొబ్బరికాయ కొట్టిన వంటె మోటరు చాలు చేసుడే' అన్నడు చారి.

కమలమ్మ ఊదుకడ్డీలు ముట్టిచ్చి ఓ రాయికి పసుపు కుంకుమ బొట్లు పెట్టింది.

'ఇగో రమా కొబ్బరికాయ కొట్టురే. అంతా మీదే అదురుస్టం' అన్నది కమ లమ్మ.

ఇద్దరు బిడ్డలు జంటగా మొక్కి కొబ్బరి కాయ కొట్టిండ్రు. దండం పెట్టి కొబ్బరి

పచ్చులు అన్నే పెట్టింద్రు.

'బావా ఇంగ కట్యేయ రాదు' అన్నడు చారి.

నారాయణ కొడుకు దిక్కు చూసిండు.

'శీనూ కట్యేయి కొడకా. నీ చేతుల మీద నన్న కలిసొస్తది' అన్నడు. తల్లి కూడా ఎయ్యి కొడకా అనేసరికి శీను యేసిండు.

బుర్ బుర్ మని రొండు నిమిషాలు సప్పుడే చేసింది మోటారు. ఒక్కసారే గుప్పించింది నీల్లు. ధార చూస్తుంటె కడుపు నిండినట్టుగా అయ్యింది కమల మ్మకు. కొద్దిసేపు నోట మాట రాలేదు సంబూరానికి.

'రొండించుల పైబడే ఉంటయ్ బావా. రొండు రొండున్నర ఎకరాలకు సావులేదు' అన్నడు చారి.

శీను అయితే చెంగనాలు కొట్టిండు. ధార చూసి ఉరికి పైపుకాడ మూతిపెట్టి రొండు బుక్కలు తాగిండు. అన్న తాగేస రికి ఆడ పిల్లలు కూడా నీల్లల్ల దిగి తాగింద్రు.

'అమా తియ్యగ కొబ్బరి నీల్లోలిగ ఉన్న యమా. మంచినీల్లు ఈన్నించే తీసుకపో దామమా' అన్నది రమ. కమలమ్మ పట పట నీల్లు రాల్సింది సంబూరానికి. నారా యణ పిల్లల సంబూరం చూసి తృప్తిగా బీడి ముట్టిచ్చిండు. మాట ముచ్చటలేక కండ్లనిండ నీల్ల దార చూస్తుండు.

భర్తను చూసి 'అప్పుడే ఏదో కోటీశ్వరు నివి అయినట్టు కల కంటున్నవే' అన్నది కమలమ్మ నవ్వుకుంట.

'నీటి వసతుంటే రైతు రాజేనమ్మా' అన్నడు నారాయణ. ఆయిన కండ్లల్లో వెలుగు.

అరగంట సేపు మోటారు పోసింది.

'ఇంగ బెంగలేదు బావా. పోస్తది' అన్నడు చారి.

నీల్లన్ని ఎర్రశల్కల అడ్డగోలిగ పడిపో తున్నయ్. అది చూసి 'ఇంగ మోటరు బందు జేద్దాం. రేపు అచ్చుకట్టుడు మొదలు పెడదాం పారి యింటికి' అన్నడు నారాయణ.

చారి కట్కి బందుజేసిండు. కమల మ్మోల్లు ఇంటిబాట పట్టింద్రు. నారాయ ణలో ధైర్యం, నడకలో గంభీరం. ఎంతైనా నీల్లుంటే ధైర్యమేకదా అనుకుండు.

'ఈ బక్కోడ్ల పట్టుకొని అచ్చు కట్టుడంటే అయ్యేపని కాదు. పటేలు ట్రాక్టరు మాట్లా డదాం. అదయితే రొండు మూడు దినా లల్ల కతంజేస్తది' అన్నడు నారాయణ.

కమలమ్మ భర్త కల్ల చూసింది. నారా యణకు భార్య చూపు అర్థమైంది.

'పటేలుతోని మాట్లాడదాం. బోరు సాయం చేసినోడు ట్రాక్టరు సాయం చేయడా?' అన్నడు నారాయణ.

పిల్లల మొకంలో ఆనందం చూసు కుంట, ఆల్ల చిలిపి మాటలు యినుకుంట ఇల్లు చేరింద్రు. ఇంట్ల కొచ్చిన కమలమ్మ ముక్కోటి దేవతలకు మొక్కుకుంది.

భగవంతుడా నా పిల్లల సంతోషాన్ని నాల్గు కాలాలపాటు కాపాడు.

★ ★ ★

చేతినిండ పని ఉంది నారాయణకు. తండ్రీకొడుకులు కూడు మీద యావలే కుంట బోరుకాన్నే ఉంటుంద్రు. పటేలు ట్రాక్టర్ పెట్టి అచ్చు కట్టింద్రు. రొండెక రాలు నీల్లు తిరిగేటట్లు కాల్వలు తీసింద్రు.

ఓ మడి దున్నిండు నారాయణ.

గొడ్లపేడ, లొట్టపీసాకు సరిపోను యేసిండు. 'మడి మక్కుతది నాల్గు దినా లయినంక మండె బోద్దాం' అన్నడు నారా యణ. అన్నట్టుగానే మంచి ఇత్తనాల గింజలు సంపాయించి మండె కట్టిండు. మడి కరిగట్టు చేసిండు.

ఓ పొద్దున తీస్కపోయి ఊరియా జల్లిండు. యెంటనే మొల్క సల్లిండు.







గుండెల నిండా ఊపిరి పీల్చుకుండు నారాయణ. ఇంక బాధ లేదు బతుకుతం అనుకుండు. చెల్కల కల్ల పోయిన మొలక ఎల్లిందా అని చూసుకుంటుండు. మొల్క యెల్లింది. నాల్గు దినాలకే నారు పచ్చగ నిగనిగలాడింది. 'హమ్మయ్య' అనుకుండు నారాయణ.

★ ★ ★

శీను సాయమాను కింద మంచంల కూసుండు. చెల్లెండ్లు ఇద్దరు బడికి పోయింద్రు. లోపల తల్లి రొట్టెలు చేస్తున్న సప్పుడు. ఇంత తిని బోరు కల్ల పోవాలె అనుకుండు.

బుచ్చమ్మవ్వ కట్టె బొడుసుకుంట వొచ్చింది. ఇంటి పక్క ముసలామె. ఎప్పుడోగాని బయిటికెల్లదు. వొల్లంతా ముడతలు పడి తాటి పండోలిగుంది.

శీను దగ్గరకొచ్చి కండ్లు మిటకరించి చూసింది. చత్వారం అద్దాలు సరిచేసుకుంది. అద్దాలు కాడలు ఇరిగి తల్కాయ చుట్టు కట్టిన దారం ఆసరతో ముక్కు మీద ఏలాడుతున్నయ్. శీను మొకం మీద మొకం బెట్టినట్టు చూసి 'ఓసి నువ్వార గుంజగా. అడ్డలుంగి కట్టుకొని కూసుంటె మీ నాయిన అనుకుంటి' బోసి నోరు సప్పరించింది.

శీను లేసి 'ఏందవ్వా ఎప్పుడు కొత్తగనే చూస్తవ్' అన్నడు.

ముసలమ్మ ముసిముసిగా నవ్వింది. ఇంట్లె కల్లపోయింది.

కమలమ్మ రొట్టెలు చేతుల పట్టుకొని వొస్తుంది. బుచ్చమ్మవ్వను చూసి 'అత్తా కూసో రొట్టెల పెనం తీసేసి వస్త. అయిపోయింది' అని పీటచెక్క యేసింది అవ్వ కూసుంటందుకు.

శీనుకు రొట్టెలందించింది.

కాసేపటికి కమలమ్మ మొకం తూడ్చుకుంట వొచ్చింది. అవ్వ పక్కన కూసోని 'రొట్టె తింటవా అత్తా' అని అడిగింది.

బుచ్చమ్మవ్వ ఎడమ చేయి లేపి వొద్దన్నట్టుగా ఊపింది. 'పండ్లేడ ఉన్నయ్ పిల్ల' అని దవడలు వొత్తి చూసుకుంది.

'ఏం అత్తా అంత ఆయాసపడుకుంట ఎందుకు తిరుగుడు. కూసోక పోయినావు ఓకాడ' కమలమ్మ అన్నది.

'ఎంతకని కూసోను బిడ్డ. కూసోని కూసోని ముడ్లు తీపులు పెడుతున్నయ్. జర అట్ల తిరిగితె కాల్లు సల్లయితయని ఇటొస్తి' అన్నది.

ఇద్దరు అదో ఇదో ముచ్చట్ల బడ్డరు.

శీను రొట్టెలు తిని మంచి నీల్లు తాగిండు.

వాకిట్లకల్ల పోయి నిలబడ్డడు.

సుదర్శన్ చేసంచి చేతుల పట్టుకొని పోతుండు. 'ఏం సుదర్శన్... ఎటు పోయి వొస్తున్నవ్' శీను అడిగిండు.

సుదర్శన్ చేసంచి దిక్కు చూపిచ్చి 'కోంటాయిన కాడికి' అన్నడు. గొంతు నీరసంగా ఉంది.

'అర్జంటా రారాదు ఇంట్ల కూసుందాం' అన్నడు శీను.

'తొందరగానే పోదువులే' అన్నడు మల్లా.

సుదర్శన్ ఇంట్ల కల్ల నడిసిండు, ఇద్దరు వాల్చిన మంచం మీద కూసుంద్రు.

'కోంటోల్లింటికి పోయొస్తున్నవా?' అన్నడు శీను ఏదో సంభాషణ పొడిగించాలె అన్నట్టుగా.

'ఆc ఇంటి పరిస్థితి ఆయింత దిగజారింది. మగ్గం ఒక రోజు ఆడితె నాలుగు రోజులు పండుకుంటుంది. ఏం చేయాల్నో తోస్తలేదు. కోంటోల్లింటికి పోయి రొండు కిలోల బియ్యం తెమ్మని అమ్మ చెపితే పోయొస్తున్న' అన్నడు.

శీను ఏం మాట్లాడలేకపోయిండు.

మల్లా సుదర్శనే అన్నడు. 'కోంటాయిన

# ఫ్రెంచ్ వేపుళ్ల కథ




అమెరికాను సందర్శించేవారు మెక్ డొనాల్డ్స్‌లోని ఫ్రెంచ్ వేపుళ్లని రుచి చూడకుండా రారు. బర్గర్ కింగ్, వెండీస్‌లాంటి ఇతర ఫాస్ట్ ఫుడ్ రెస్టారెంట్స్‌లు కూడా ఇవి అమ్మినా, మెక్ డొనాల్డ్ ఫ్రెంచ్ వేపుళ్లకే డిమాండ్ అధికం. దానికి కారణం వీటి తయారీలో ఆ రెస్టారెంట్ తీసుకునే శ్రద్ధే.

ఫోర్డ్ కంపెనీ కార్లను అసెంబ్లీలైన్‌లో తయారు చేయడంతో, ఉత్పత్తి అధికమై, ధర తగ్గింది. మెక్ డొనాల్డ్స్ ఈ పద్ధతినే రెస్టారెంట్ వ్యాపారానికి అన్వయించడంతో అమెరికాలోని తొలి ఫాస్ట్‌ఫుడ్ రెస్టారెంట్ అయింది. ఫ్రెంచ్ వేపుళ్లకి బంగాళాదుంపలు ముడి పదార్థం. అమెరికాలోని రైతులు పదిలక్షల ఎకరాల్లో, ఈ రెస్టారెంట్స్‌కోసం ప్రత్యేకంగా బంగాళాదుంపలని పండిస్తున్నారు. వీటిని మెక్‌డొనాల్డ్‌కి తరలించి, యంత్రాల ద్వారా కడిగి, ఆవిరి బాయిలర్స్‌లోకి పంపుతారు. అక్కడ బంగాళాదుంపల తొక్కలు పెద్దపేలుడుతో విడిపోతాయి. వాటిని పరిమాణం ప్రకారం వేరుచేసి, ఒక్కోదుంప వాటర్ కట్టర్ అనే గొట్టంలోని నీటితోపాటు గంటకు పదిహేనుమైళ్ల వేగంతో ప్రయాణించి, అందులో అమర్చిన అనేక బ్లేడ్స్‌గల స్లైసర్‌ని తాకి వంద నిలువుముక్కలుగా కోతకు గురవుతుంది. నీటితోపాటు బయటకు వచ్చిన ఆ ముక్కలు షేకర్ అనే యంత్రం మీదకి చేరి నీటిని వదుల్చుకుని మరో యంత్రంలోకి వెళతాయి. అక్కడ వేడినీటిలో 15 నిమిషాలు మరగడంతో ఆ ముక్కలోపల మెత్తదనం ఏర్పడుతుంది. తర్వాత ఆ ముక్కల్ని యంత్రంద్వారా డీహైడ్రేట్ చేస్తారు. తదనంతరం మైనస్ 5 డిగ్రీల వద్ద వేర్‌హౌస్‌లో నిలువ చేస్తారు. అమెరికాలోని పన్నెండు డిస్ట్రిబ్యూషన్ సెంటర్లనుంచి వీటిని స్వదేశంలోని, ఇతర దేశాల్లోని మెక్ డొనాల్డ్స్ రెస్టారెంట్స్‌కు సరఫరా చేస్తారు.



ఈ వేర్‌హౌసుల్లో సదా నెల రోజులకు సరిపడే ముడి ఫ్రెంచ్ వేపుళ్ల నిల్వాలు ఉంటాయి. వీటిని ఆర్డర్ అందుకోగానే సోయాబీన్ ఆయిల్‌లో వేయించి కస్టమర్లకు అందిస్తారు.

మెక్ డొనాల్డ్స్ ఫ్రెంచ్ వేపుళ్లలో ఉప్పు తక్కువగా ఉంటుంది. నంజుకోవడానికి వీటితోపాటు టొమాటో కెచప్ పాకెట్స్‌ను ఇస్తారు. మెక్ డొనాల్డ్స్ సేల్స్‌లో 60 శాతం అమ్మకాలు వీటి వల్లనే జరుగుతాయి. వీటిని వేయించగా మిగిలిన నూనెను సేకరించి బయో డీజిల్‌గా ఉపయోగిస్తున్నారు తప్ప, దాన్నే పదేపదే వేపుడుకు వాడరు.

బెల్జియంలో కనిపెట్టిన ఫ్రెంచ్ వేపుళ్లని పారిస్‌కు వెళ్లిన అమెరికా ప్రెసిడెంట్ థామస్ జఫర్సన్ రుచి చూశాడు. అవి ఆయనకు విపరీతంగా నచ్చడంతో అమెరికాలోనూ వాటి తయారీని ప్రోత్సహించాడు.

మాత్రం ఎంతకని ఉద్దెరిస్తడు చెప్పు. ఓ పనుంది, చేస్తుంండ్రు, రేపు కాకుంటె ఎల్లుండి పైసలొస్తయ్, ఇస్తరన్న ఆశ లేదాయే. బియ్యమడిగితె ఆయిన మూతి ముక్కు ఇరిసిండు. పాతలెక్కలన్ని చూసిండు. ఏదో వొచ్చినవు గని మల్లన యితే ఇయ్య అని కరాకండిగ చెప్పిండు. పానం సచ్చిపోయిందనుకో కోంటాయిన మాటలకు' సుదర్శన్ కండ్లు మూసుకుంట అవమానాన్ని దిగమింగే ప్రయత్నం చేసిండు.

'కాని తప్పదుగా. పేగుమంట' అన్నడు.

శీనుకు ఇంక ఆ విషయం మాట్లాడబుద్ధికాలే. లేసి మంచినీల్లు తెచ్చి ఇచ్చిండు.

బుచ్చమ్మవ్వ పోతుంటె గడపట్లదాంక కమలమ్మ వొచ్చి సాగదోలింది. 'బద్రం చూసి అడుగేయి అత్తా' అంటుంది.

బుచ్చమ్మవ్వ పొడుస్తున్న కట్టె సప్పుడు దూరమయ్యింది.

శీనుతోని మాట్లాడుతున్న సుదర్శన్ను చూసింది కమలమ్మ. 'బాగున్నవా కొడకా.. ఈ నడమ కనబడ్తలేవు' పలకరించింది కమలమ్మ.

సుదర్శన్ నవ్వు మొకం పెట్టిండు.

కమలమ్మ జపజప ఇంట్లకొచ్చి రొండు రొట్టెలు తీస్కపోయి సుదర్శన్కు ఇచ్చింది. 'చింతకాయ తొక్కు కొడకా, బాగుంటది తిను' అన్నది.

సుదర్శన్ మొహమాట పడ్డడు. శీను 'తినూ నేను ఇపుడే తిన్న. కాస్త ముందొస్తే ఇద్దరం కలిసె తిందుము' అన్నడు.

సుదర్శన్ ఒక్కొక్క ముక్క తింటుండు.

'సుదర్శన్ రోజు రోజుకు మగ్గాలు పడిపోతున్నయ్. యాడుంది లోపం' అన్నడు. శీనుకు యవుసాయమంటె తెలుసు కాని నేత వృత్తి గురించి అంతగా పరిచయం లేదు. కాకుంటే నేస్తుంటె చూస్తుంటడు.

'ఇక్కడ అక్కడ అని కాదు శీనూ. కడుపు చించుకుంటె కాల్లమీద పడ్తది' అన్నడు సుదర్శన్.

శీను అట్లనే చూస్తుంటె సుదర్శన్ చెప్పిండు.

'సర్కారు విధానాలు ప్రధాన కారణం. చేనేత కార్మిక చట్టాలు, నియమాలు అన్ని తుంగల తొక్కింండ్రు. సాంకేతిక రంగాన్ని అభివృద్ధి చేస్తున్నమంటూ మరమగ్గాలను ప్రోత్సహించిండ్రు. లక్షల మరమగ్గాలు వెలిసినయ్. మరమగ్గాలతో పోటీ పడలేడు చేనేత కార్మికుడు. అదిగాక మార్కెటింగ్ సౌకర్యం లేదు. ఇంతకుముందు చేనేత ఉత్పత్తులను సర్కారు కొనుగోలు చేసేది. దానికి మార్కెటింగ్ కల్పించేది. ఇపుడు సర్కార్లు చేతులెత్తేస్తుంది. సబ్సిడీలు తీసేసిండ్రు. దాంతో కొనుగోలు సంస్థలు లేక మార్కెట్టు మూలబడ్డది.



మరమగ్గాల మీద చీరలు, దోతులు, పట్టు వస్త్రాలు నేయొద్దనే చట్టాలు చట్టుబండలయినయ్. చట్టప్రకారం తెల్ల



గుడ్డలు నేస్తుంర్డు. సాటుంగ రంగులద్దు తుంర్డు. అంచు దోతులు నేయకూడదని ఉన్నా నేస్తుంర్డు. బలవంతులను మామూలు మగ్గం పనిచేసే కార్మికుడు నిలదీయగలడా. పెద్ద వ్యాపారస్తులు మర మగ్గాలు పెట్టి ఈ వృత్తిని పూర్తిగా నాశనం చేసింర్డు. మర మగ్గాల మీద తయారయ్యే బట్ట ఖరీదుకు ఇస్తే చేనేత కార్మికునికి గిట్టుబాటు కాదు. కాని పోటీ. క్షణం క్షణం ఓడిపోతుండు.

చితికిపోయిన కార్మికులు, మగ్గాలు మూలకేసిన మల్లా ఆ మరమగ్గాల మీదనే దిన కూలీలుగా చేరుతుంర్డు. అది దొరక నోల్లు ఆత్మహత్యలు చేసుకుంటుంర్డు. అంతా సర్కారు పుణ్యం'

సుదర్శన్ మంచినీల్ల చెంబు అందుకొని రొండు గట్కలేసిండు. కండ్లలో నీటి పొర.

ఇంక శీను పలకరించలేదు.

'అమ్మ ఎదురు చూస్తుంటుంది' అని లేసిండు సుదర్శన్. చేతిలో రొండు కిలోల బియ్యం. పూట పూట వెతుకులాట.




**కా**లం దాటిపోతుంది. చినుకు రాల లేదు. ఎండ నిప్పులు కురుస్తుంది. ఒకలి ద్దరు బోరు నీల్ల నాట్లేసింర్డు. కూలినాలి జనాలకు చేతుల పనిలేకుంట అయ్యింది. అదును దాటిపోతుంటె రైతులకు ఆశలు పోయినయ్ వానమీద. అంతో ఇంతో ఉండి వరి నాటేసినోల్లు మడి బిల్లల సుట్టూ తిరుగుతుంర్డు.

నారాయణ నాటేసినంక లేవంగనే రోజు పొలంకాడికి పోయొస్తుండు. రొండెకరాలు నాటుపెట్టిండు. తతిమ్మ రొండెకరాలు వాన పడ్తదేమో ఇత్తనాలు ఏద్దాం అని పొతంజేసుకొని చూస్తుండు. శినుకుపడ్తె ఒట్టు. ఏం సేస్తం నడమంత్రపు కాలం. నమ్మేటట్టు లేదు అనుకొని ఊకుండు.

బోరుకాడికి పోయిన నారాయణ నోట్ల పండ్ల పుల్లేసుకొని ఇంటికొస్తుండు. బాటల వడ్ల కొండయ్య దాటికాడ జనం. ఏందబ్బా అని అసుంట రొండడుగులు ఏసిండు. చాలామంది జనం. రొండు ఆటోలు కూడ నిలబడి ఉన్నయ్. ఆడోల్లు మొగోల్లు పిల్లా జెల్లా మూటలు పట్టుకొని జమైతుంర్డు. వాళ్ల వాలకం చూస్తే సుట్టపు సూపుకు పోయేటోల్ల లెక్కలేరు. పోయి పాక కింద గురువయ్య మంచం మీద కూసుండు నారాయణ.

మంచం కాడ కూసున్న ఓ ముసలమ్మ దుక్కపడుతుంది. సొంతం కడుపుల కాల్లు పెట్టుకున్నట్టు కూసుంది. తల్కాయ పట్టు కుంది. ఎంత సేపన్నుంచో దుక్క పడుతు న్నట్టుగా ఉంది. ముక్కులపొంటి నీల్లు కారుతుంటె బర్రున చీదింది.

'ఒట్టి అన్నాలం కాలమయిపోయే. పొట్ట పోసుకుంటందుకు దేశాలు పట్టాల్సివొచ్చె' అన్నది. నారాయణకు అర్థమైనట్టయింది. గురువయ్య కూడ నోరు పొడిపోయిన ట్టుగా కూసుండు తప్ప మాట్లాడలేదు. నారాయణకు ఇంక అడగబుద్ధి కాలేదు. మూటలు ముల్లెలు మనుసులు... ఆటోలు నిండిపోయినయ్. అక్కడ నిలబడ్డ మను షుల కండ్లు పటపటమని కారుతున్నయ్.

'ఉన్న ఊరిని వొదిలే యాల్లొచ్చే' ఎవ రిదో ఆడగొంతు బొంగురుగా అన్నది.

రొండు ఆటోలు దుక్కాన్ని మోసుకపో

తున్నట్టుగా కదిలినయ్. నిలబడ్డోలు గొల్లు మన్నరు. ఊరంతా పీనిగను సాగదోలిన ట్టుగా ఉంది. నారాయణ మనసులో దిగులు. బోరు ఉండబట్టిగని లేకుంటే తను ఆ ఆటోలో ఎక్కాల్సినోడె. ఒల్లు కంపించిపోతుంది. మంచంకాడ కూసున్న ముసలమ్మ కట్టెతెగినట్టుగా ఏడ్పు తగిలి చ్చుకుంది.

'ఏం జేస్తరయ్యా! కాలం నిండ ముంచె. పని దొరికే యాల్ల లేదాయే. ఉపాసలతోని సస్తుంఙ్రు జనం. చూస్త చూస్త ఎట్ల సస్తరు. బిడ్డలు దేశాలు పట్టి పోతుంఙ్రు. ఎట్ల బతుకుతరో ఏమో. మల్ల ఊరిమొకం చూస్తరో లేదో' ఏడ్పు గొంతుతో అంటనే ఉంది.

'ఆ నల్లగొండ దిక్కు పడిపోతుంఙ్రు. ఆడ బతుకుతం అనుకుంట్రుండు పాపం. ఆడ ఎన్ని శరలు పడాల్నో ఏమో. ఎంత పాపపు బతుకాయె నాయినా' అని ముక్కు జీదింది.

ఆటోల దిక్కు చూసినపుడు కనిపించిన మనుషులు కండ్లల్ల మెదిలింఙ్రు నారాయ ణకు. ఎంత అల్లాడింఙ్రో. ఎంత తెగింపు చేసుకుంఙ్రో. రెక్కలు నమ్ముకొని పిట్టలో లిగ ఎగిరిపోతుంఙ్రు.

గురువయ్య కండ్లల్లో నీల్లు. తుండు గుడ్డతో తూడ్సుకుండు. జారినట్టుగా ఉండే చెంపలు వొనుకుతున్నయ్. మౌనంగా దుక్కం దిగమింగుతుండు.

'మొన్న ఉరి బోసుకున్న ఎల్లని పెండ్లాం. మొగడు సచ్చిన సత్తెమ్మ. కాల్లెంకులు. పాపం బిడ్డల దీసుకొని...' గురువయ్య నోట మాటొస్తలేదు.

'అంతో యింతో కూలిచేసుకొని బిడ్డల సాదుకుంట అనుకొని ఇన్నాల్లు ఊరిని పట్టుకొని ఉంది బిడ్డ. ఇంగ గుండె ధైర్యం చెడ్డది. పిల్లల గోస ఎట్లచూస్తది కన్నత ల్లాయే. ఏ ఉప్పరి పనికి పోతదో దేశం కాని దేశాన' పొట్టచేత పట్టుకొని పోతున్న తల్లులు మెదులుతుంటే గురువయ్య చెప్పు తుండు.

నారాయణకు మాట్లాడాలనిపించలేదు. అప్పటికే పది కుటుంబాల దాంక మిరాల గూడెం దిక్కు నల్లగొండ దిక్కు ఉప్పరి పనికి పోయింఙ్రు. అల్లు తింటుంఙ్రో పంతుంఙ్రో మల్ల జాడలేదు. ఇప్పుడు ఈ రొండు ఆటోల జెనం.

'ఈ కాలం ఇట్లనే ఉంటే ఊరు పడావు పడటం కాయం' అన్నడు నారాయణ.

గురువయ్య దగ్గొస్తుంటే సరాయించు కుంట 'సర్కారోడు నూటొక్క పథకాలు పెట్టిండు. టీవీల నిండా సొల్లు గారు స్తుంఙ్రు. జన్మభూమంట... ఆసరా అంట... దానెమ్మ పేర్లకు బెమ్మాండంగా ఉన్నయ్. ఒక్కడు లేడు అయితీసుకొని బాగుపడ్డోడు. మల్ల సమభావన సంఘా లనె... పావలా మిత్తనే. రెక్కలమీద బతికే జనం. కూటికెల్లుడే గగనమాయె. ఇంక పొదుపు ఏడజేసుకుంటరు. ఆ ఆటోల్ల ఎక్కినోల్లు సగం మంది ఆ సంఘాల ఆశలపడి తిరిగినోల్లే. చివరాక రికి ఊరిడిసింఙ్రు. ఓ దిక్కు సావులు. ఏలిన దొరలకు మాత్రం అంతా బానేకని పిస్తుంది. సావులే లేవని కతలు చెపుతుం ఙ్రు. సచ్చినోల్లంత బలిసి సచ్చింఙ్రని మాట్లాడుతుంఙ్రు.

ఆ నడుమ ఆరోగ్యశాఖ మంత్రి అయితే... నోటికి కూడు తింటడో పేడ తింటడో... సస్తె పైసలొస్తయని రైతులు ఉరిబోసుకుంటుంఙ్రు అన్నడు. అనడానికి సిగ్గు లజ్జ లేకపోయే. జనం మాడి సస్తుంటె రాజకీయాలు చేస్తుంఙ్రు' గురు వయ్య ఖాంఙ్రించి తెమడను ఊసిండు.

'టూరిజం మీద, రోడ్లమీద పెట్టుడే సర పాయే. పల్లెటూల్ల పట్టించుకునే నాథుడే కరువాయే' గురువయ్య ఆయాసమొచ్చి





## కొత్తగాలి...

**నేల మంచం మీద**
**మేఘం పెట్టే**
**వడియాలు చినుకులు**

**– యలమర్తి అనురాధ,** పెనుగొండ

ఆగిండు.

నారాయణ భారంగా లేసిండు.

నారాయణ రోజూ బోరు కాడికి పోయొస్తుండు. సావకుంట బతకకుంట పడ్డవానకు రొండెకరాలల్ల చెల్కపంట ఏసిండు. ఏసిండనే పేరుకాని అది చేతికందుద్ది, అక్కరొస్తది అన్న ఆశ నారాయణకు లేదు. అగడుకు సగం పంట ఆగమైంది. బతుకుమీద ఆశ కలిగించేదంటే బోరు. దాని కిందేసిన రొండెకరాల పొలం. పొలం కొత్తనేల, గొడ్లపేడ దట్టించబటికి పచ్చగ సల్లగ నిగనిగలాడుతుంది. గడ్డి గసరపట్టకుంట పోతం చేసుకుంటుండు. శీనుకు మడిసుట్టు తిరుగుడే పనయ్యింది. కలుపు మొక్క కనపడితే సాలు కమలమ్మ గోశిపెట్టుకొని పొలంలకు దిగుతుంది.

'జీవిగంజోలిగ దొరికనయ్ ఈ నీల్లు. వరిచేన్ను కండ్లల్ల పెట్టుకొని చూసుకుందాం కొడకా' అంటది కమలమ్మ శీనుతోని.

'వరి పొట్టకొచ్చేయాల్ల. రెండెకరాలకు నీల్లసావు లేదు. కష్టం చేసుకునే రెక్కలున్నయ్. కరంటోడు ఏంది నాయినా ఆడుకుంటుండు' అన్నడు శీను.

ఈ నడుమ కరంటు కట్కయేసుడే అయితుంది. కాలువ సాగిందాంక కూడ ఉంటలే. 'ఏం బుట్టిందో ఏమో బతుకులతో ఆడుకుంటుండ్రు' నారాయణ దిగులుగా అన్నడు.

కమలమ్మ కరంటు తల్సుకొని వొనికిపోతుంది. కరంటోని ఆటలకు బలికాం కదా అని బెంగ పెట్టుకుంది. ఆరుగంటల కరంటని సర్కారోడు చెప్పిండు. టీవీలల్ల చెప్పిండ్రంట. ఊరంత ఉలిక్కిపడ్డది.

'ఈ కొడుకులకు ఇంత బుద్ధిలేదు. యవుసాయమంటే ఏమన్న ఫ్యాక్టరీనా. ఆరుగంటలని చెప్తే షిఫ్టు డ్యూటి చేసుకోవడానికి' అంటుండ్రు రైతులు.

ఆ యిచ్చే ఆరుగంటలు కూడా మాపటీలేనని మల్లా వార్తలు. ఇంగ రైతులు పెండ్లం పిల్లల ఎడబాసిండ్రు. బోరుకాన్నే కూడు నీల్లు. కంటిమీద కునుకు లేకుండా కాపల. మిమ్ముల నిద్రబోనియ్యను. నేను నిద్రబోను అన్న ముఖ్యమంత్రి మాటలు జనానికి అర్థమైతున్నయ్.

'వాన రాక కరంటురాక ఒక్కటేరా పిల్లగా' అంటుండ్రు ముసలోల్లు. రైతుకు సొంతం నమ్మకం సచ్చింది కరంటు మీద.

మాపటీలు ఇచ్చే కరంటు కూడా సాపుగా ఇస్తలేదు. అరగంటకోసారి పోతుంది. మల్ల ఎప్పుడొస్తదో తెలుస్తలేదు.

దగ్గరపట్ల బావులోల్లు ఇంతతిని వొడ్ల కొండయ్య దాటికాడ కూసుంటుండ్రు పొద్దుకంతల. కొండయ్య ఇంటిముంగల బుగ్గేసిండు. బుగ్గ ఎల్లంగనే పిట్టపిల్లలోలిగ ఉరుకుతుండ్రు బోరుమోటర్ల కాడికి.

పొద్దూకంతల దాటికాడ ముచ్చట్లు నడుస్తున్నయ్, అంత కరంటు మీదనే.

'ఇటు సర్కారోడు కరంటుతోని ఆడకుంటుండు. గింత కనికరం లేని సర్కారయిపాయె' నారాయణ గులుగుకుంట పైకే అన్నడు.

ఆరెంపీ సోవబెమ్మం కూడ పొద్దుకంతల దాటి కాడికొచ్చిండు. సుట్టుపక్కల నాలుగూర్ల తిరిగితోడాయే. రైతుల శరలు చూస్తుండు.

'యవుసాయమన్నా, రైతన్నా నలుసుతో సమానమాయె గదా సర్కారోనికి అన్నడు. ఏదో ఏదో చేస్తరనుకుంటే ముంచుతుండు గదా' అన్నడు.

పడిదలోడు కూడా జమయ్యిండు. ఈ నడుమ పడిదలోడు పనిమీద పడి తిరుగుతుండు. దాటికాడ లడాయేసుకోక శానరోజులాయే. సోవబెమ్మంతో లడాయి ఏసుకుందామన్నా పాయింటు లేదు. రైతును ముంచే సర్కారును ఏ పార్టీ అభిమానైనా ఎన్కేసుకొస్తడా. ఇపుడు సోవబెమ్మం కూడా అంతే.

'మిరాలగూడ రైసు మిల్లులకు దినం సొంతం కరంటు ఉంటుంది. వాడపల్లి సిమెంటు ఫ్యాక్టరీలకు కరంటు కట్టు అనేది తెల్వదు. ఇంతెందుకు నార్కట్‌పల్లి కాడున్న హెరిటేజి ఫ్యాక్టరీల కరంటు పోవడం తెల్వదు. మరి రైతుల కాడికొచ్చే సరికి కరంటు ఎందుకు పోతుందో' పడిదలోడు తాను చూసిన సంగతిని బాదతో కక్కిండు.

గురువయ్య మాటముచ్చట్లన్నీ ఇని సరాయించిండు. చిమ్మచీకటి. చాలామంది రైతుల నోట్లె ఎలిగినట్లే గురువయ్య నోట్లా ఎలుగుతున్న బీడి. గుప్పగుప్ప గుంజుతున్నట్టుంది. నిప్పు మిణుగురులు ఎగురుతున్నయ్. పొలమారినట్టుంది. కస్సకస్స దగ్గి ఊసిండు.

'రైసు మిల్లులకు సంఘాలుంటాయ్. సిమెంటు ఫ్యాక్టరీలంటే సర్కారు సుట్టే తిరుగుతయ్. ఇంగ హెరిటేజ్ సంగతి తెలుసేనాయే. వాటికి కరెంటు పోతే ఏమన్నుందా? ఎటొచ్చి రైతులే 'అంగట్ల అమ్మ అంటె ఎవనికి పుట్టిన బిడ్డరా' అన్నట్టు. ఎలక్షన్లపుడు పేకుడు. అది ఊడబొడుస్తం ఇది ఊడబొడుస్తం అని పూలు పెట్టుడు. తీరా ఎలక్షన్లు దాటినంక గుండెలమీద తన్నుడు' గురువయ్య దగ్గు తన్నుకొస్తుంటే ఆపుకుంటుండు. రొమ్ము ఎగిరిపడుతుంది. ఎగశ్వాస తీసిండు.

'నోరు లేని మూగజీవాలాయే రైతులు. సంఘం కట్టలేడాయే. కష్టం తప్ప కలెబడటం తెల్వదాయే. ఈల్లను ఎందుకు పట్టించుకోవాలె సర్కారోడు' గురువయ్య భారంగా అన్నడు గొంతులో కసి.

'ప్రతిపక్షాలన్ని కరంటు కోతమీద లొల్లి మొదలు పెట్టినయ్‌గా. ఏ ఊల్లె చూసినా ఊరేగింపులు, దిష్టి బొమ్మ తగలపెట్టుడు. యవారం ముదిరేటట్టే ఉన్నది' పడిదలోడు అన్నడు.

'ఏ పార్టోడు కరంటు సమస్యను భుజాన ఏసుకున్నా- లాభంలేని శెట్టి వరదలపోతడా- అనేదే సూత్రం. సర్కారోడు వీళ్ల కంటే ఎక్కువ గుండెలు బాదుకుంటుండు. అయ్యో నా రైతన్నలకు కరంటు ఇయ్యలేకపోతున్నా అని. ఏడుపు కూడా రైతులకు మిగుల్నుత లేడాయే' గురవయ్య ఆయాసంతో ఆపిండు.

చర్చ అంతా ఇనుకుంట కూసున్న నారాయణకు దిమ్మతిరిగి పోయింది. ఈ కారు పంట చేతికొస్తదో. గుండెల్లో అదురు మొదలయ్యింది. చీకట్లె రైతుల మొకాలు నల్లగ దుక్కవుగడ్డలోలిగ ఉన్నయ్.

'ఈ సాలిసాలని కరంటిచ్చి మొద్దు కత్తితో రైతుల గొంతు కోస్తుండు గదా సర్కారోడు' అన్నడు ఆరెంపీ. నోట మాట ల్లేక అందరు బిత్తరబోయింద్రు. కొండయ్య ఇంటి ముందల బుగ్గ ఎలిగింది.

'పాంర్ర కరంటొచ్చింది. మోటారు ఏసిందాంకన్న ఉంచుతడో పీకుతడో' అని ఒక్కసారిగా లేసింద్రు. బావుల దిక్కుపడి ఉరికింద్రు.

★ ★ ★

బొర్రెంకయ్య నిప్పు తొక్కిన కోతోలిగ ఎగిరిపడుతుండు. ముక్కులపొంటి కోడెగసపెట్టినట్టు పెడుతుండు. అసలే నెత్తురు







కండ్లు. ఎరుపు తేలినయ్. బంకుల్ల కూసొని సిగరెట్టు మీద సిగరెట్టు కాల్చు తుండు.

'అయ్యా! తండ్రికొడుకులు వొచ్చిండ్రు' ఓ జీతగాడు దగ్గరకొచ్చి వొంగి చిన్నగ చెప్పిండు.

'ఏడ ఉండ్రు? రమ్మను లమ్మిడికొడు కుల' హుంకరించిండు.

'జీతం సాలిచ్చుకున్నా అప్పుమాటెత్త కుంట తిరుగుతుండ్రు గాడిద కొడుకులు. ఎవని సొమ్మనుకుండ్రు. సర్కారోడు ఆల్లకు పుక్కడికి ఇండ్లిచ్చినట్లు నాకెవడన్న పైసలిచ్చిండనుకుంటుండ్రా. అప్పు తీర్సురా అంటె ముండాకొడుకు నీల్లు నములుతడు. కొడుకును తీసుకొని వస్తంటరు. ఆడేమో నల్లగొండ నిల్వనూరని బస్సులల్ల తిర్గు తడు. గింత బెదురు లేకుంట అయ్యింది' బొర్రెంకయ్య మనసు రగిలిపోతుంది.

ఎదురుంగ మార్వాక మాదిగాయిన పక్కన ఆయన కొడుకు ఎంకన్న. ఇరవై ఏండ్లు ఆసర ఉంటడు. ఈ నడుమనే ప్యాంటేసుకొనుడు నేర్సుకుండు. బొర్రెం కయ్య ముందు నిలబడ్డా కండ్లల్లో అసయ్యం తప్ప బెదురు లేదు.

'అప్పు సంగతేంది' హుంకరించిండు బొర్రాయిన. మాదిగాయిన నీల్లు నమి లిండు. చేతులు కట్టుకొని నిలబడ్డడు. ఎంకన్న పెద్దగ పట్టించుకోకుంట దిక్కులు చూస్తుండు.

'ఏందిరా నిన్నే'

'అయ్యా పోరగాడు నల్లగొండ ఆయిలు మిల్లుల కుదిరితందుకు మాట్లాడుకుండు. ఇన్నాల్లు ఆగిండ్రు. ఎండకాలం దాంక ఆగురి. నీ పైస ఎగదొబ్బను. అణాతో సహా మిత్తి కట్టిస్త' మాదిగా యిన పబ్బతి పట్టిండు.

'ఎన్నాల్లు చెపుతవురా ఈ నంగిమాటలు. వొల్లొంగని ముండాకొడుకు ఆడు పనిచేస్తాడు. నువ్వు బాకీ తీరుస్తావు? ' బొర్రా యిన గుడ్లురిమిండు.

ఎంకన్నకు అసహనంగా ఉంది. ఏంది ఈ లంజకొ డుకు బాకీ బాకీ అని నిల బెట్టి అడ్డగోలిగ మాట్లాడు తుండు. ఇస్తమన్నా ఇంత ఇదిగా మాట్లాడుతుండు. ఉక్కుష్టకూతలు. అని కుత కుత మసిలిపోతుండు.

'అయ్యా ఎట్లన్న ఓపిక పట్టురి' ఇంకేమి అనలేక నీల్లు నమిలిండు మాదిగాయన.

బొర్రాయినకు కొరకాసు పెట్టినట్ట య్యింది. అప్పు పెట్టి నిలదీస్తున్నా ఈ నా కొడుకు శంకం చేస్తలేదు. ఈనికి బానే మస్తి ఉన్నట్టుంది అనుకుండు ఎంకన్న దిక్కుచూసి.

చుట్టుపక్కల జీతగాండ్లు గుడ్లెలబెట్టి చూస్తుండ్రు. మాదిగాయినను అనేమాట వాళ్లకు తగులుతున్నట్టుగా విలవిల ఆడు తుండ్రు. కాని వొక్కమాట ఎదురనే ధైర్యం

## పేచీకి కారణం!

**త**న సాధారణ సాపేక్ష సిద్ధాంతాన్ని కనుగొన్న తర్వాత 1915లో పారిస్‌లో ఐన్‌స్టీన్ ప్రసంగిస్తూ..

'నా సిద్ధాంతం సరైనదని రుజువయితే జర్మనీ నన్ను తమ దేశానికి చెందినవాడిగా చెప్పుకొంటే, ఫ్రాన్సేమో ప్రపంచ పౌరుడిగా ప్రక టిస్తుంది. దీనికి భిన్నంగా నా సిద్ధాంతం తప్పని తేలితే ఫ్రాన్స్ నన్ను జర్మనీవాడిగా చెప్పుకుంటే, జర్మనీ నన్నొక యూదుడిగా ప్రకటిస్తుంది' అన్నాడు.



లేదు. 'ఏన్నాటికి వొడ్సుద్దొ ఈని పీడ' అనుకుంద్రు.

బొర్రెంకయ్య వొర్లీ వొర్లి చెంబుడు నీల్లు తాగిండు. 'పో లంజాకొడక ఎండాకాలం ఇయ్యాలేదంటే తోలుతీస్త' అన్నడు.

తండ్రీకొడుకులు ఎల్లిపోయింద్రు.

ఈ ముచ్చట ఒక మాదిగాయినదే కాదు. బొర్రెంకయ్య కాడ జీతమున్న ప్రతో నిది. ఎవన్ని కూడా మనిషి కింద జమక ట్టడు. నోటికెంతొస్తే అంత. ఇంతవరకు ఆయినకు ఎదురు మల్లినోడు లేడు. తాకుడు తగలలే.

మాదిగాయిన తల నేలకేసుకొని బయ టికి పోయిండు. కొడుకుతో కల్సి మార్వాక బాట పట్టిండు.

'ఎంకన్నా ఆ బొర్రోని గోర్జం చూసినవ్ గదా. అయినా ఆనికి ఎదురుమల్లి బతుకు తమా కొడకా? ' అన్నడు.

ఎంకన్న చూపులు చుట్టూ సంద్రకంచెల దేనికోసమో వెతుకుతున్నట్టుగా ఉన్నయి.

ఎంకన్న ఎర్రబెల్లి హాస్టల్ల పది సది విండు. పాసో ఫేలో కూడా చూసుకో కుంట వొచ్చి జీతానికి కుదిరిండు. పటేలు కాడ రొండేండ్లు జేసి బొర్రెంకయ్య కాడ కుదిరిండు. మూడేండ్ల దాంక చేసిండు. పని మట్టసంగ జేసెటోడు. కాని బొర్రెం కయ్య మాటలకు ప్రాణం ఇసక్కుమనేది. ఎందుకు జీతం చేయాలె. ఎందుకు ఈయన ఇట్ల అనగలుగుతుండు అని ఎక్కడలేని ఆలోచనలు వొచ్చేయి అప్పుడ ప్పుడు. చెప్పిన పని చేయకుండా నిర్ల క్ష్యంగా ఉండెటోడు. దానికి బొర్రెంకయ్యకు మండేది. అడ్డగోలిగ బూతులందుకుం టోడు. అట్లా అంటావుంటె ఎంకన్నలో మొండితనం. 'ఏం పీకుతడు ఈడు' అని కసిగా అనుకుంటోడు.

ఇయ్యాల నిలబెట్టి తండ్రికొడుకుల అంతంత మాటలంటే మాత్రం నిమ్మ లంగా ఉండలేకపోయిండు. అప్పుడే మీద

## కొత్తగాలి...

**జీవితం**
**పుస్తకంలో**
**ఆఖరిపేజీ**
**మరణం!**

**– పి. సుబ్రహ్మణ్యమహర్షి, నెల్లూరు**

దునికి గొంతు కొరికి సంపాలన్నంత కసి. కాని తనకు ఆయం సరిపోదు. తీర సైమా నికి అక్కడున్న జీతగాండ్లు కూడా ఆయన పట్టే చేర్తరు. అది తెలిసే నిప్పుల మీద ఉన్నట్టుగా ఉండి వొచ్చిండు.

ఎంకన్నకు నిన్నమన్న తను తిరిగిన ఊళ్లు యాదికొచ్చినయ్. కలిసిన మను షులు యాదొకొచ్చింద్రు. ఆల్లు చెప్పిన మాటలు యాదికొచ్చినయ్. పిడికిల్లు బిగి సినయ్.

'ఇంగ లాభం లేదు తెగింపు చేయక తప్పదు' అనుకుండు.

★ ★ ★

కరంటు యాతనలకు రైతుల కండ్లు కన్నీటితో నిండినయ్. మోటర్లు పోయ కున్న కండ్లు ధారలు కారుతున్నయ్.

నారాయణ సస్తిమా బతికితిమా అను కుంట కోతలకొంగిండు. న్యాయంగ కరంటు ఉంటె ఇంకో వారానికి కోతలు మొదలుపెట్టాలె. కాని అప్పటికే నేల నెర్రె లిడ్సుతుంది. ఇత్తు గట్టిపడాలని చూస్తే చేతికందదు. వచ్చిన కాడికి సాలని మునుంబట్టిండు. నలుగురైదుగురు కూలోల్ల కూడా పిల్సిండు. కమలమ్మ శీను కొడవండ్లు అందుకుంద్రు.

కమలమ్మ కోసేదల్లా వొరి వెన్నుపట్టి చూసింది. గింజముట్టుకుంటె గుండె అది రింది. సగానికి సగం తాలు పోయేట ట్టుంది.





'కరంటోని మీద మన్నుబొయ్య. నోట్లె మట్టిగొట్ట' అన్నది నడుములు తీపితీ స్తుంటె జర్ర నిలబడి. 'సర్కారు కూలి పోను. ఉసురు బోసుకుంటుండు' మేస్త్రీ సాపెన పెడుతూ లేసి జుట్టు ముడేసు కుంది.

'ఆన్నీ అనే కాలం లేదాయే. కరంటు కరంటని మొత్తుకుంటోల్ల గూడ కాల్చి చంపె' ఓ మొగ కూలి మనిషి బీడి ముట్టించుకుంట అన్నడు.

రొండు దినాలల్ల కోతలయిపోయినయ్. మెద మోసుకొచ్చి యాపచెట్టుకాడ కల్లంల పెట్టిండు నారాయణ.

మోటలు కొట్టేటప్పుడు దొడ్డి నిండ గొడ్లుండేయి. లెంకలు పెట్టి బంతికట్టి తొక్కించెటోల్లు. ఇయ్యాల కొట్టాలు కాలీ ఆయే. అర్కెడ్లే గగనమాయే. బంతులేడ కడతం అనుకుండు నారాయణ కపరకపర శీకటి పడుతుంటె.

పటేలు కాడికిపోయి ట్రాక్టరు మాట్లా డింన్రు. పటేలు ఎన్కాముందాడిండు.

'బోరింగేసిన పైసలుండె. మొన్న అచ్చు కట్టించుకోని పైస యియ్యమైతిమి. చేతుల నుంచి పెట్టి డీజిల్ పోయాల్సివొచ్చె. మల్ల ఇయ్యాల పడుగు తొక్కియ్యాలంటివి' పటేలు తాపీగా అన్నడు.

నారాయణకు అర్థమైంది. కల్లంల ఇత్తు లుండంగనే మాట తీసుకుంటుండు. అప్పు లున్న సంగతి తెల్సాయే. అందుకే పాత లెక్కలన్ని యాదిజేస్తుండు. నారాయణ మనసు చికాకుగా అయ్యింది.

తేరుకొని 'కల్లంల గింజలు అమ్మంగనే అంతో యింతో ఇస్తలేరి' అన్నడు.

పటేలు ఆలోచించినట్టుగా జేసి 'అన్నాలు తిన్నంక పంపిస్తలే మరి. ఇంత గనం అంటుంటివి' అన్నడు.

నారాయణ ఎన్కకుమల్లిండు.

పడుగు తొక్కిచ్చిండ్రు ట్రాక్టరుతోని. తెల్లారి నలుగురు కూలోల్ల ఆసరతోని మెద దులిపిండు. గింజలు తూర్పార పట్టిండు. రాశి పోసిండు.

మామూలుగా అయితె వొడ్లరాశి చూస్తే కమలమ్మకు సంబూరం కలగాలె. కాని ఆ రాశి చుట్టు అప్పు పత్రాలు కనిపించేసరికి సంబూరం గాలి కెగిరింది. ఆరుగాలం కష్ట పడ్డం కల్లంల చూసుకునే గింజలేగని కంచంల ఏసుకొని తింటమా అనుకుంది.

సందకాడ అన్నాలకు కూసుందామనే సరికి కోంటాయిన వొచ్చిండు. వొచ్చింది అప్పుకని తేటగ తెలుస్తున్నా ఎదో పని మీద వొచ్చినట్టుగా కాసేపు ముచ్చట పెట్టిండు.

"కల్లం పని ఒడిసిందంటగా" అన్నడు.

నారాయణ గొంతుల వొడ్లగింజ యిరికి నట్టయింది.

"ఆ" అన్నడు

"మరి పొద్దున్న వస్త, లెక్క చూసు కుందాం" అన్నడు.

"మరి అట్లనే వొడ్లు గూడ కాంట పెట్టు ఊల్లె ధర కాడికే" అన్నడు కోంటాయిన.

నారాయణకు మరో మాటరాక తల్కాయ ఊపిండు. తెల్లారి కోంటాయిన కాంట, బాట్లు ఎడ్లబండి మీదేసుకొని కల్లం కాడికొచ్చిండు. ఇద్దరు కూలోల్లను కూడ ఎంట తెచ్చుకొండు.

కాంట తయారుచేస్తుంటే నారాయణ అన్నడు. "మిత్తి మందం తీసుకో. ఈ సారి కరంటు ముంచింది. పత్తి బాకి సైదులు కూడ అట్లనే ఉండె అడు గొంతు మీద కూసుండు"

"నారాయణ నాది మాత్రం అప్పుకాదా. నువ్వు అడిగితే కాదనలేక మందికాడ తెచ్చి ఇస్తిగదా. ఆల్లు ఊకుంటరా" అన్నడు కోంటాయిన. తెలివిగ మాట్లాడుతుండని నారాయణకు అర్థమైంది.

'ఎట్టన్న సర్దుబాటు చెయ్యి. కోంటాయి







నవు నువ్వు అర్థం చేసుకోకుంటే ఐదురూ పాల మిత్తికి అలవాటుపడ్డోడు ఆ సైదలు ఆగుతడా' అన్నడు.

కోంటాయిన అటు ఇటూ వొడికి 'సరే కానియ్' అన్నడు. నాలుగు బస్తాలన్ని ఉంచుకొని సొంతం కోంటాయనకు ధరికి చ్చిండు.

ఆ మాపు కమలమ్మకు ఒకటే దిగులు. కల్లంనిండా రాశి, కాకులు గద్దలు ఎగర గొట్టె అనుకుంది.

"తెల్లబియ్యం అన్నం తినే రాత లేదయా మనకూ" అన్నది భర్తకు సద్దిరొట్టె ఇచ్చు కుంట.

నారాయణ పరధ్యానంగా రొట్టెలు అందుకుండు.




**యా**సంగి పంట ఏసిండు నారాయణ. అష్టకష్టాలు. కరంటైతే పత్తెం సొమ్మయి పోయింది. ఆయాసం తప్ప ఆందాను లేకుంట అయింది. యాసంగి పంట లెక్కలు కల్లంలనే ఒడిసినయ్. యాడాది నుంచి బోరేసినంక రొండు పంటలు తీసి నట్టు తీసింద్రు. కాని కమలమ్మోల మొకంలో సంబూరమనేది లేదు.

"ఏందయా ఈ దరిద్రపు యవుసాయం. చేస్తే ఆరప్పు. చేయకపోతే మూడప్పు" అన్నది కమలమ్మ.

"రైతు పుట్కే అంత కాదా మరి. ఊకో లేదు. పని చేస్కుందాము అనుకుంటే అన్ని బందాలె. ఉర్కుడేమో కాని పడి పండ్లిరగ కొట్టుకునుడు కాయం" అన్నడు నారాయణ.

"ఏం ఎవుసాయమో ఏమో. చెల్క పంటలు ఏసుకున్ననాడే పానం నిమ్మలం గుండె" అన్నది కమలమ్మ.

"నీట ముంచినా పాలముంచినా ఎవుసా యమే. కష్టం చేసుకునుడు తప్ప ఇంకోటి ఎర్గనోల్లం. ఏం చేస్తం మరి" నారాయణ నవనాడులు ఎవరో పిండుతున్నట్లుగా నీర సంగా అన్నడు.

ఊరు కళ తప్పింది. సాలోల్ల బజార్ల మగ్గాలసప్పుడు కరువైంది. సాకలోల్లు ఎప్పుడో ఊరిడ్సింద్రు. వొయసు పిల్లలు ఒకలిద్దరు ఇస్త్రీ పెట్టెలు పట్టుకొని నల్ల గొండ బస్సెకింద్రు. మంగలోల్లు కట్టడి మర్సిపోయింద్రు.

ముసలోడు మంగలి నర్సిమ్మ తప్ప అంతా కత్తులు పట్టుకొని పోయి నల్ల గొండ మంగలి షాపులల్ల గడ్డాలు గీస్తుంద్రు. కూలినాలి జాతి పొట్ట చేతప ట్టుకొని పిట్టలోలిగ ఎగిరిపోయిరి. అంతో ఇంతో ఎండకాలం ఇంటిపట్టున ఉండే దంటె గౌండ్లోల్లే. ఎండకాలం రొన్నాల్ల పాటు ముస్తాదుల గజ్జెలు మోగుతు న్నయ్.

ఒకప్పుడు ఊరు కళకళలాడేది. ఎవలి మొకాన చూసినా సంబూరం. ఊరు ఉన్నంక బతుకుకు బెంగా అనెటోల్లు. అట్లాంటి ఊరు ముండమోసినట్టు కూసుంది. నడమంత్రపు బరాలదెబ్బలకు మాడిసచ్చే ఎండకు కాకులు కూడా ఊరు దిక్కు చూస్తలేవు. చూస్తుండంగ కండ్ల ముంగల్నే కొట్టాలకు కొట్టాలు గొడ్లు ఆలియా అంగట్ల లారీలెక్కినయ్. ఇంకో నాలుగొద్దులైతే మనిసి లేని ఊరైతదేమో!

సరాయించిన సప్పుడుకు నారాయణ ఆలోచనలు ఆగినయ్. ఎదురుంగ

బక్కులు కాలు సప్పుడు కాకుంట వొచ్చి కూసుండు.

నారాయణ సరాయించుకొని 'ఏం బక్కులూ ఎండపూట ఇట్టొస్తివీ' అన్నడు.

బక్కులు మొగురానికి దాపు చేసుకొని కూసుండు. రుమాల గుడ్డదీసి చెమట తూడ్చుకుండు.

'పనంటూ ఏం లేదయ్యా. పండీ పండీ పక్కలు నొస్తున్నయ్. ఏటూ పొద్దుపోక ఇటొచ్చిన' అన్నడు. బక్కులుతోని మాట్లా డుతుండనే కాని నారాయణ మనసంతా గజిబిజిగా ఉంది. ఎక్కడెక్కడివో ఆలోచ నలు బతుకు సుడిగుండంలో పడినట్టుగా ఉంది. ఎంతకీ తెగని ఆలోచనలు.

నారాయణ బీడి ముట్టించిండు. తాగు తావా అని అడిగి ఓటి ఇసిరేసిండు. బక్కులు ముట్టించిండు. ఇద్దరు మాట ముచ్చట లేకుంట పొగ వొదులుతుండ్రు. నడెండ. మిట్టమద్యాన్నం. వాకిలి తగలబ డుతున్నట్టుగా ఎండ. అప్పుడోసారి, ఇప్పు డోసారి గజ్జెల సప్పుడు. పక్క సందు నుంచి తాళ్లల్లకు పోయిన గౌండ్లోల్లు వొస్తున్నట్టుంది.

'ఈ సంగతి తెలుసాయా. బక్కులు రహస్యం చెపుతున్నట్టుగా' అన్నడు.

నారాయణ ఏ సంగతి అన్నట్టుగా చూసిండు 'అదే ఊల్లె ముచ్చట' నారాయ ణకు అర్థం కాలేదు. సక్కగ బజార్ల పడి పోవుడు వొచ్చుడు. మా అయితే కొండయ్య దాటికాడ కూసునుడు తప్ప ఇంకోకాడ ఆగుడు తెల్వదు నారాయణకు.

నారాయణ తెల్వదన్నట్టుగా తలాడించేస రికి బక్కులు చెప్పడం మొదలు పెట్టిండు.

'అదే మార్వాక మాదిగాయన లేడు. బొర్రెంకయ్య అప్పియ్యమని ఎగుర్తలేడా, ఆయన కొడుకు... ఆ జీతమున్న పోరడు. ఎంకన్న ఎటెటో తిరుగుతుండె గదా...' బక్కులు ఆపి ఆపి చెపుతుంటే నారాయణ కూడా చెవులు రిక్కించిండు.

## కొత్తగాలి...

**మనలో ఏమీ లేకున్నా...**
**హోదాని అందించేది పదవి!**
**మనసులో ఏమీ లేకున్నా...**
**పైకి తీయగా పలికేది పెదవి!!**

*–తరిగోపుల విఎల్లెన్ మూర్తి,*
*హైదరాబాద్*

'ఆడొక్కడే కాదుగా, అయ్యలు కొడుకులు జీతాలుండి నలిగిపోయినోల్లు. మాలమాది గోల్ల పోరలు అటిటు పోయి అన్నల్ల కల్సిండ్రంట'

నారాయణ నోటిమాట కోసం ఆగిండు బక్కులు. నారాయణ చెప్పు అన్నట్టుగా తలాడించి బీడి గుంజుతుండు.

'ఈ నడుమ ఆల్లు ఊల్లెకు వొచ్చిం డ్రంట. ఎప్పుడొస్తుండ్రో ఎప్పుడు పోతుండ్రో గని ఊరు మాత్రం గుసగుస లాడుతుంది. ఏ మొత్తకు చూసినా చెవులు కొరుక్కుంటుండ్రు. మార్వాక ఊల్లె కొచ్చి చానా రోజులయ్యిందంట. ఈ నడుమ బంటోల ఇండ్లల్లకు వొస్తుండ్రంట. మనకు తెలుస్తాది. ఎవరో ఏమిటో' బక్కులు మనసు తృప్తి పడ్డది కడుపుల మాట చెప్పినంక.

'అట్లనా ఎంత కాలమాయేనట. గింత జాడ తెల్వదాయె' నారాయణ అన్నడు.

'రొండు మూడు నెల్లు అయిందట. ఇద్దరు ముగ్గురి ఇండ్లల్ల మీటింగులు కూడా పెట్టిండ్రంట. ఊల్లె పోరగాండ్లు సొంతం జమైతుండ్రంట. అదురు పుట్టి నోల్లు కొంతమంది పిల్లల కూడా బయిటికి తోల్తలేరంట' బక్కులు నారాయణకు దగ్గ రగా జరిగి చెవుల చెపుతున్నట్టుగా చెపు తుండు.

నారాయణ ఈ మార్పు కొద్దిగా పసిగ







ట్టిండు కూడా. కాని కారణం ఇదనీ అను కోలేక పోయిండు. ఈ నడుమ పడుసు పోరగాలు ఉషారుగా ఏడపడితె ఆడ కూసోని గుసగుసలు పోతుండ్రు.

మొన్న ఓ బంటోల్ల పిలగాడు కోంటా యినను పట్టుకొని దులిపిండని తెలిసింది. అమ్మా అప్పా అంటోల్లు ఉద్దెర పెట్టే కోంటాయినను చెడుగుడు ఆడిండ్రంటే మార్పు మాత్రం వచ్చింది. మొన్న మొన్న బొర్రెంకయ్య జీతాల లెక్క చూస్తుంటే కూడా ఓ పిలగాడు మిత్తేంది జీతమెంత అని అడిగిండు. అదయితే తను సొంతంగా చూసిండు. అయితే ఈ మార్పుకు ఎనక కారణం ఇదన్నమాట. అయినా ఏం చేస్తరు. సర్కారోడు గాలికొ దిలె. బిడ్డలోలిగ చూసుకోవాల్సినోడు అంగడ్ల గొడ్లను జేసిరి. ఆదరవు లేనోడు ఏదరో ఓదరి చూసుకుంటడు గదా. ఈల్లకు ఈ దారి కనిపించినట్టుంది అను కుండు.

చుట్టుపక్కల ఊర్లల్ల ఈ ముచ్చట్లు ఇంటనే ఉండు. నెల కిందనే ముప్పారం దొరను నడూర్లె కొట్టిండ్రంట. దెబ్బకు దొర ఊరిడ్సిపోయిండు. అట్లా వొచ్చి వొచ్చి ఎర్రగూడెం వొచ్చినట్టుంది.

"పోలీసోల్లకు తెలిత్తే ఏమన్న ఉందా నాయినా. ఇప్పటికే ఊరు తిండికి అల్లాడు తుంది. జీపులు ఊల్లె కొచ్చినయంటే ఆగం కామూ? ' బక్కులు కండ్లల్ల భయం.

నారాయణ నింపాదిగా బీడి గుంజు తుండు. 'కాలం మారుతుంది. పిల్లి అయినా తలుపు పెట్టి కొడితే గొంతు పడ్తది. బతికే దారి లేనపుడు ఎవడేం జేస్తడు ఎదరు మల్లకుంటే. పేగులెండి ఉన్నోడు దెబ్బలకు దడుస్తడా' నారాయణ అన్నడు.

'ఏమోనయ్య కాలాలు ముంచుతున్నయ్. ఏడాదికోసారి ఎలచ్చన్లని ఊల్లె కొస్తరు. ఓట్లేపించుకుంటరు. అది చేస్త ఇది చేస్త అంటరు. అయ్యాల తియ్యతియ్యని మాటలు చెపుతరు. ఓట్ల పండుగ అయిందంటే సాలు మందలియ్యబోతే కరుస్తరు. మరెవడు పట్టించుకోవాలె ఈ ఊర్ని. ఎటుబోవాలే.. ఏం తోస్తలేదు' బక్కులు రుమాలు దులుపుకొని లేసిండు.

'సర్కారోడు తోవ సూపియ్యనపుడు జనమే చూసుకుంటారు. ఊకుంటరా' అన్నడు నారాయణ.

★ ★ ★

బారెడు పొద్దెక్కేసరికి బడికాడ జీపాగింది. జనం జమయ్యిండ్రు. ఎవరు ఎవరూ అని చూస్తుంటే ఎవరో రైతు 'దండమయ్య' అన్నడు జీపుల కూసున్న పెద్దమనిషికి.

'ఏహె భూతన్కోల్లు' అన్నడు ఒకాయన.

'అప్పు వొసూల్లకు వొచ్చినట్టుంది' అన్నడు ఇంకొక ఆయన.

పండ్లపుల్లలతోని ఉన్న చానామంది అటో సూపు చూసి ఎవలి తోవన ఆల్లు పోయిండ్రు. జీపుల బ్యాంకు మేనేజరు డ్రైవరుకు ఇటు పక్కన కూసుండు. టర్కి టవలు ఏసుకుండు సీటు మీద. దర్పంగ సిగరేటు తీసి అంటించిండు. బూటు కాలు కిందికి పెట్టి దిగిండు. జారుతున్న ప్యాంటును బొర్రమీదికి ఎగదోసుకుండు. బక్కపల్సగున్న మనిషి పెయిడ్ సెక్రటరీ నేమో 'సార్ ఇదిగోండి లిస్టు' అని తెచ్చి సూపిచ్చిండు.

మేనేజరు అట్ల చూసినట్టు చూసి 'ముప్పయి మంది. ఇన్నిన్ని అప్పులు ఎట్ల నిదరపడుతుందయ్య' అన్నడు చుట్టు చూసుకుంట. జనానికి తెల్సు ఊల్లె ఎవలెవలు అప్పు తీసుకుండ్రో. పదేండ్ల కింద భూతనకా లోను తీసుకున్నోల్లుండ్రు. తరువాత సహకార బ్యాంకులైనంక తీసుకున్నోల్లుండ్రు. ఎల్లి ఎల్లక అప్పు దాటేస్తుండ్రు.

# ఐశ్వర్యవంతుల సిత్రాలు




ప్రతి మనిషిలో కొద్దో, గొప్పో వెర్రితనమో, పిసినారితనమో, మరింకేదయినా ప్రత్యేకతో ఉంటుంది. ఐశ్వర్యవంతుల్లో అలాంటివి బాగా రాణిస్తాయి. దీనికి కొన్ని ఉదాహరణలు-

చాప్లిన్‌కు ఓ చిత్రంలో నటించడానికి వారానికి వేయి డాలర్లిస్తానని ఓ నిర్మాత వస్తే, 1025 డాలర్లు ఇవ్వమని కోరాడు. దానికతను అంగీకరించిన తర్వాత, 25 డాలర్లనే ఎందుకు ఎక్కువగా కోరావని అడిగాడు. దానికి చాప్లిన్ సమాధానం- "25 డాలర్లనయితే తటపటాయించక తప్పక ఇస్తారని నాకు తెలుసు. దాన్నెందుకు వదులుకోవాలి? "



లండన్‌లోని సవాయ్ హోటల్ అధినేత తరచూ తన స్నేహితులని పిలిచి తన ఇనప పెట్టెలోని వెయ్యిడాలర్ల నోట్లని చూపించేవాడు. అలా పదిలక్షల డాలర్లు ఒక్కచోట చూడటం అతడి మిత్రులందరికీ సంభ్రమంగా ఉండేది. అంతేకాక అతడు తన విదేశీ కరెన్సీని కూడా మిత్రులకు ప్రదర్శించేవారు.

అమెరికన్ కోటీశ్వరుడు జాక్ డెంప్సీ ఇతర ఊళ్లకు వెళ్లేటప్పుడు చెక్కుబుక్కు తీసుకెళ్లేవాడు కాదు. క్యాష్ తీసుకువెళ్లేవాడు. తన ఖర్చుల నిమిత్తం అతడు ఒకసారి పదిలక్షల డాలర్లను వెంట తీసుకెళ్లాడు. అమెరికాలో నగదు బదులు చెక్కులను అన్నిచోట్లా తీసుకుంటారనేది గమనార్హం. "చెక్ రాసిస్తే ఖర్చు చేసిన తృప్తి ఉండదు. అది నగదునుండే వస్తుంది" అంటాడతడు.

మరో కోటీశ్వరుడు ఏ క్నీల్ వెన్నర్ చాలా పొదుపరి. అతనోసారి హోప్ అనే ఖరీదైన వజ్రాన్ని కొని భార్యకు బహూకరించాడు. తన వ్యాపార పనిమీద ఫైవ్‌స్టార్ హోటల్స్‌లో బసచేసినా తన సాక్స్‌లను బాత్‌రూమ్‌లో తనే ఉతుక్కుంటాడు. వాటిని ఉతకడానికి ఆ హోటల్‌వాళ్లు వాటి ఖరీదుకన్నా ఎక్కువ ఛార్జీ చేస్తారని అలా చేస్తాడతడు.

విలియం.ఎస్.పాలే అనే మరో అమెరికన్ ధనవంతుడు కొన్నివేల డాలర్లు పెట్టి మిత్రులకు తన ఇంట్లో షాంపేన్ పార్టీ ఇచ్చాడు. అయితే షాంపేన్‌ను సర్వ్ చేయడానికి ప్రత్యేకంగా ఉపయోగించే 'షాంపేన్ మేగ్నమ్స్'లో కాక పెద్ద గాజుగ్లాసుల్లో వాటిని సర్వ్ చేయించాడు. ఎందుకంటే మేగ్నమ్స్‌ను తన సర్వెంట్లు ఎత్తుకెళ్లి, పగిలిపోయిన వాటిని వాటి లెక్కల్లో చూపిస్తారట! పెద్దగ్లాసులయితే వాటిని జేబుల్లో పెట్టుకుని తీసుకెళ్లడం వారికి సాధ్యంకాదు. అందుకే ఈ ఏర్పాటు.

అమెరికన్ మిలియనీర్ జేమ్స్ హట్టన్‌కు ఇతరుల చేతుల్లో తిరిగివచ్చిన కరెన్సీ నోట్లను ముట్టుకోవాలంటే భయం. వాటికి రోగాలను కలిగించే సూక్ష్మజీవులు అంటిపెట్టుకుని ఉంటాయంటాడు. అతడు బ్యాంకునుంచి తెచ్చిన సరికొత్త నోట్లనే వాడేవాడు. అలా డబ్బు తెచ్చేందుకు ప్రత్యేకంగా ఓ ఉద్యోగిని నియమించుకున్నాడు.

హాలీవుడ్ నటుడు రిచర్డ్ బర్టన్ తన పిల్లల పెంపుడు కుక్కలకోసం ప్రత్యేకంగా ఓ మర పడవని కొన్నాడు. కేవలం వాటినే ఆ పడవలో సముద్రం మీద ఉదయంనుంచి సాయంత్రందాకా తిప్పించేవాడు.

వార్నర్ బ్రదర్స్ స్టుడియోని భారీమొత్తంతో కొనుగోలు చేసిన ఎలియట్ హేమాన్ ఆరోజు సాయంత్రం తన కొడుకు నడిపే వస్త్రదుకాణంలో సేల్స్‌మేన్‌గా ఐదు గంటలు పనిచేశాడు.

## కొత్తగాలి...

**దొంగే**
**దొంగా..దొంగా అన్నట్లు**
**చెరచినవాళ్లే**
**ఆడది చెడిందంటారు**

*–సంగంబండ జగన్నాథరెడ్డి, మక్తల్*

మిత్తీలు పెరిగి అసలు కంటే లావయితుం దని ఫికరు పెట్టుకున్నోల్లు ఉంద్రు. కాయి తాలు సెక్రటరీకి ఇచ్చి 'ఒక్కొక్కని పిలువు సంగతేందో తెల్సుకుందాం' అన్నడు మేనే జరు. సిగరెటు దర్పంగా వేల్ల నడుమ ఇరి కిచ్చుకుండు.

గంట సేపట్ల అప్పు తీసుకున్న రైతు లంతా జమయ్యింద్రు. బడి వొరండాల ఎవరో మంచం వాల్సితే కూసుండు మేనే జరు.

ఒక్కొక్క పేరు సదువుతుండు సెక్రటరీ. ఆ రైతు ఉంటే.. బల్లె చిన్న పిలగాడు పంతులు ముందు చేతులు కట్టుకున్నట్టు కట్టుకొని నిలబడ్తుండు.

'ఎన్నేండ్లయింది అప్పు తీసుకొని' మేనే జర్ గాండ్రిస్తుండు.

రైతు నీల్లు నములుతుండు.

'లెక్క చూసుకున్నవా? ఊటగయి తుంది. ఎప్పుడు కడ్తవో చెప్పు. లేకుంటే తెలుసుగా గిన్నెలు సర్వలు ఏస్కపోతం. తలుపులు తాళం జీపుల యేస్తం' మేనే జరు పులిలెక్క గర్జిస్తుండు.

రేపు మాపు కడ్తం అంటుంద్రు రైతులు. కాళ్ల వేళ్ళపడి బతిలాడుతుంద్రు.

'కొంతమంది రైతులు లేరు. ఊరికి పోయింద్రంట. ఆడోల్లకు చెప్పిన' అన్నడు సెక్రటరి.

'అప్పులు తీసుకునుడు. ఊర్ల పొంటి తిరుగుడు. అట్ల తిర్గినంక పంటలు పంతయా. పైంగ కాలం అయితలేదు అని ఏడుపులు. అచ్చమైన రైతు లేకుంట అయ్యిండు. అప్పులు తెచ్చుకొని ఎగదొబ్బే దానికి తయారైంద్రు' మేనేజరు చిటపటలా డుతుండు.

అప్పు రైతులంతా చేతులు కట్టుకొని నిలబడ్డరు. పేరు పేరున అప్పు ఎంత ఉన్నది చెపుతుండు సెక్రెటరి. అసలు, మిత్తి చెపుతుండు. అంతా నీల్లు నములు తుంద్రు.

'పత్తి పంటలేస్తున్నమని క్రాప్ లోను తీసుకుంటిరి. పంట చేతికొచ్చె పైస కట్ట రైతిరి. బావులు, బోర్లని తీసుకుంటిరి. అదీ అంతేనాయే. రైతులకు అప్పులిచ్చి బ్యాంకులు మునిగేకాలం వొచ్చింది. సర్కా రోడేమో మా ముడ్డి మీద తంతుండు. రైతులకు పంటలు లేవా ఎందుకు బాకీలు తీర్సరు. మీరు తిరిగి వొసులు చెయ్యలేక కతలు చెపుతుంద్రు అని జాడిచ్చి తంతుంద్రు. వీల్ల కాడికొస్తెనేమో ఈ పరి స్థితి' మేనేజర్ కస్సుబుస్సులాడ్తనే ఉండు. ఏంది సంగతి అని ఒక్కొక్కల్ని గద్ది స్తుండు.

ఓ రైతు ముందుకొచ్చిండు. 'ఏం చెయ్య మంటరు. భూతన్క అప్పు తీసుకున్న నేనే మన్న తిని తాగి తందనాలడిన్నా? ఆ పైసలు పెట్టి బాయి తీయించిన. అది ఇయ్యాల బొంద అయ్యింది. కూటికి లేకనే అల్లాడుతున్నం. కాలమయ్యి ఇంత పంట పంతే బాకీ తీర్సమా. అన్నమో రామ చంద్రా అని అడుక్కునే కాలమొచ్చె' కడు పుల బాధను కక్కిండు.

మేనేజరుకు ఎదురు మాట్లాడేసరికి మండింది. అప్పు అప్పే. పంటలు పండినా పండకున్నా కక్కాల్సిందే. మీకు పంటలు బాగా పంతే మాత్రం ఎక్కువ కడ్తరా. అప్పు ముడ్డికింద పెట్టుకొని పైంగ ఎదురు మాట్లాడ్తవ్' అని వొంటికాలు

మీద లేసిండు.

ఆ రైతు గబుక్కున నోరు మూసు కుండు.

'అయ్యా ఇస్తం. మొన్న పత్తి సొంతం ముంచె. క్రాపు లోనని తెచ్చి పురుగు మందులకే పెడ్తిమి. గాశారం పాడుగాను చేతికందదాయే' ఇంకో క్రాప్ లోను తీసు కున్న రైతు బాధ.

'వినెటోడుంటే ఇట్లాంటి కతలు ఎవరైనా చెపుతరు. అయ్యన్ని పప్పులుడకవు గని ఎప్పుడు కడ్తరో చెప్పరి. బ్యాంకులోను తల తాకట్టుపెట్టయినా తీర్సాల్సిందే. లేదంటే వేలం ఎయ్యటం కాయం. నెల లోపుల కట్టలేదో కోర్టు నోటీసులు పంపిస్త'

ఒక్కరైతు కూడా పైస కట్టకుంట కష్టాలు చెప్పుకుంటుంటే మేనేజరుకు చికా కుగా ఉంది. ఇప్పుడు ఎట్లాగు వొసూలు కావని లేసిండు. సిగరెట్టు ముట్టిచ్చి గాల్లెకు పొగ వొదిలిండు.

'ఒక్కనెల టైమిస్త కట్టిండ్రా సరే. లేకుంటే తర్వాత నన్ను బదనాం చెయ్యొద్దు' అని జీపుల కూసుండు. సెక్ర టరీ కాయితాలు సదురుకొని జీపెక్కిండు.

రైతులు బిక్కమొకాలేసుకొని చూస్తుంటే జీపు కదిలింది. బ్యాంకు లోను తీసుకుం దామనుకున్న నారాయణకు అదురుపు ట్టింది. ఈ బ్యాంకుల కంటే సైదులే నయం. సర్కారోడు చెప్పిండని వొస్తరు. కడుపు నిండిన మనుషులు. కష్టం సుఖం తెల్వకుంట మాట్లాడ్తరు. సర్వ, బిందెలు బయిటేస్తరు. బజాట్ల ఇజ్జతు తీస్తరు. ఏడాది కింద ఈ బ్యాంకోల్ల తాకిడికే కదూ సత్తెమ్మ భూమమ్ముకొని నల్లగొండకు పోయింది. ఇంకెంత మందిని ఆదరువు లేకుంట చేస్తరో. ఈ అప్పులు పాడుగాను. సహకార రుణాలని ఇస్తరు. చివరికి సావు రుణాలైతున్నయ్. నారాయణకు బ్యాంకు మీద రోత పుట్టింది. ఆటి జోలికి పోవద్దు నుకుండు.

రైతులంతా ఒక్కొక్కలు కదిలిండ్రు. బ్యాంకోడు తలగొట్టేసినట్టు మాట్లాడుతుం డుగదా అనుకుండ్రు.

'థూ నీయమ్మ బ్యాంకులమ్మనీ చెయ్య. పెద్ద పెద్ద మాటలు చెప్పి ఇస్తరు. సచ్చిండా బతికిండా సూడరు. కత్తులు తీసుకొని వొసూల్లకు యెల్తరు' అన్నడు ఓ రైతు.

'ఈ నాకొడుకులు అయ్యాల అప్పియ్య కున్నా బాయిబొంద తియ్యకపోదును. కంటి మీద కునుకు పట్టకుంట ఆయె' అన్నడు ఓ రైతు.




**క**రెంటు కాల్వలయినంక ప్రతిపక్షాలు సర్కారు మీద దాడికి దిగిండ్రు. ముఖ్య మంత్రి అయితే ఒక్క దెబ్బల కొట్టి పడే స్తుండు.

'రాష్ట్ర అభివృద్ధిని చూడలేక వీల్ల ఏడుపు. ప్రజలు నాకు దగ్గరైతున్నరని వీల్ల కుల్లు. నేను స్పష్టంగా చెప్పుతున్నా. ప్రజలు గమనిస్తున్నారు' అంటుండు.

టీవీల నిండా హైటెక్కు సిటీ సూపిచ్చి ఆ రకంగా ముందుకు పోదాం అంటుండు.

ప్రతిపక్షమోల్లు పాదయాత్రలకు తయా రైండ్రు. ఊరూరు తిరిగి సర్కారు మీద దుమ్ము పోస్తుండ్రు. 'మేము అధికారంల కొస్తే ఉచిత కరెంటు ఇస్తం ఇరవై

నాలుగు గంటలు. రైతన్న తర్వాతనే ఎవ రైనా. మాది రైతు ప్రభుత్వం' అని ప్రచారం చేస్తుండ్రు.

రైతులు సర్కారుతో ఇసిగిపోయి పాద యాత్రల దిక్కుమల్లిండ్రు.

ఎండాకాలం ఎల్లిపోతుంది. వాన చినుకు లేదు. రైతులు కాల్లు జేతులు వొల్లె పెట్టుకుని కూసుండ్రు. బోరు బండ్లు ఊల్లల్ల దిర్గుతున్నయ్. ఒక బోరుల జల పడితే నాలుగుబోర్లు వొట్టిదే అయితుంది. తేకూడని కాడ అప్పులు తెచ్చి రైతులు బోర్లతో జూదమాడుతుండ్రు. సావో బతుకో ఇంకో దారేంది అని మొండి ధైర్యం చేసుకుంటుండ్రు.

ఆయిటి మొదలయ్యింది. అడపదడప వానలు పడ్డా వాకిలి తడిసేంతనే. చెల్కా పంటల దిక్కుచూస్తలేరు రైతులు. నారా యణ బోరు కింద నారు బోసిండు. నాటు పెట్టిండు. తనకే చేతి నిండ పనిలేదు. కొడుకు వొట్టిగ పైపెచ్చు తిరుగుడే అయి తుంది. శీను లేకున్నా ఈ రొండెకరాలు తను చేస్తడు కదా అనుకుండు.

ఓనాడు శీనుతోని అన్నడు.

'కొడకా ఈ గింత యవుసాయానికి నేను సాలు. ఇది నమ్ముకునేటట్టు లేదు. ఏదన్న జేసి ఊరిడిస్తే తప్ప బతకలేవు'

శీనుకు ఏం జెయ్యాల్నో అర్థం కాలేదు.

'ఏవన్నా ఆలోచించుకో కొడకా. లేకుంటే ముందలపొంటి తిప్పల పడ్తవ్' అన్నడు నారాయణ.

ఆరోజు నుండి శీనుకు కంటి మీద నిద్ర లేదు. నిజమే నాయిన చెప్పింది. ఈ యవుసాయం పట్టుకొని బతకలేము అను కుండు. నల్లగొండల ఏన్నన్న గుమస్తాగా కుదిరినా వెట్టి చాకిరే. గొర్రెతోక బతుకు. ఎదుగుబొదుగు ఉండదు. ఏదన్న వ్యాపారం చేద్దామంటే చేతుల పైసలేదు. ఆలోచిస్తున్న శీనుకు ఈ నడుమ సర్కారు ఇస్తున్న స్వయం ఉపాధి పథకం యాదికొ చ్చింది. ఎట్లన్న చేసి సంపాయించాలె అనుకుండు. తన ఆలోచన తండ్రికి చెప్పిండు.

'నిల్వనూరుకు పోత నాయిన. ఎమ్మార్వో ఆఫీసుల తెలుసుకుంట. అట్లనే ఆదాయ సర్టిఫికెటు అవీ తీసుకుంట' అన్నడు.

'మనకు ఏం ఉందని ఆదాయ సర్టిఫి కెటు' అన్నడు నారాయణ.

'అదేంది నాయినా. అప్పులల్ల ఉన్నా పాణాలతో ఉన్నంగా. ఏం తినకుంటనే పానంతోని ఉన్నవా. అంటే ఆదాయము న్నట్టే గదా అని లెక్కేస్తరు. అదంత మాయగాని నేను రేపు పోత నాయినా' అన్నడు.

నారాయణకు జర్ర ప్రాణం కుదుటబ డ్డది. తన బతుకు గడుస్తుంది. కొడుకు బతుకేందని బెంగ ఉండె. తను మాట అనంగనే ఆడు దారి దొరికిచ్చుకుండు. ఆడు ఎట్టన్న బయటపడితే బావుండు అనుకుండు. శీను తెల్లారి నిల్వనూరు బస్సెక్కిండు.

★ ★ ★

దాటికాడ మంది జమయ్యిండ్రు. రైతులు గోస ఎల్లబోసుకుంటుండ్రు.

'ఏం సర్కారో ఏమో, తెల్లోని రాజ్యం బాగుండె. తుర్కోని రాజ్యం బాగుండె. రైతుల గురించి ఆలోచించిండ్రు. ధర్మప్ర భువులు తన్నినా తన్నిండ్రు. పెట్టినా పెట్టిండ్రు. ఈ సర్కారోడు తన్నుడొక్కటే పెట్టుకునే' ఓ ముసలాయిన అన్నడు.

ఆయిన ఇద్దరు కొడుకులు నల్లగొండల ఉప్పరి పనికి పోతుండ్రు. కొడుకులు యాదికొచ్చినప్పుడల్లా కంటతడి పెడ్తడు. బిడ్డలు ఆగమైరి అంటడు.

'ఈ ఎర్రగూడేనికి ఓ బాట లేదాయే. ఓ బస్సు లేదాయే. చేస్కతింటందుకు పనిలే







దాయే. ఇది అడివా? ఊరా? ఒట్టి పాపం బతుకులాయే' ఎవరో దుక్కపు జీరతో అంటుంద్రు.

సర్కారోన్ని దుమ్మెత్తిపోసింద్రు. అంతా సుట్టలు ఎలిగించి ఎటూ తోయక కూసుంద్రు.

సోవ బెమ్మం కూడ వొచ్చి కూసుండు. రైతులంతా అలసిపోయి కూసుంటె సోవ బెమ్మం అందుకుండు.

'ఈ నడుమ ఊరు చూస్తుంద్రా... ఎవ లెవలో ఒస్తుంద్రు. ఏదేందో చేస్తుంద్రు. ఊరికి ఏదో దాపురించినట్టుంది' అన్నడు.

సోమబెమ్మం మనసుల అనుకునే మాట చాలా మందికి తెలిసిందే.

'మొన్న ఒచ్చింద్రంట. సంద్రకంచెల మీటింగు పెట్టింద్రంట. ఊల్లే ఆడోల్లు మొగోల్లు పోయింద్రంట. గజ్జగట్టి ఆడింద్రంట. ఏవన్న ఉందా బయటికి తెలిస్తే' సోవబెమ్మం భయభయంగా అన్నడు.

ఎంకటయ్య దిగ్గున లేసిండు 'మా పిల్లల్నైతే బయటికి పోనీయలేదయ్యా. ఎందుకొచ్చినతంట' అన్నడు.

'అదురు పిత్తుల ముండాకొడక, అదో పెద్ద ఇదని చెపుతున్నవు' అన్నడు పడిదలోడు.

వెంకటయ్య రోషమొచ్చి లేసిండు. ఏదో అనబోయిండు గని రేపు ఈడ మాట్టాడకుంటుంద్రని తెల్సినా జీపులేస్కపోతరు. నాకెందుకొచ్చిన కష్టం అని తుండుగుడ్డ దులుపుకొని బాట పట్టిండు.

దాటికాడ ముచ్చట్లు అయితుంటెనె గబ గబ ఉరుకుతుంద్రు జనం. కూసున్నోల్లంతా దిగ్గున లేసింద్రు. 'పోలీసోల్లు' ఎవరో కేక పెట్టింద్రు.

కన్నుమూసి తెరిసే లోపల అంతా ఇండ్లల్ల సదురుకుంద్రు.

ఊరినిండా పోలీసోల్ల బూట్ల చప్పుడు. అన్ని తలుపులు మూసి ఉన్నయ్. తలుపు సందుల నుంచి చూస్తుంద్రు జనం. చీమ చిటుక్కుమన్నా ఉలిక్కిపడుతుంద్రు.

పోలీసోల్లు జీపు ఊరి బైట పెట్టి ఊల్లె కొచ్చింద్రు. బువ్వ తింటోల్ల ఒక్కొక్కల్ని పట్టుకుంద్రు. ఇంట్లెనుంచే కొట్టుకుంట తీస్కపోతుంద్రు. నాల్గు దెబ్బలకే ఒరుస పెట్టి పేర్లు చెపుతుంద్రు. వాళ్లను ఎంట పెట్టుకొని ఇంటింటికి తిరుగుతుంద్రు. ఇంట్ల ఆడోల్లను కూడా ఉచ్చులు పోపిచ్చింద్రు. కుక్కలు కూడా తోకలు ముడుచుకొని జారుకున్నయ్. నడిజాందాక బూట్ల సప్పుడే. ఊరి కంటిమీద కునుకే లేదు.

పోలీసోల్లు అల్సిపోయి ఎల్లిపోయింద్రు. పొద్దున్న లబోదిబో మొత్తుకుంటుంద్రు.

'అయ్యో నా కొడకా అని' వెంకటయ్య తల కొట్టుకుంటుండు.

'నా కొడుకును సంపేస్తరు నాయినో' అని ఒక ఆడామే శోకాలు పెడుతుంది.

ఇరవైమందిని ఆసర పట్టకపోయింద్రని తెలింది. ఊరు గజ్జున ఒణుకుతోంది. అయాల్ల నుంచి ఎవరికి కునుకులేదు. మొగోల్లు... ముఖ్యంగా పడుసు పోరలు ఇంట్లె పంతలేరు. ఊల్లే చీకటి పడితె సాలు మొగపురుగు కనపడితే ఒట్టు. బావుల కాడ కూడ సరిగ్గా పంతలేరు. ఏ మాపు జీపులొస్తయో తెలుస్తలేదు, గుట్టలు చెట్లల్ల తిరుగుతుంద్రు.

నిల్వానూరు నుంచి రోజు వార్త వొస్తుంది. పట్టకపోయిన పోరలు నిల్వానూర్ల లేరంట. ఎక్కడెక్కడో తిప్పుతుంద్రంట. మందిపోయి సర్పంచిని బతిలాడింద్రు. కాళ్ల వేళ్ల బడ్డరు.

'అయ్యో ఇడిపియ్యాలె. లేకపోతే బిడ్డలు సస్తరు' అని శోకాలు పెట్టింద్రు.

ఎంత మొత్తుకున్నా ఫలితం లేదు. సర్పంచి కాల్లు బార్ల సాపిండు.

'వోన్ని పొడిసింది కాదు. ఓ ఆడమనిషిని గుంజింది కాదు. చిన్న సన్న

ముచ్చట కాదు. నేను స్టేషనకు పోయిన అంటే నన్ను లోపటేసి తోమినా దిక్కు లేదు' అన్నడు.

ఇంగ సర్పంచితోని కాదని బయట పడ్డరు. ఓపికున్నోలు ఎమ్మెల్యే దాంక పోయింద్రు.

ఆయిన చూద్దాం అన్నడంట. తిరిగి తిరిగి అలిసిపోయింద్రు. ఆశ ఒదులు కుంద్రు.

★ ★ ★

నారాయణ పొలాన్ని కంటికి రెప్పోలిగ కాపాడుకుంటుండు. వచ్చే కరెంటు పోయే కరంటు. మోటారుకాన్నే కాపలా. రొండెక రాలు వరి చేను సక్కదనంగ ఎదిగింది. పోయిన సారికంటే ఈసారి కరెంటు నయమే. పాదయాత్రలు చేస్తుంద్రనో, ఎల క్షన్లు దగ్గరపడ్తున్నయనో గాని నయమే. పొలానికి నీటి ఇబ్బంది లేదు.

నారాయణ ఒరం మీదంగ నడుస్తుండు. ఒరాలు తేటగ పొతం చేసి ఉన్నయ్. ఆడాడ కలుపు మొక్కలు కనబడుతు న్నయ్. ఒంగబడి చేతికందిన కాడికి పీకు తుండు.

కమలమ్మ సద్ది తీస్కోని ఒచ్చింది. యాపచెట్టు కింద పెట్టి భర్తకల్ల పోయింది. నారాయణ తోడంగి పీకు తుండు.

'తర్వాత పీకుదువ్‌గాని రా సద్ది తెచ్చిన' అన్నది.

నారాయణ నాలుగు వొరాలు చూసు కుంద్రు. ఎండ్రకిచ్చలు పొక్కలు తొక్కి యాపచెట్లకల్ల కదిలిండు. భర్త ఎన్కంగనే కమలమ్మ.

'శీను నిల్వానూరుకని పోయిండు. అయ్యేంటివో కాయితాలు ఇయ్యాల ఇస్తన్న రంట. అట్లనే బేంకోన్ని కలిసొస్త అన్నడు' కమలమ్మ భర్తకు చెప్పింది. నారాయణ ఊకొట్టిండు.

'ఏం తిరుగుడో ఏమో రొన్నెల్లు అవు

## కొత్తగాలి...

**వినని వాడికి**
**చెప్పేవాడు**
**చెప్పేవాడికి**
**వినేవాడు లోకువ!**

– డా. అయాచితం నటేశ్వర శర్మ,
కామారెడ్డి

తుంది. బస్సు కిరాయిలే బొచ్చెడు అయితు న్నయ్. అది వొచ్చేదేందో సచ్చేదేందో' అన్నడు.

నారాయణ సద్దిమూట ఇప్పిండు. బోరు పోస్తుంది. ఒరి పొలం పక్కన రెండెక రాలు ఉట్టిదే కంచె. రెండు ముసలెడ్లు ఉన్నప్పుడన్న అయ్యి నాకు ఛాడేవి. ఈ ప్రాణానికి అయ్యేందుకని అమ్మేసే. ట్రాక్టర్ పెట్టి దున్నేదానికి గొడ్ల మేపడం ఎందుకు. ఎట్లమ్మ ఎలగట ఇత్తనాలు ఎయ్యాలి అన్నట్లు లేదాయే. వొరినాటు పడితే మల్ల పని లేదాయే. కంచపడావు పడ్డది.

నారాయణ సద్ది తింటుంటే 'బిడ్డలు ఎదుగుతుంద్రు. ఈ ఏడయితే ఆడపిల్లలకు ఎర్రబెల్లి బడి అయిపోతది. తర్వాత ఎట్టనో ఏమో' అన్నది కమలమ్మ.

'ఇయ్యాల్టి కష్టాలు ఇయ్యాల, అయ్యేం దుకు యాదికిచేస్తవ్. ఆల్ల రాత ఎట్లుంట దోలే' అన్నడు నారాయణ.

'ఎవయా బొర్రెంకయ్య బోరు తగ్గిం దంట గదా. మనది కూడా తగ్గుతదా ఏంది' కమలమ్మ భయంగా అన్నది.

నారాయణ కూడా ఆ మాట బొర్రెం కయ్య జీతగాండ్లు అంటుంటె ఇన్నడు. అట్లని పది పదిహేను దినాలయ్యింది.

'ఇప్పటికైతే నీల్లకు ఇబ్బంది లేదంట బొర్రెంకయ్యకు. మనది ఎందుకు తగ్గుతది







పోస్తుంది. అయినా తక్కువ లోతు ఏసినాం? ' అన్నడు నారాయణ.

భర్త మాటకు ధైర్యమొచ్చింది కమలమ్మకు. నారాయణ అన్నం తిని చేతులు కడుక్కుండు. కుండల నీల్లు రొండు బుక్కలు తాగిండు. యాపచెట్టుకు ఆని బీడి ముట్టిచ్చిండు.

జరసేపయినంక 'లేవయా ఆ కలుపు పీకి ఎండకాకముందే పోదాం' అన్నది కమలమ్మ.

ఆ మాటతోపాటే నారాయణ లేసిండు.

ఆలుమొగలు పొలంలకు దిగిండ్రు.

★ ★ ★

పొద్దూకంతల నారాయణ దాటికాడికని ఎల్లిండు. బడికాడికి పోయేసరికి బక్కులు ఎదురొచ్చిండు.

'అటే వొద్దామని ఎల్లినయ్య' అన్నడు బక్కులు.

'అట్లనా? ' అన్నడు నారాయణ ఆగి.

'దాటికాడికా? పారి నేను కూడ వొస్త' అని మల్లిండు బక్కులు. ఇద్దరు నడుస్తుండ్రు.

'పోలీసోల్లు పట్కపోయిన పోరగాల్లను చింతపండు చేసిండ్రు. ఇంతకు ముందే వొచ్చిండ్రు. ఒక్కొక్కడు లేవలేక మూల్గుతుండు' బక్కులు చెప్పిండు. నారాయణ మనసు చివుక్కుమన్నది.

'వారం దినాలాయె. తావు మార్సి మార్సి కొట్టిండ్రంట. పోరగాల్లు ఉలిక్కిపడుతుండ్రు' బక్కులు గొంతులో బాధ. ఇంకో మాటనలేకపోయిండు. దాటికాడి కొచ్చి కూసుండు. ఇంటి ముందల గురువయ్య ఒరిగిండు. నారాయణను చూసి లేసి కూసుండు.

'ఏం నారాయణ ఎట్లుంది పొలం? ' అడిగిండు.

'ఆ మంచిగనే ఉంది.. పారుతుంది' అన్నడు నారాయణ.

'బొర్రెంకయ్య బోరు సొంతం పీక్కపోయిందంట గదా' అన్నడు గురువయ్య.

నారాయణ తల్కాయ ఊపిండు.

'ఎంత లోతు బోర్లేస్తే మాత్రం ఏం లాభం, భూమిల జలలేంది. సక్కదనాల సాగరు వాకిట్ల ఉన్నట్టే ఉండె. నీల్లకు మాత్రం రాత లేదాయే. ఎవన్నని ఏం లాభం. అంతా అమ్ముడుపోయే ముండా కొడుకులు' గురవయ్య అన్నడు.

'ఎవడు ముఖ్యమంత్రి అయితే ఆడే నీల్లు దొబ్బితినె. ఇంతెందుకు మన పక్క జిల్లావాడు ముఖ్యమంత్రి అయ్యిండు. ఆడు తక్కువ తిన్నడా. సక్కగ కాలువ తీస్కపోయి ఆని జిల్లాల ఏస్కునె. ఎటొచ్చి ఆగమయ్యిందంటే మనమే' అన్నడు గురవయ్య.

'మార్వాకకు కరంటోల్లు వొచ్చిండ్రంట. వొంగబెట్టి బిల్లు వొసూలు చేస్తుండ్రంట. రేపో మాపో మనూరికొస్తరు' అన్నడో రైతు భయంగా.

'ఓ... పంటలు పండి రైతులు బల్సిపోతుండ్రని వొసూల్ల కొస్తున్నారు కొడుకులు' అన్నడు గురువయ్య.

పక్కనుంచి పోతున్న పటేలు ఆగిండు.

'నారాయణ నీ బోరెట్ల పోస్తుందీ? ' అని అడిగిండు.

నారాయణ 'ఆ మంచిగనే పోస్తుంది. ఇప్పటికైతే సావులేదు' అన్నడు.

'బొర్రెంకయ్య బోరు దగ్గర పడ్డదంట. పొద్దున్న కలిసి బోరెయ్యాలె కల్లాలయినంక అన్నడు'

పటేలు మాటతో నారాయణకు వొల్లు జల్లుమన్నది. బొర్రెంకయ్య ఎంత లోతేస్తడో ఏమో. పక్కగెట్టు. తనకైతే ఏతం పెట్టడుగా అనుకుండు.

అయినా ఆయిన యాన్నో ఏస్తే తన బోరుకేం దెబ్బ అని మల్ల నిమ్మలపడ్డడు.

'దినదిన గండం నూరేళ్ల ఆయుస్సు

అయిపోయే బతుకు' అన్నడు గురువయ్య.

'అట్లగూడ లేదు ఇప్పుడు. దిన దినం గండమే. ఆయుస్సు ఎప్పుడు తీర్తదో తెలుస్తలేదు' అనుకుంట నారాయణ లేసిండు.

గురవయ్య దగ్గుకుంట 'పొలం కాపాడుకో.. నోటికాడి కొచ్చిన పంట' అన్నడు.

★ ★ ★

శీను పొద్దుగల్ల లేసి తయారయిండు. స్నానం జేసి బట్టలేసుకుండు.

'అమా బస్సు టైం అయిందమా. అక్కడేమన్న తింటలే' అన్నడు.

కమలమ్మ గబగబ ఉరికొచ్చింది.

'అయిపాయె కొడక చెల్లెండ్లు రొట్టె చేస్తుండ్రు. అగో చూడు. జర్రసేపు ఓపిక పట్టు' అని వొంటింట్లకు ఉరికింది.

అట్ల ఓ రొట్టె అందుకొని ఇంత తొక్కేసి కొడుక్కు ఇచ్చింది. శీను కంగారు కంగారుగా ఉండు. రొట్టె అందుకుని తినుకుంటనే బస్సు ఎల్లిపోతదో ఏమోనమా' అన్నడు.

కొడుకు ఆత్రపడుతుంటే 'యాడికిరా శీను' అన్నడు నారాయణ అప్పుడే వొచ్చి.

'నిల్వనూరుకు నాయినా. ఇయ్యాల ఒక్కనాడు బ్యాంకోన్ని కలిస్తే తాడో పేడో తేలుద్ది' అన్నడు శీను. శీను గొంతులో అలసట కనిపించింది. ఓ నాడు తప్పిచ్చి ఓనాడు పోయినట్టు పోతుండు. ఎమ్మార్వో ఆఫీసు సుట్టు కాయితాలకని తిరిగిండు. అయి తీసుకుని నల్లగొండ స్టెప్పాఫీసుకు పోయిండు. అక్కడ కడుపు నిండినట్టు మాట్లాడేటోల్లు. ఒకపని చేసినంక మల్లో అడ్డుపుల్ల. ఆ సర్టిఫికెటు ఈ సర్టిఫికెటని గెదిమిండ్రు. ఆల్లు అడిగిన







యన్ని తెచ్చేసరికి తలపానం తోకకొచ్చింది శీనుకు. ఆఫీసుకు పోతే ఆఫీసరు ఉండడు. ఎప్పుడు పోయినా టూర్ల మీదుండు సారు అనే చెప్తరు. అంతగనం టూర్లేముంటయో శీనుకు అర్థమయ్యేది కాదు. ఆదివారం వొచ్చిందంటే ముందో రోజు ఎనకోరోజు సెలవులు. అట్లపోయి ఇట్లొచ్చేసరికి వారం గడిచింది.

ఆఫీసరు కలిస్తే చెమట పట్టుకుంట కుర్సీల కూసోని అద్దాల మీది నుంచి సూస్తడు. ఎడమ చెయ్యితో అట్లపట్టి ఇట్లు చూస్తడు కాగితాలు.

'మంచిది ఇంకా ఏమన్న ఉన్నయేమో ఓ సారి ఆ సెక్షన్ల కలిసి పో' అంటడు.

సెక్షనాయిన సంకన పట్టేటన్ని ఫైల్లు పెట్టుకుని కూసుంటడు.

'నమస్కారం సార్, నమస్కారం సార్' అన్నా తల పైకెత్తకుంటనే 'పనిమీద బిజీగా ఉన్న. జర్రాగు' అంటడు.

వొచ్చినోల్ల వొదిలిపెట్టి పీకి కట్టలు కట్టే పనేముందో అనుకుండు శీను ఉడికిపోతు. అరగంట నిలబెట్టి అప్పుడు తల పైకెత్తు తడు. ఆ చెప్పు అంటడు.

గబగబ చెప్పుతుంటే తల పైకెత్తి ఆవు లిస్తడు.

అంతా అయిపోయి నిలబడ్డంక 'రేపో సారి కలువు. తీరికగ మాట్లాడుదాం' అంటడు.

రేపు మాపు అనుకుంట గడిసిపోతుంది.

ఎక్కడెక్కడి నుంచో వొచ్చే పిల్లలు కూడా ఉండ్రు. అల్లేమో 'కొడుకులకు ఇంతో అంతో మేపకుంటే మొకం కూడ చూడరు. అది వొచ్చేదేందో రానిదేందో గని ముందే మెక్కుతరు' అంటరు.

చివరాకరికి ఇంటర్వ్యూలని పెట్టిండ్రు. ఏం పెడతవ్. నీకేమి అనుభవముంది. అది నడుసుద్దా అని ఆరా తీస్తరు.

శీను తను పెట్టదల్చుకున్న టెంట్ హౌజ్ గురించి చెప్పిండు. అయ్యి అయితనే ఏ రిస్కు లేకుంట ఉంటది. పండుగలకు పబ్బాలకు, పెండ్లిల్లకు పేరంటాలకు గిరాకి వొస్తది. కిరాణ షాపు అనుకుండు గాని ఆ కోంట బేరం తనవల్ల కాదని ఊకుండు.

మరి మీ మండలానికి పన్నెండు శాంక్ష నైనయ్. ఈయినకు ఆయినకు అని ఏమి లేదు. ఎవరు ముందు బ్యాంకు కాన్సెంట్ తెచ్చుకుంటె వాల్లకే అన్నరు.

ఈ తిరకాసేందో శీనుకు అర్థం కాలే. అయినా సరే అని తల్కాయ ఊపిండు. నిన్న బ్యాంకోన్ని కల్సితే రేపురా అన్నడు.

అందుకే శీను తయారైతుండు. పొద్దు గల్ల పోయి కల్సిరావాలె. ఊకె ఈ గాలి తిరుగుడు తిరిగే బదులు ఏదో వోటి తేల్చుకోవాలె అనుకుండు.

'ఎంతవరకు వొచ్చింది శీనూ ఇంటర్వ్యూ'.

'అయిపోయింది నాయినా. బ్యాంకోడు సరే అంటె ఇస్తరంట. దాని గురించే కలి సొద్దామని పోతున్న' శీను గబగబ రొట్టె నములుకుంట చెప్పిండు.

'బస్సు లేటుగ పోయిందిరా శీను. అది ఎన్కకు మల్లి ఒచ్చేసరికి బానే లేటయి తది. నిమ్మలంగ తిను' అన్నడు నారా యణ.

శీనుకు గుండెదడ తగ్గింది. బస్సు గురించి టెన్షన్ ఉండె. బస్సేమన్న ఊల్లెకొ చ్చేదా పాడా. ఊల్లెకొచ్చేదన్న అయితె సప్పుడు యినైనా ఉరుకొచ్చు ఓ గడ్డ మీద నుంచి పోతదాయే. రొట్టె తిని నీల్లు తాగిండు శీను.

'సరే పోయిరా. రేపటెల్లుండి కోతలు మొదలు పెడదాం. గింజ ఎర్రబారింది' అన్నడు నారాయణ.

'అమా పోయొస్త' అని చెప్పులేసుకుండు శీను. ఓ కవరు చేత పట్టుకొని గబగబ బయట పడ్డడు.

కొడుకును చూస్తుంటే నారాయణకు మనసు చెమ్మగిల్లింది. బతుకుదెరువు కోసం ఎంత ఆరాటపడుతుండు. ఈ కాలాలకు బతుకుడు కష్టం. బయిట పడితే బావుండు అనుకుండు.

కమలమ్మ రొట్టెలు పట్టుకొచ్చి భర్తకిచ్చింది. 'నువ్వు గూడ తిను పిల్లలు ఇపుడే చేస్తుంద్రు. వేడి వేడిగున్నయ్' అన్నది.

అటిటు చూసి వీడుపాయెనా అని అడిగింది. నారాయణ తల్కాయ ఊపి రొట్టెలందుకుండు.

★ ★ ★

శీను గడ్డమీదికి ఉరికినట్టే నడిసిండు. గస వొస్తున్నా లెక్క చేయకుంట చిట్ట చిట్ట నడిసి రోడ్డు చేరుకుండు. అప్పటికే ఎర్ర గూడెపోల్లు పది మందాసర ఉంద్రు. పక్కన చెట్ల నీడల కూసుంద్రు.

'బస్సుందా పోయిందా' వాళ్ల దగ్గరికి పోయి అడిగిండు శీను.

'ఉందయ్య. నిల్వనూరుకేనా' అడిగిందో ఆడమనిషి.

'ఆ ఆ మీరంత యాడికి తయారయింద్రు' అడిగిండు శీను. ఆల్ల మూటలు ముల్లెలు చూస్తుంటె శీనుకు అర్ధమయితనే ఉంది.

'కోతలు మొదలయినయ్‌గా నాయినా. మిరేలగూడెం కల్ల పోతున్నం. ఊల్లె ఏముంది పని? కాల్వ కిందికి కోతలకు పోతెనన్న నాలుగిత్తులొస్తయ్' అన్నది ఆడ మనిషి.

శీను నీడకు నల్లగుండు మీద కూసుండు. ఆల్ల మూటల దిక్కు చూస్తుండు. గిన్నెలు, తపేలలు మూట గట్టింద్రు. గుడ్డల మూటలు.

'ఇంగ పోలాల్ల కాన్నే ఇంత వొండుకొని తింటం నాయినా. మరి అన్ని తీస్కపోవాలె గద. ఆడ అమ్మెవడు. అయ్యెవడు' అన్నది ఇంకో ఆడ మనిషి.

'ఎంత ఓ నెల్లాల్లు పని దొరుకుద్దా' శీను

**కొత్తగాలి...**

**తిమిరంతో**
**సమరం చేసే**
**మిణుగురునైనా చాలు**
**జీవితం సార్థకం**

— ప్రతాప వెంకట సుబ్బారాయుడు,
సికింద్రాబాద్

అడిగిండు.

'ఎక్కడిదయ్య ఈ కాలాలకు నెల్లాల్లా. సరిగ్గ పదేను దినాలు దొరికితే సాలు. ఇంతకుముందు నువ్వన్నట్టు దొరికేది. ఇప్పుడు ఆ వరి కోతల మిషన్లు పాడుగాను గద్దలు తిరిగినట్టు తిరుగుతుండె. ఇంగ మమ్ముల కొడవలి పట్టి కోస్తందుకు ఎవడు పిలుస్తడు నాయినా. యానోన్నో చిన్న చితక ఆసాములు ఆ మిషిని అందకపోతే మమ్ముల పిలుస్తరు, మొదటి ఆడ మనిషి అన్నది. ఆమె గొంతు వొనికింది. కండ్లు తేమ బారినయ్.

ఆడ ఉన్న మొగోల్లయితె ఏనె గుండ్ల లెక్కనే కూసుంద్రు. సుట్టలు తాగుతుంద్రు. ఆల్ల గుండెలు ఏడ్సీ ఏడ్సీ మొద్దుబారినట్టుంది. ఆకాశం కూలి మీద బడ్డా ఏడ్సేటట్టు లేదు.

ఇదంతా మామూలె అన్నట్టుగా ఉంద్రు. అందరి మొకాల్లో ఏదో దిగులు. కూటి కోసం ఎన్ని తిప్పలు పడాల్సి వొస్తుందీ అనుకుండు శీను. తన సంగతి యాదికొచ్చింది. మరి తను దానికోసమేగా అనుకుండు.

శీను ఆలోచనలను చెడగొడుతూ 'అగో బస్సు' అన్నడు ఓ మొగ మనిషి.

అంతా మూటలు చేతుల కందుకొని లేసింద్రు. నాలుగడుగులేసి రోడ్డు పక్క నిలబడ్డరు. బస్సు ఎర్ర దుమ్ము లేపుకుంట







వొచ్చి ఆగింది. ఒకసారే సుడిగాలి కమ్మిన ట్టయింది. దుమ్ముకు ఊపిరాడకుంట అయ్యింది. జరసేపటి దాంక దుమ్ముల బస్సు కూడా కనిపించలే.

'ఆ ఎక్కాలె ఎక్కాలే' కండక్టరు అరుస్తుండు.

అంతా మూటముల్లె సదురుకొని ఎక్కింండ్రు. సీట్ల కింద, సీట్ల నడుమ పెట్టింండ్రు. మనిషి నిలబడే సందు లేదు.

'అన్ని మూటలు పేర్సింండ్రు బాటల. టిక్కెట్ ఎట్ల తీస్కోవాలె. తియిరి తియిరి' అంటుండు కండక్టరు

బస్సు కదిలింది. శీను ఒక పక్కకు నిలబడ్డడు. బస్సు సొంతం కలె జూసిండు. అన్ని మూటలే. మార్వాక మాదిగోల్లు ఉండ్రు. అంతా కాల్వ కిందికి తయారయి నట్టుంది. చింపిరి జుట్టు. మాసిపోయిన

గడ్డాలు. కండ్లల్లో ఆకలి. మొకాల్లో అలసట. పిల్లల ఏడుపులు.

బస్సు మూల్గుతూ కదిలింది

★ ★ ★

పొద్దుగూట్లె పడుతుంటే ఇల్లు జేరిండు శీను. మొకమంతా పీక్కపోయింది. ఇన్నాల్లు తిరిగిన కష్టం దండగయ్యింది అన్న దిగులు. ఆశలు బూడిదపాలైనయ్ అన్న దుక్కం. తిండి కూడ తినలేదాయె.

కమలమ్మ కొడుకు మొకం చూసి 'కాళ్ళ జేతులు కడుక్కో కొడకా. తిరిగి తిరిగొచ్చినవ్' అన్నది.

శీను జాలాట్లకు పోయి కాల్లు జేతులు కడుక్కొచ్చుకుండు. తల్లి అన్నం తట్టి చేతికిచ్చింది. మంచం మీద కూసోని తింటుండు.

మంచం మీదనే బీడి తాగుకుంట పండుకున్న నారాయణ 'కాయా పండా కొడకా' అన్నడు.

'పుచ్చు నాయినా' అన్నాడు శీను.

నారాయణ అర్థంగానట్లు లేసి కూసుండు.

'అంతా మోసం నాయినా. లంజా కొడుకులు బతుకులతో ఆడుకుంటుండ్రు. అరచేతిల స్వర్గాలు చూపిస్తుండ్రు. ఏండ్ల బట్టి తిప్పించుకుంటుండ్రు.







కన్నమ్మ కష్టాలు పెడుతుండ్రు. బ్యాంకోడు సరే అంటే ఇస్తమంటరు. బ్యాంకు నా కొడుకు ష్యూరిటీలంటడు. మనం లక్ష రూపాయలు ఫిక్స్డ్ డిపాజిట్ చూపిస్తే ఇస్తడంట. లక్ష రూపాలే మన దగ్గరుంటే ఆ ముండమోపి బ్యాంకు గడప తొక్కుతమా. అంతా వుట్టిదే నాయినా. సావకుంట బతకకుంట మనుషులతో ఆడుకుంటుండ్రు' శీనుకు దుక్కం తన్నుకొస్తుంది.

నారాయణకు ఇంకో మాట అడగబుద్ధి కాలే.

★ ★ ★

శీను మనసంతా చికాకుగా ఉంది. సుదర్శన్ ఇంటికి పోదామనుకుండు. సుదర్శన్ నల్లగొండకు పోయిండని తెల్సింది. ఎటూ తోయక బంటోల్ల సందుకు పోయిండు. పిల్లలకు అన్నం తినిపిచ్చే ఆడోల్లు కొత్త మనోషిలిగ కనపడే సరికి దిగ్గున లేస్తుండ్రు. మల్ల గుర్తుపట్టి 'నువ్వా అయ్యా ఏ పోలీసోడో అనుకున్నం' అంటుండ్రు.

శీను ఎంకటయ్య ఇంటికి పోయిండు. ఎంకటయ్య నల్లగొండకు పోయిండని భార్య చెప్పింది.

'పెద్దోడు సాంబడు ఉండయ్యా పిలవనా' అన్నది.

శీను సాంబయ్యతోని మాట్లాడుదమనే వొచ్చిండు. ఇంటి ముందల చిన్నపాటి అరుగుంటె కూసుండు. సాంబయ్య అప్పుడే తిన్నట్టుంది. మూతి తూడ్చుకుని వచ్చిండు. అరుగు మీద ఓ పక్కకు కూసుండు. 'అమ్మమ్మ' అని మూల్గుకుంట కాల్లు మడ్చుకుండు. లుంగి సదురుకొని బీడి ముట్టిచ్చిండు.

'ఏం శీనూ తోవ తప్పి వొచ్చినట్టుంది' అన్నడు సాంబయ్య.

'రేపు కోతలు. కూలి మనుషులు కావాలె. నాయిన చెప్పి రమ్మంటె పోయొస్తన్న. నువ్వు యాదికొచ్చి ఆగిన' అన్నడు.

సాంబయ్య సరిగ నడవలేకపోవడం శీను చూసిండు. కూసోవటానికి కూడ ఇబ్బంది పడి మూల్గిండు. పోలీసోల్లు పట్టకపోయిన సంగతి యాదికొచ్చింది. శీను తదేకంగా సాంబయ్యనే చూస్తుంటే 'మొన్న పట్టకపోయిరిగా... ఆ నొప్పులు' అన్నడు.

శీను కుచ్చికుచ్చి అడగలేకపోయిండు. కాని సాంబయ్య చెప్పడం మొదలుపెట్టిండు.

'అన్నలకు సద్దులు మోస్తున్నమని తెలిసిందంట. కోళ్ల కమ్మినట్టు కమ్మి ఏస్కపోయిరి. అయ్యో భగమంతుడు, తాతలు యాదకొచ్చిండ్రు. అయి దెబ్బలా నాయినా. బీరు సీసాలు ఎక్కించిండ్రు. కోదండాలు, తోలు బెల్టుల దెబ్బలు, నాయినా పాణం పోయిందనే అనుకున్న' నొప్పులకు మూల్గుతుండు సాంబయ్య.

'కడుపు మండినోడు ఏం జేస్తడు. ఆ మార్వాక మాదిగోల పిలగాడు ఎంకన్న ఊల్లెకు తీసుకొచ్చిండు. ఆల్లు చెప్పే మాటలు, బయిట జరిగే సంగతులు ఒకటేనాయె. దాపులేనోల్లకు దాపుంట మంటె లేదంటమా. ఏ మాటకామాట సంద్రకం చెల మీటింగుకు పోయింది నిజమే' అన్నడు సాంబయ్య నవ్వుకుంట.

శీను భయంగా చూస్తుంటె 'ఒకసారి అయితే భయం పోతది. ఇప్పుడా భయం లేదు. ధైర్యం కూడా వొచ్చింది. ఎంతయినా ఓట్ల కోసం యేశాలు ఏసే రాజకీయ నాయకులకంటే ఆల్లేనయం. జనం గురించి ఆలోచిస్తరు. జనం పాట పాడ్తరు. ఆ మాత్రం ఆల్ల భయం లేకుంటె బొర్రెంకయ్య అసుంటోల్లు ఆగుతరా? రాజకీయ నాయకులు ఇంటరా, ఊర్ల మీద పడి దోసుకొని తినరు'

సాంబయ్య మాట తీరు మారింది. ఏదో

కసి కనిపించింది. చాలా సేపు ఇన్నంక శీను లేసి ఇంటిబాట పట్టిండు.

★ ★ ★

అప్పులు, ఆదా, పిల్లలు, భవిష్యత్తు... నారాయణకు భయం భయంగా ఉంది. రొండేండ్లయింది బోరేసి. నాలుగు పంటలు తీసిండు. అయినా ఏటి ఈతకు లంక మేతకు సరిపోయింది అన్నట్లుగానే ఉంది బతుకు. ఓనాడు ఊకుంది లేదు. తృప్తిగా పండుకుంది లేదు. ఎప్పుడు ఏదో రంది. ఏదో ఆందోళన. ఆలోచన్లు తొలుస్తుంటే నారాయణ బోరుకాడికి బయల్దేరిండు.

చేతుల బీడి ఎలుగుతుంది. ఓ దమ్ము గుంజి వొదులుతుండు. నోట్లనే ఏవో లెక్కలు చేసుకుంటుండు. ఆయనకు ఆయనే మాట్లాడుకుంటున్నట్లుగా పెదవులు కదులుతున్నయ్. పరధ్యానంగా నడుస్తుండు. పొద్దురొండు బారలెక్కిందో లేదో ఎండ దంచుతుంది. గౌండ్లోల్ల ఆకిట్ల కొచ్చేసరికి అరుగు మీద గురువయ్య కూసోని ఉండు. ఎంత సేపయ్యిందో కూసొని. పోవడానికి కర్రదాపున లేవబోయిండు. నారాయణను చూసి మల్ల కూసుండు.

'ఏం నారాయణా ఊరంతా హడావుడిగా ఉంటే నువ్వేడికి ఎల్లినవ్' అన్నడు.

ఆయన మాటలో వ్యంగ్యం నారాయణకు అర్థమయ్యింది. నిన్న మొన్నటిదాంక ఎన్నికలాయె. ఇంకో దఫ ఎన్నికలయితే ఫలితాలు వొస్తయ్. ఇక్కడ ఎన్నికలు అయిపోయినా ఊరి జనం ఇంకా ఆ మత్తులోనే ఉండ్రు. ఆ ముచ్చట్టే మాట్లాడుకుంటుండ్రు.

'ఇంకో వారం ఆగు ఎవరు గెలుస్తరో' చూపిస్త అని బెట్టుకట్టుకుంటుండ్రు.

పదిహేను ఇరవై రోజులు జెండాలు మోసినోల్లాయె. కిక్కుదిగకుంట తిరిగినోల్లాయె. అంత తొందరగ తేరుకుంటారు?

## కొత్తగాలి...

**మనసు కొండ**
**ఆలోచన జలపాతం**
**అక్షరం కెరటం**

– వి.అనంతరావు, విశాఖపట్నం

వాల్ల వాలకం చూసి గురవయ్యకు మండిపోతుంది. అందుకే ఆ మాటలో వ్యంగ్యం.

నారాయణ అట్టనే నిలబడి 'నాకు ఎల్లదు కదనే రాజకీయాలు మాట్లాడకుంట కూసుంటె. యాసంగి పొలం తడి తప్పిన్నాడు. పెట్టిన మోటరు ఎట్లుందో ఏం సంగతో ఓసారి చాలుచేసి చూసొద్దామని యెల్లిన. చిన్నగ మడి తడిపెతందుకు ఉపాయం చేస్తున్న. ఇపుడు తయారు చేసుకుంటెనే ఇంత నారు, నాటు' నారాయణ చెప్పిండు.

'పోదువుగాని కూసో' అన్నడు గురువయ్య.

నారాయణ కూసుండు. అంతోయింతో ఈ ముసలాయినతోని మాట్లాడ్తెనే ఏమన్న తృప్తి. లేకుంటె ఎప్పుడు దిగులు. జర నిమ్మలపడి పోదాం అనుకొని కూసుండు.

గౌండ్లోల్ల ఇంట్లె నుంచి బుర్కల చెన్నడు ఎల్లిండు మూతి తూడ్సుకుంట. అప్పటికే ఇంత మింగినట్టుంది కల్లు. పెదవులు సప్పరిస్తుండు. నారాయణను బీడిముక్క అడిగి ఎలిగిచ్చిండు.

'మా సర్కారే మల్లా ఐదేండ్లు ఉంటది. అయినేమన్న తక్కువ చేసిండా. ఆ పట్నంల పోయి సూడ్రి. అద్దమోలిగ చేసిండు. ఇంకో పదిహేనేల్లల్ల ఊర్లన్ని అట్ల చేస్తనంటుండె. గెలవకేంచేస్తడు'







చెన్నడు బీడి గుంజి అన్నడు.

చెన్నని మాట పూర్తి అయిందో లేదో పడిదలోడు బయిటికొచ్చిండు.

'ఎట్ల గెలుస్తర్రా. కరంటు అడిగితే కాల్సి సంపించె. ఉరి బోసుకొని రైతులు సస్తుంటె బలిసి సస్తుంర్రనే. సాలోల్లు మందు మింగి సస్తే పైసలాశకు అనె. అంత అన్యాయంగా మాట్లాడెటోడు మల్లొస్తె ఏమన్నుందా. జనం నిలువున సావరు. అయిన రాడుగాక రాడు' అని తొడగొట్టినంత పనిచేసిండు.

"అరే జనం ఏముందిరా. గొర్లమంద. ఎటు గాలి ఊగుతుందంటే అటె. మా నాయకున్ని అన్నలు సంపేటంత పనిచే సింగ్రు. అయ్యాల జనం... గుండెలు అవి సేటట్లు ఏడిసింర్రు. టీవీల చేతికి కట్టు కట్టుకొని అవస్తపడుకుంట మాట్లాడు తుంటె అయ్యో కొడకా అని శోకాలు పెట్టింర్రు. నువ్వెప్పుడు తక్కువ అంచనా యెయ్యకు. అభివృద్ధి వోట్ల కంటె సాను భూతి ఓట్లే గెలిపిస్తయ్' చెన్నడు బీడి గుప్ప గుప్ప గుంజిండు.

'నువ్వెన్నయినా చెప్పరా గెలవడుగాక గెలవడు' అన్నడు పడిదలోడు.

గురువయ్య ఇని ఇనీ నోరు తెర్సిండు. 'ఓరారి సపోటం పండ్లకోసం సన్నాసోల్ల కొట్లాటని ఎందుకురా ఈ లడాయి. ఆగరాదురి నాలుగొద్దులే గదా' అన్నడు.

ఆ యిద్దరు వాదన పెట్టుకుంటనే కలిసిపో యింర్రు. నారాయణ ఒక్కమాట మాట్లాడకుంట కూసునేసరికి గురువయ్య అన్నడు.

## మనిషి ఓ బిందువు!



ఓ సైన్స్ కాన్ఫరెన్సు లో ప్రఖ్యాత ఖగోళ శాస్త్రజ్ఞుడు మాట్లాడుతూ, 'ఖగోళ శాస్త్రవేత్తకు ఈ విశ్వంలో మనిషి అంతగా లెక్కకురాని ఒక చిన్న బిందువంతే!' అన్నాడు. దానికి ఐన్‌స్టీన్, 'అలాంటి బిందువయిన మనిషే ఒక ఖగోళశాస్త్రవేత్తగా కూడా ఉంటాడు' అన్నాడు.

'నీకు తెల్వదు ఊకో. ఆయన ఎన్నెన్ని పైసలు అమెరికోని దగ్గర అప్పు తెచ్చిండు. అదంతా మర్సిపోతారా అన్నడు బుర్కల చెన్నడు.

'ఆ ఆయిన ఏపాటి వొర్గబెట్టిండో మా నాయకుడు పాదయాత్రలల్ల యిప్పిచె ప్పిండు. జనం తుప్ప తుప్ప ఊసింర్రు. అమ్మో ఇంత దగా ఉందా దీనెనుక అని గుండెలు కొట్టుకుంర్రు. అంతా ఎర్కుండి జనం మల్లా తప్పు చేయరు.'

'చూసినవా చేసేది ఒదిలిపెట్టి. కొల్లగొట్టుక పోయినట్టు పని చేస్కోని బతికెటోల్లకు రాజకీయాలు. ఎవడొచ్చినా ఒరగబట్టేదేముంది. అయినా జనం ఊకోరు సూడు' అన్నడు.

నారాయణ మౌనంగా విన్నడు. రాజకీయాలంటెనే రోజు రోజుకు రోతపుడు తుంది. సానిదాని మాటల కంటె అన్యాయమైయిపోయినయ్ రాజకీయ నాయకుల మాటలు. అరి చేతుల సొర్గం సూపి స్తున్నరు. అప్పటికప్పుడు కడుపు నిండిన ట్టుగా మాట్లాడ్తరు. ఒకన్ని తీసి ఒకన్ని

పెట్టేది. అంతా ఒకటే జాతి. వాల్ల గురించి మాట్లాడుకోవడమంటె పెంటగడ్డల పెంకాసులు లెక్కపెట్టుటే కాదూ అనుకుండు నారాయణ.

ఇంగ అ ముచ్చట్లు మాట్లాడటం దండగ అనుకుండు గురవయ్య. 'ఎటూ ఉబుసుపోక ఇంట్ల పండీ పండీ పక్కలు నొస్తన్నయ్. జర బయిటికి ఎల్తెనన్న కాల్లు సల్లొదులుతయని ఇటొచ్చిన. ఎండ బలువైతుంది' అని చేతికర్ర సదురుకుండు.

లోపలి నుంచి గౌండ్లాయిన వొచ్చి 'అయ్యో అప్పుడే పోతున్నావె. ఇంతుకు ముందే తెచ్చిన తియ్యగ ఉంది. ఓ రేక పడుదువురా' అని పిలిసిండు.

నారాయణను చూసి 'నువ్వు కూడ రాయ్యి' అన్నడు. నారాయణ వొద్దన్నట్టుగా చేయి అడ్డం వూపిండు.

'ఒల్లు సుస్తుగుంది. వొద్దులేవయ్ మల్లె పుడన్న తాగుత గాని' అన్నడు గురువయ్య.

నారాయణ లేసి 'మరి నేనొస్త.. పనుంది' అని కదిలిండు.

గౌండ్లాయిన బతిమిలాడే సరికి కాదనలేకపోయిండు గురువయ్య. ఇంట్లె కల్ల పోయి కూసుండు.

గౌండ్ల ముసలాయిన ముంతల పట్టుకొచ్చి రేక చేతికిచ్చిండు.

గురువయ్య రొండు గుట్కలేసి సాలు అన్నట్టుగా తల ఆడించిండు.

'అయో పట్టయ్య అప్పుడేనా? ' అన్నడు గౌండ్లాయిన.

'సాలు సాలు' అన్నడు గురువయ్య.

'పిల్లల జాగ ఏమన్న తెల్సిందా' అన్నడు గురువయ్య.

గౌండ్లాయిన కండ్లల్లో ఒక్కసారిగా నీల్లు తిరిగినయ్. ఏం జాడ నాయినా. పోయిన్నాడే పోక, మల్ల వొచ్చిన్నాడే లెక్క. బిడ్డలు దేశాలు పట్టిరి. ఈ కరువుకు ఊల్లె బతికే యాల్ల లేదాయే. ఉన్న బొత్తలు

కొత్తగాలి...

**తెలుగుకు**
**ప్రాచీన హోదా**
**ఈ వెలుగు**
**ఆధునికం కదా**

*–డి.సంతోషి, బెంగళూరు*

కూడా ఒక్కొక్క బొట్టు రాల్సుతుండె. అయినా ఈ కరువు కాలానికి పైసలు పెట్టి కల్లుతాగే మారాజులేదుండ్రు' కండ్లొత్తుకుండు.

గౌండ్ల ముసలాయినకు ఇద్దరు కొడుకులు. పెండ్లిల్లు అయినయ్. రొండేండ్ల కింద దాంక ఊల్లె తాల్లు గీసిండ్రు. కాలాలు తలకిందులై ఊరిడ్సిండ్రు. మొగడు పెండ్లాలు సూరత్ బాట పట్టిండ్రు. యాడాదికి నాలుగైదు నెల్లు పని దొరుకుద్దంట ఆడ. మల్ల ఊల్లెకొచ్చి ఈగలు కొట్టుకొనుడే.

ఎర్రగూడాన ఈ ఒక్క కుటుంబమే కాదు. ఐదు కుటుంబాల గౌండ్లోల్లు అదే బాట పట్టిండ్రు. ముసలోల్లు అంతింత ఆదాయం ఉన్నోల్లు ఊల్లె ఉండ్రు. పొద్దున పొద్దూకంతల ఘల్లుఘల్లుమనే ముస్తాదులు కొట్టాల దులాల మీద యాలాడుతున్నయ్.

ఊర్లల్ల కూడ సర్కారు సీసాలు వొస్తుండె. ఆ గింత గూడెనా పదిమంది ఆసర బేరగాండ్లాయే. ఆల్ల పొట్ట తిప్పలు ఆల్లది. ఊల్లె రేషన్ షాపు లేకున్నా మందు దుకాణాలకు మాత్రం సావులేదు.

గౌండ్ల ముసలాయిన కండ్లొత్తుకుంటుంటే 'ఆ వాస్తరులె ఏన్నయితే ఏముంది బతికితందుకు. అందురు పోత లేరా' అన్నడు గురువయ్య. ఆ మాటలో

## కొత్తగాలి...



**అవమానాల భారం**
**అనుభవాల సారం**
**అందుకే కవితల్లో**
**మానవీయ కోణం**

—వై.కె.మూర్తి, విజయవాడ

బలం లేదని తెలుసుకొని ఏదో ఓదార్పుగా అన్నడు.

గౌండ్లాయిన మల్ల ముంతపట్టి ఒంచబోయిండు. గురువయ్య ససేమిరా అన్నడు. ఏదో నువ్వన్నవని ముర్క చూసిన అని చేతికఱ్ఱ దాపున లేసిండు.

గురువయ్య ఒక్కొక్క అడుగు ఏసుకుంట కదులుతుంటే గౌండ్ల ముసలాయిన కండ్లలో కొడుకులు మెదిలిండ్రు. దేశం గాని దేశం. బిడ్డలెట్టుండ్రో ఏమో అనుకుండు.

★ ★ ★

నారాయణ బోరుకాడికి వొచ్చిండు. స్టాటరు పెట్టె దుమ్ముపట్టి ఉంది. పై తువ్వాలు తీసుకొని ఇసిరిండు. దుమ్ము కాస్త ఎగిరిపోయింది. పెట్టె తెర్సి కట్క మేసిండు. బుగ్గ ఎల్గింది. కరంటయితే ఉంది అనుకుండు. కట్కేసిండు. మోటరు చాలయింది. బఱ్ఱు బఱ్ఱుమని వొట్టిదేసప్పుడు. వెంటనే కట్క బందుజేసిండు. జఱ్ఱసేపయినంక మల్లేసిండు. మల్లా అంతే. చానా రోజులయ్యింది గదా పెట్టక అనుకుండు. నాలుగు బిందెల నీల్లు పైపుల పోస్తెనన్న బావుండు. ఓ బిందెన్న పట్కరానైతి కమ్మర్తిపాడుగాను అనుకుండు. అంతల్లనే బొఱ్ఱెంకయ్య బోరుకాడ ఉంటదిలే అనుకొని అటురోకు పోయిండు.

బొఱ్ఱెంకయ్య బత్తాయి తోట గాబట్టి ఎండాకాలమైనా బోర్లు పోస్తయి. దినాం జీతగాండ్లు తడి కడ్తనే ఉంటరు. మొన్న మొన్న ఓ బోరు ఇబ్బంది పెట్టినా మల్ల ఏపిచ్చిండు. అది బానే పోస్తుంది. నాలుగడుగులేసేసరికి బొఱ్ఱెంకయ్య బోరుపోసేది కనిపించింది. జీతగాండ్లు ఎవరు కనిపిస్తలేరు. తోటల యాన్నో నీల్లు కట్టుకుంట ఉండి ఉంటరు అనుకుండు. అటిటు చూసి గుడిసెల ఉన్న బిందె అందుకుండు. నాలుగు బిందెలనీల్లు మోసిండు. నారాయణ ఇంగ ఆన్ జేద్దాం అని కట్కేసిండు. అయినా మోటరు తిరుగుతుంది. గాని నీల్లు అందుకుంటలేదు. మల్లా బిందెపట్టుకొని మోసిండు. ఆ యెత్తున బలువుగ ఎండ అయిందాంక మోసిండు. అయినా మోటరు పోయలే. నారాయణకు సల్లజెమటలు పట్టినయ్.

మోటరేమన్న పనిపెట్టిందేమో అనుకుండు. శివాంట మోటరు చాలుచేద్దామంటే అది అపశకునమైపాయె గదా అని బాధపడ్డాడు. అల్సిపోయి ఇంటి బాట పట్టిండు.

భర్త దిగులుగా కూసునేసరికి కమలమ్మ అడిగింది 'ఏందయ్య అట్లున్నవ్' అని.

నారాయణ నవ్వే ప్రయత్నం చేసిండు. 'ఆ ఏం లేదు. ఎండకాలం బోరు పెట్టమైతిమి. మరి వాచరు పాడయిందో, పైపులేమన్న లీకాయనో పొయ్యలేదు. నీల్లు మోసి జర అలిపిరి వొచ్చినట్టుంది అంతె' అన్నడు.

'అయ్యా రామా! అంతేనా నువ్వట్ల గూడుకట్టుకొని కూసొనేసరికి బోరేమన్న పనిపెట్టెనా అని గుండె గుభిల్లుమనె' అన్నది కమలమ్మ.

'ఎండ కాలమైనా అట్లెపుడు కాలేదుగా నాయినా' అన్నడు శీను.

'నీకన్నీ అనుమానాలే. అప్పుడు కాలేదని ఇప్పుడు కాకుంట ఉంటదా. నీ తెలివి కాకుంటే' కసిరింది కమలమ్మ.

శీను తలగోక్కుంట తండ్రి పక్కన కూసుండు. 'మరెట్ల నాయినా, చారికి సూపిద్దామా' అడిగిండు తండ్రిని.

'ఆ సూపియ్యాలె. ఆయిన ఉండో, ఏ పెండ్లికన్న పోయిండో' అన్నడు నారాయణ.

'ఆ ఆ ఉన్నడు ఇంతకు ముందే కోంటోల్లింటి కాడ కోడిగుడ్లు తీస్కపోతుంటే చూసిన' అన్నది కమలమ్మ.

నారాయణ మొకంలో అదే దిగులు.

'ఏందయా కొంపలు మునిగిపోయినట్టు అట్ట మొకం పెడ్తవ్. ఆ చారిని తీసుకొస్తే ఆయినే సూస్తడు' అన్నది.

నారాయణకు ఆ మాటతో ధైర్యం రాలే.

'గిన్ని మంచినీల్లు అందుకో' నారాయణ అన్నడు.

'అయ్యో నా మతిమరుపు మండ. ఎండల పడి వొచ్చినోనికి మంచినీల్లు ఇయ్యాలని కూడ మర్సిపోతి' అని గిరక్కున వంటింట్లకు పోయింది.

భర్తకు మంచి నీల్లు ఇచ్చి , 'ఒరే శీను ఆచారి ఏడుండో పట్టుకో. ఎండ సల్లబడ్డంక పోయొద్దురు' అన్నది కమలమ్మ.

శీను లేసిండు.

'తింటవా.. జరాగుతవాయా? ' అడిగింది కమలమ్మ.

నారాయణకు తిండి మీద ద్యాసలేదు. పైకి మాట్లాడుతున్నా గుండెల్లో గుబులుగా ఉంది. ఏమన్న అయితే... ఆలోచించలేకపోయిండు. రోజు ఇంటున్న రైతుల ఆత్మహత్యలు యాదికొచ్చినయ్.

కమలమ్మ పైకి ఉషారుగ మాట్లాడుతున్నా గుండె కలుక్కుమంటనే ఉంది. అయినా అది బయటపడితే నారాయణ అయింత గుండె బలుగుతడని ఊకుంది. నారాయణకు అప్పులు యాదికొచ్చినయ్. కన్నమ్మ కష్టాలు పడితే పంట పంతుంది. అయినా దాని దారిన అదిపోతుంది. ఆయాసం తప్ప మిగిలేది ఏమీలేదు. బోరేసుకుంటే చెయ్యితిరుగుతది అనుకుండు. అదంతా ఉట్టిదే అయ్యింది. రోజు రోజుకు పెరుగుతున్న మిత్తీలు. కునుకులేకుంట అయితుంది. బొర్రెంకయ్య కాడ బోరుకు తెచ్చిన పైసలు అట్లనే ఉన్నయి. మధ్యానో సారి మిత్తి మందం ఇయ్యబోయినా.

'ఎందుకు నారాయణ కష్టపడతవ్. ఏడికి పోతున్నయ్ నీకాడ ఉంటే. చిల్లరమల్లరోల్లకు ఇచ్చుకో తల్కాయ నొప్పి పోతది. ఉన్నపుడే ఇద్దువులే రాదు' అన్నడు.

బొర్రెంకయ్య మాటతో ఆ పైసలు సైదులుకు కట్టిండు. దీనెమ్మ లెక్క పాడుగాను, ఎంతిచ్చినా మిత్తేమింగుతుంది. అసలు అట్లనే ఉంటుంది. ఎన్నటికి ఈ రుణాల నుంచి బయట పడ్తనో ఏమో. నారాయణ మంచంల వొరిగినా ఆలోచనలు ఈగలోలిగ ముసురుతున్నయ్. మెకానిక్ చారి కోసం పోయిన శీను వొచ్చిండు. కమలమ్మ ఎదురుబోయి 'ఉండా కొడకా' అన్నది.

'ఆ ఉండు. ఎండ సల్లబడ్డంక సుద్దాంలే పనిమీద ఉన్న అన్నడు' శీను చెప్పిండు.

'ఏం పని ఆని బొందపని' కమలమ్మ నవ్వు మొకంతో అన్నది చారి పనేందో తెలుసు అన్నట్టుగా.

శీను నవ్విండు. 'ఇపుడే ఓ పొంగులొట్టి తెచ్చుకుండు. ఆమ్లెట్టు ముందలేసుకొని కూసుండు' అన్నడు.

'ఉట్టి తాగుబోతోడు. ఒచ్చిన పైస వొచ్చినట్టే ఆ గౌండ్లోల్లకు పోస్తడు. ఎట్ట బతుకుతడో ఏమో' కమలమ్మ అని ఇంట్లకు పోయింది.

నారాయణ లేసి కూసొని 'ఇంత పెట్టమ్మ' అన్నడు.

కమలమ్మ కంచాలు పట్టుకొచ్చింది. 'శీను నువ్వుగూడ తినురా మీ నాయినతో







పాటు' అన్నది.

నారాయణ తినుకుంట 'ఆ చారి ఇపుడు కూసుండంటే లేవడు. పండిలేసే సరికి పొద్దాకుతది. రేపు పొద్దున్నే తీస్క పోదాం' అన్నడు.

'అట్లనేగని. అటెల్లినపుడు ఓ మాట చెప్పు. పొద్దుగల్ల లేసి ఎటన్న పోగల్ల. ముందే ఆయిన కాలు ఓకాడ నిల్వదు' అన్నది కమలమ్మ అన్నం ఒడ్డించుకుంట.

తెల్లారి పొద్దున్నే పక్కమీద నుంచి లేసుడు లేసుడు చారి దగ్గరికి పోయిండు. చారి అప్పుడే లేసి కండ్లు నల్సుకుం టుండు.

'చారీ ఆ బోరు సంగతేందో చూసొద్దు పురా ఓసారీ' అన్నడు నారాయణ.

'ఆగరాదు బావా. మరి ఇంత పొద్దుగల్ల చాయిబొట్టన్న తాగకముందే' గులిగిండు చారి. నారాయణ ఏదో అనబోయిండుగాని మల్ల గొంతుల్నే మింగిండు.

'ఏమయ్యిందో ఏం సంగతో మరి. నిన్న శీను వొచ్చి చెప్పేదాన్ని బట్టి పైపులేమన్న లీకయినేమో. ఓ ఇద్దరు మనుషుల కూడ చూడు బావా' అన్నడు చారి.

'సరే నువ్వు తయారుగా, నేనిప్పుడే వస్త' అని ఇంటికొచ్చిండు. వొస్త వొస్త ఓ ఇద్దరు మనుషుల కల్సి 'జరయినంక అటు మా బోరుకల్ల రావాయ్. జర ఆసర్లైదువు'అన్న డు సంగతి చెప్పి. ఆల్లు తలలూపింర్రు.

'శీను నువ్వు అటురా. మనిషికి మనిషి దాపు. నేను ఆ చారిని తీసుకొని వస్త' అని వాకిట్ల నుంచి అటే ఎన్కకు మల్లిండు. శీను గబగబ మొకం కడుక్కొని బాయికల్ల పోయిండు.

నారాయణ మనసు మనసుల లేదు. తెల్లవార్లు ఒకటే పీడకలలు. దిగ్గున లేసి కూసుండు. నిద్రరాక బీడి ముట్టించిండు.

'మధ్యనోసారి కమలమ్మ లేసి 'ఏందయా నడిజాంకాడ. పండుకోక' అన్నది. ఆమెకూ నిద్రపట్టకనే లేసింది.

చారి ముడ్డెనుకంబడి తీసుకొని బోరుకా డికి పోయిండు. కట్కా ఏసుడు. బందుజే సుడు. అరగంటదాంక ప్రతయ్నం చేసిండు చారి.

'బావా పైపులే దెబ్బతిన్నట్టుంది. ఊడ బీకి సూద్దాం' అన్నడు.

చారి మనసులో నీల్లు లేవా ఏంది అన్న అనుమానం కూడా ఉంది. ఆ మాట బైటి కంటె నారాయణ గుండె బలిగిసస్తడని ఊకుండు. కరంటు వైరు తీసేసి పైపులు ఊడబీకిండు చారి.

'ఏది బావా ఎవలు రాలైరి. ఎవరికన్న చెప్పినవా రమ్మని' అన్నడు చారి.

'ఆ చెప్పినవాయ్... అగో ఆడొంకల వొస్తున్నట్టుంది సూడు' అన్నడు.

చారి బీడిముట్టించుకొని ఆలోచిస్తున్న ట్టుగా బోరుకట్ల చూసిండు. ఇంతల్ల ఇద్దరు మనుషులొచ్చింర్రు.

పైపులు గుంజింర్రు. చారి అంగుళం అంగుళం పశానతుగ చూసిండు. మోటరు ఆన్‌చేసి చూస్తే బానే ఉంది. అనుమాన మొచ్చిన కాన్నల్ల చూసిండు.

'అంతబానే ఉంది బావా. పైపులల్ల ఏమన్న ఇరికిందెమో చూద్దాం' అని చూసిండు.

'ఏం లేదు. బిగిద్దాం' అన్నడు.

మల్ల బిగిచ్చింర్రు.

చారి ఆన్ చేసిండు.. ఆన్‌చేసిండు.. బలుపుగ ఎండయిదాంక పోరాడిండు.

నారాయణకు సల్లజెమటలు పడుతు న్నయ్. కాల్లు జేతులు కడుపుల బడ్డయ్. మనసు కీడు శంకిస్తుంది. చారీ బీడి తాగుకుంట ఎటో చూస్తుండు. శీనుకు దుక్కం తన్నుకొస్తుంది.

'ఏందివాయ్ ఏదో దాస్తున్నట్టుంది. పైపులు బానే ఉన్నయంటవ్. మోటరు బానే ఉందంటవు. నట్టుబోల్టులన్ని ఊడ బీకి చూస్తివి. ఏడ ఉంది మరి తేడా?'

అన్నడు.

చారి తలాడించిండు. మాట పైకి అంట లేదు.

'నీకేమన్న అర్థమైందా. అట్ల తలాడిస్తు న్నవ్. ఇంకో మెకానికునన్న పిల్సుదామా' అన్నడు నారాయణ.

చారి గొంతు పెగిలించుకొని 'ఉట్టిబో యిన బర్రెను పిండితె పాలొస్తయా బావా' అన్నడు. నారాయణకు తలగిర్రున తిరి గింది.

★ ★ ★

భర్త నోటినుంచి సంగతి తెలుసుకున్న కమలమ్మ బోరున ఏడ్సింది. ఆకాశం అది రేటట్టు శోకాలు పెట్టింది. భూమి ఆకా సాలు ఒకటయ్యేటట్టు కన్నీళ్లు కార్సింది. కడుపు తరుక్కుపోయేటట్టు గుండెలు బాదుకుంది.

ఓరి భగవంతుడా ఎన్ని కష్టాలు పెడితి విరా అని శాపనార్థాలు పెట్టింది. పిల్లల గుండెల కదుముకొని తీరొక్క తీరు రాగం తీసింది. తిండి తిప్పలు మర్సింది. ఏడ్సీ ఏడ్సీ కంటి ధారలు ఎండిపోయినయ్.

నారాయణ ఆకాశం కూలి మీదబడ్డట్టు తలపట్టుకొని కూసుండు. పిల్లలు అల్లాడి పోతుండ్రు. అయ్యాల సొంతం ఇంట్లెపీ నిగె లేసిన వాతావరణం.

పిల్లలు కూడునీల్లకు ఎడబాసిండ్రు. సూర్యుడు సూడలేక పడమటి కొండసా టున ముకం దాసుకుండు. పొద్దున్నించి కమలమ్మ శోకాలు ఇంటున్న బుచ్చమ్మవ్వ వొచ్చింది.

కమలమ్మ భుజం మీద చెయ్యేసి 'ఏందే అట్ల. సంసారమన్నంక కష్టాలుంటయ్. కష్టాలు మనిషికి రాకుంటె గొడ్డుకొస్తాయే' అని ఓదార్పు మాటలన్నది.

బుచ్చమ్మవ్వ కమలమ్మోల్ల ఇల్లుకాక అవుతలింట్ల ఉంటది. బచ్చమ్మవ్వకు కాల్లు జేతులు కదలక యాడికిపోదు. కర్రపట్టు కొని ఇడుపుల పొంటి కదలాడ్తది. కమల

కొత్తగాలి...

**డబ్బున్నంత వరకూ**
**నోరొక మిల్లు!**
**జబ్బులొచ్చేక**
**నోట్లోకి నిల్లు!!**

*యం.యస్.చంద్రిక, జట్నీ(ఒరిస్సా)*

మ్మోల్లకు బోరుపడ్డనాడు గెంటుకుంట గెంటుకుంట ఒచ్చి 'ఏమే పిల్లా కమలమ్మ నీ దెశ తిరిగింది బిడ్డా' అని పలకరిం చింది. ఏ ఎండకాలమో పుటుక్కున రాలి పోతది అన్నట్టుగా ఉంటది.

బుచ్చమ్మవ్వ పలకరింపుకు కమలమ్మ శోకం పెంచింది.

'ఎట్ల బత్తం, అత్తా, ఇన్నిన్ని అప్పు లాయే. ఏసిన బోరు ఆగమాయే. కండ్ల ముంగల పిల్లలు ఎదిగి వొస్తుండ్రు. ఏం జూసుకొని బతకాలె అత్తా' అని మల్లా శోకాలు అందుకుంది.

బుచ్చమ్మవ్వ ఓపికగ ఆ మాట ఈ మాట చెప్పి ఓదార్చింది. కమలమ్మ కూడా అలిసిపోయి ఆగింది.

'లే బిడ్డ! పిల్లలకు ఇంతపెట్టు. వాల్లు పొద్దున్నుంచి గుండెబలిగినట్టయ్యిండ్రు' అన్నది బుచ్చమ్మవ్వ.

కమలమ్మ మనసురాయి చేసుకొని లేసింది. తను ఇట్లనే ఉంటె ఆయన అయింత అదరుకుంటడు అనుకుంది. మొకం కడుక్కొని పిల్లలకు అన్నాలు పెట్టింది.

కమలమ్మ తేరుకుంది.

'కష్టం వొచ్చిందని ఏడిస్తె పోతదా బిడ్డా. ఈ తోవకాకుంటె ఇంకోటి' అను కుంట బుచ్చమ్మ పోయింది.

కమలమ్మకు ఆ మాటల్లో ఏదో కనిపిం







చింది. ఏదో ఆశ. ధైర్యమొచ్చింది. ఏదో తెగింపు చేసుకోవాలె అనుకుంది. పిల్లలు తిన్నంక భర్తకు అన్నం పెట్టి తానూ కూసుంది.

'ఏవయా బోరు పొయ్యింది కాని బతుకుపోయిందా. నేనంటే ఆడి మనిషిని. అల్లల్లా అంట. నీకేంది? మొగోనివి ధైర్యం చెప్పొద్దా' అన్నది. కమలమ్మ మనసులో ఏదో పెట్టుకొని ఇట్ల మాట్లాడుతుందని నారాయణకు అర్థమైంది. కమలమ్మే మల్లా అన్నది.

'అప్పుల అప్పు. నడుంగలకొచ్చినంక అటు పోయినా అంతే, ఇటుపోయినా అంతే. మోటుతోపుజేద్దాం. ఈసారి నువ్వు తీర్సేది. మరి నీల్లు లేకుంటె ఎట్ల తీరుస్తం. నామాటిను. ధైర్యం తెచ్చుకో' అన్నది కమలమ్మ.

నారాయణకు అంతకంటె దిక్కుతోస లేదు. అయింత యవుసాయం మూలకేసి కూసోలేడు. ధైర్యం తెచ్చుకుండు. కాని మాటబైటికి అనలేకపోయిండు.

'ఎందుకయా తటపటాయిస్తవ్. ఈసారి బోరు బడకుంటె ఎట్లనా, తప్పకుంట పడతది. ఎంతమంది ఎయ్యలేదు. ఎంతమందికి పడలేదు. మొన్నటికి మొన్న బొ్రంకయ్య పోయిన బోరు పక్కన్నే ఏస్తే పడలే. మనము అట్లనే ఏద్దాం. ఆ పుట్టగడ్డకే ఇటురోకు ఏద్దాం. పడ్తది, నువ్వు ఆలోచించకు" అన్నది.

## దానికెందుకంత ప్రాధాన్యం?

ఐన్‌స్టీన్‌ను మిత్రుడొకడు అతడి టెలిఫోన్ నెంబర్ చెప్పమని అడిగాడు. దానికతడు డైరీని చూసి తన ఫోన్ నెంబరు చెప్పాడు. దీంతో ఆ మిత్రుడు, 'మీ నెంబరు సైతం మీకు గుర్తులేదా?' అన్నాడు ఆశ్చర్యపోతూ.



'పుస్తకంలో సులువుగా దొరికేదాన్ని నేనెందుకు గుర్తుంచుకోవాలి?' అని ప్రశ్నించాడు ఐన్‌స్టీన్.

నారాయణ సరే అని లేసిండు. మొగడు పెండ్లాలు ఒక నిర్ణయాని కొచ్చినంక నిమ్మలపడ్డరు. మొండి ధైర్యం చేసుకుండ్రు.

'పొద్దున్నేపోయి బొ్రంకయ్యనడుగు. ఆయనకు తెల్వంది ఏముంది. నమ్ముతడులే' అన్నది కమలమ్మ. ఎప్పుడు తెల్లార్తదా అనుకుంట పండుకుండు నారాయణ.

★ ★ ★

పొద్దున్నే పోయి అడిగిండు నారాయణ. మొదట జర ఆలోచించిండు బొ్రంకయ్య. నారాయణ చెప్పేది విన్నంక మెత్తపడ్డడు. పక్కగెట్లోడు యాడికిపోతడులే అనుకుండు. బాదల్ల ఉన్నోన్ని మరి బాధపెట్టొద్దులే అనుకొని ఎప్పుడు కావలె అన్నడు.

'రేపే బోరుబండికి పోత మాటిస్తే' అన్నడు.

'ఓ పని చెయ్యి. నువ్వు నల్లగొండకు పోయి బొ్రంకయ్యను పైసలడుగు. ఎందుకో నాకు ఆయన కాదనడనిపిస్తుంది. ఒకవేళ కాదంటే సూద్దాంగని' కమలమ్మ ధైర్యం చేసుకొని చెప్పింది.

నారాయణ అప్పులెక్కలన్ని చెప్పిండు. 'ఇంత పెట్టుకొని మల్లతెద్దామా?' అన్నడు.

'ఈ అప్పయినా ఇంత పంతెనెగా

పోయేటప్పుడు నాకు చెప్పు. నేను వస్త. ఆడ్నే బాంకుల తీసిస్త' అన్నడు.

నారాయణ పానం లేసొచ్చినట్టయింది. బొర్రెంకయ్యకు మనసులోనే రొండుచేతుల దండం పెట్టిండు.

అనుకున్నట్టే తెల్లారి నల్లగొండకు పోయింర్రు. వెంట ఉండి బోరు బండి పట్టుకొచ్చిండు. ఆమాపే పుట్టగడ్డకు అటు రోకు ఏపిచ్చిండు. నరాలు చిట్లిపోయే టెన్షన్‌తో ఎదురుచూస్తున్న నారాయణకు నీళ్ల ధార చూసి ప్రాణం వచ్చింది. రొండొందల ఫీట్ల కింద మంచి జలదగిలింది. పానం నిమ్మలపడ్డది.

పాతప్పు, మిత్తి, కొత్తప్పు అంత ముద్ద జేసి కాయితం రాసిచ్చిండు బొర్రెంకయ్యకు.

"నిమ్మలంగ చేసుకొని బతుకుపో" అన్నడు బొర్రెంకయ్య.

నారాయణ మోటారు బిగిచ్చి మడి తడిపిండు.

★ ★ ★

నాట్లు పడ్డయ్. జనానికి చేతినిండ పని లేకుంట అయ్యింది. నారాయణ ఊల్లెకల్ల యెల్లిండు. పొద్దు పొద్దూకంతల సాంబయ్య హడావుడిగా తిరుగుతుండు.

ఓ ఇంటి ముందు నిలబడి 'ఓరారి ఉన్నావురా.. నువీన్నె ఉంటే ఆడ నీ మొగుడు కారం నూర్తడు' అంటుండు.

ఇంట్ల నుంచి ఓ పిలగాడు 'ఆగే వొస్తున్న' అనుకుంటు వొచ్చిండు.

సాంబయ్య ఆ పిలగానితో 'పో పో ఆల్లకు చెప్పి బడికాడికి రమ్మను. ఆటో చెప్పిన. అందరం ఒకేసారి పోదాం' అన్నడు. ఆ పిలగాడు హడావుడిగా పోయిండు.

నారాయణ అడిగిండు. 'యాడికిరా సాంబ మల్ల ఆడికేనా' అని

'ఏం జేయమంటరయ్య. అన్నలు కేకేస్తే సాలు. ఈల్లు మమ్ముల పట్టుకుంటరు. ఆ పొద్దునుంచి ఈ పొద్దు వరకు ఓ బందన్నా మేమెపోవాలె. ఆల్లు ఎవన్ని సంపినా మేమె పోవాలె. ఆడుకుంటుంర్రనుకో' అన్నడు.

'ఇప్పుడేందంట' నారాయణ అడిగిండు

'అన్నల బందంట రేపు. మస్కూరోనికి చెప్పి పంపింర్రు. మూడు రోజులపాటు ఎమ్మార్వో ఆఫీసు, ఎమ్డీవో ఆఫీసు, బేంకు, బస్టాండు... అన్ని సర్కారు బవంతుల్ల కావలి పండాలె. ఇయ్యాల కొత్తనా, ఎవడన్న పోకుంటె తెల్లారి పిలిపిచ్చి చమడాలు తీస్తుంర్డి. లంజాకొడక నువ్వు అల్లతోపాటు పోయినావురా. ఎన్‌కౌంటర్ చేస్తనా కొడుకా' అంటుండె అమీను సాబు. ఇంగ పోక సస్తమా' అనుకుంట పోయిండు సాంబయ్య.

పాత సర్కారు ఉన్నప్పుడు మొదలయింది ఈ తంతు. సర్కారు మారినా వీల్లను పిల్సుడు మాత్రం మారలేదు. ఏ సర్కారు వొచ్చినా ఏది మార్తలేదు అనుకుంట నారాయణ దాటికల్ల పోయిండు. దాటికాడ జోరుగ చర్చనడుస్తుంది.

'చూసినవా ఈ సర్కారుకు రైతులమీద ఎంత ప్రేమో, మేఘమధనాలు చేపిస్తుంది' అన్నరెవరో.

'ఏ మథనం రా. నీ బొంద బోకి, కొండను తవ్వి ఎలకను పట్టినట్టు. దాని కంటె రైతులకు తలా వో అరబస్త బియ్య మిచ్చినా నెల్లాల్లు తిని బతుకుతరు. నడుం గల పెద్ద పెద్దోలు మింగెతందుకేగని ఏవన్న ఉన్నాదిర, తూ' అనుకుంట యెల్లిపోయిండు ముసలి రైతు.

'ఎంతయినా ఈ సర్కారు నయమే. నీళ్ల గురించి బానే ఆలోచన చేస్తుంది. ముఖ్యమంత్రి అయితే ఎన్ని ప్రాజెక్టులకు కొబ్బరి కాయలు కొట్టిండు. అయన్నీగనక అయితె అసలు మన రాష్ట్రంల రైతులంత కార్లల్ల







తిరుగరూ' మొదటి గొంతే అతి విశ్వాసంతో అంటుండు.

'హారేయ్ కలలు బానే ఉన్నయ్ గని అసలు సంగతి తెల్సా. ఇయ్యాల ఈ ముఖ్యమంత్రి కొబ్బరికాయలు కొట్టినా అది తెల్లోని హుకుమే. ముందుబాట లేయమన్నడు. ఆయినేసిండు. తర్వాత ప్రాజెక్టులు కట్టమన్నడు. ఈయన కడుతుండు. ఆయిన పథకాలనే ఈయన పేర్లు మార్చి ప్రచారం చేస్తుండు. అసలు పథకాలంటె తెల్లోనియి. దేశం మొత్తంల ఉన్నయి. ఒక్క మన దగ్గర కాదు. ఇంకో సంగతి తెలుసా రేపు ఈయన ఆయన కాకుంట మూడో పార్టీ ఆయిన ముఖ్యమంత్రి అయినా తెల్లదొరమాట కాదనలేడు.

మూడో పాయింటు ఏందోతెలుసా. ఇంకో అయిదారేండ్లల్లో మన రైతులకు తెల్లదొరలు యవుసాయం ఎట్లచేయల్నో చెపుతరు. మండె ఎట్లకట్టాలె. గొడ్లపేడ ఏస్తే ఎంతమేలు అని టైలు, బూట్లేసుకొని గోసిగుడ్డల మన రైతులకు పాఠాలు చెపుతరు. మండె ఎట్ల కట్ల కట్టాలె. కరంటు మిషిన్లల కడ్తె మొల్క ఎట్ల ఎదిగి ఎంత దిగుబడి పెరుగుతది. ఒక మడికి ఎన్ని ఔన్సుల నీల్లు కట్టాలె. ఇట్టాంటి లెక్కలన్నీ పూసగుచ్చినట్టు చెపుతరు. నేను చూస్తనో చూడనోగని మీరంత చూస్తరు గ్యారంటు' గురువయ్య ఆవేశంగా చెప్పిండు. మధ్య మధ్య దగ్గు వొస్తున్నా ఆపుకొని మరీ చెప్పిండు. రైతులు నోరెల్లపెట్టి ఇంటుండ్రు.

గురవయ్య చివరగా ఇంకో మాటన్నడు. సర్కారు గద్దెల మీద మనుషులు కూసుంటెనే ఈ అభివృద్ధి జరుగుతుంది అనుకుంటె పొరపాటే. ఏ కుక్కను కూసబెట్టినా ఇదే జరుగుతుంది. దీంట్లె అక్షరం కూడా పొల్లుపోదు.

గురువయ్య గొంతులో ఆక్రోశం, గుక్కమల్పుకుంట మాట్లాడేసరికి దమ్ము తన్నుకొచ్చింది. ఆయస పడుకుంట దగ్గుతుండు. రైతులు గురువయ్య మాటలకు నోరెల్లబెట్టిండ్రు.

★ ★ ★

ఆదివారం సుదర్శన్ ఇంటికొచ్చిండు. ఆర్నెల్లు ఆయె నల్లగొండల బట్టల దుకాణంల గుమస్తాగా కుదిరి. మగ్గం దాదాపు మూలకు పడ్డది. తండ్రి సొంతం ఎత్తు పడ్డడు. తల్లి గుండెబలిగింది. కూటికి సచ్చేయాల్ల, లాభం లేదని గుమస్తాగా కుదిరిండు.

కలవక చాలా రోజులాయె గదా అని శీను ఇంటికొచ్చిండు సుదర్శన్. శీను రొట్టె తింటోడు సుదర్శన్‌ను చూసి గంతేసిండు.

'అమా సుదర్శన్ ఒచ్చిండు, సూడు' అని కేకేసిండు.

కమలమ్మ 'ఎప్పుడొచ్చినవ్ కొడకా?' పలకరించింది.

సుదర్శన్ 'పొద్దునే శిన్నమా' అని, శీను పక్కన మంచంమీద కూసుండు.

కమలమ్మ రొట్టె తెచ్చి తిను కొడకా అని చేతుల పెట్టింది. 'నాయిన బావుండా కొడక. ఈ నడుమ ఆ సందుకు పోక శానారోజులాయే' అన్నది కమలమ్మ.

'ఆ బాగుండు శిన్నమా', సుదర్శన్ రొట్టె తింటు అన్నడు.

కమలమ్మ వంటింట్ల కల్లపోయింది.

దోస్తులు రొట్టెలు తినుకుంట మాటల్ల పడ్డరు.

'ఆ నడుమ ఒకటి రొండుసార్లొచ్చిన. నల్లగొండకు పోయిండు నాయినా- అన్నడు కక్కయ్య. ఏందబ్బా. ఎన్నడు లేంది సుదర్శన్ ఒకటె నల్లగొండ తిరుగుతుండు అనుకున్న. నువ్వు చెప్పిందాంక నేను ఊహించలే' శీను అన్నడు.

'ఏం చెయ్యాలె శీను. మగ్గం పని నడస్త

లేదు. ఒకరోజు నడిస్తే నాలుగొద్దులు ఉట్టిగనే కూసునుడు. ముగ్గురు మనుషులం. తిండి ఎట్లొస్తది చెప్పు. ఎంతకాలం చూసినా పరిస్థితి దిగజారుతుంది తప్ప మెరుగులేదు. నేనే తెగింపు చేసుకొనిపోయిన. నాయిన అస్సలు ఒద్దంటే వొద్దన్నడు. కాని నేనే ఇనలే. బట్టల దుకాణంల గుమస్తాగా చేరిన' సుదర్శన్ గుండెల్లో బాధ. పైకి మామూలుగ చెపుతున్నట్టు ఉన్నా ఏదో దుక్కం.

'ఒక మా పరిస్థితే కాదు శీను అంతటా అట్టనేఉంది. ఆత్మహత్యలు చూస్తున్నవ్‌గా, చేనేత కార్మికుని ఆత్మహత్య లేని రోజు లేదు. పుట్ట పుట్ట రాలిపోతుండ్రు.'

'సమస్యలుంటయి సరే ఆత్మహత్య చేసుకోవడమెందుకు? అది పరిష్కారం కాదు కదా' శీను బాధగా అన్నడు.

'కడుపు ఆకలి తీరికగా ఆలోచించనీయదు శీను. అది పరిష్కారం కాకపోవచ్చు. కాని అంతకంటె దారికనపడ్తలేదు. కనీసం నేనున్న అనే ధైర్యం చెప్పేవాళ్లు లేరు. సొంతం గుండెధైర్యం చెడ్డరు. మా నాయిన కూడా ఏమాపో నూలు దారానికి ఉరేసుకుంటడు అనిపించింది. ఆయనకే కాదు నాకు అనిపించింది. నేను నీ వోలిగనే ఆలోచించిన. ఈ దారి వెతుక్కున్న. ఇది శాశ్వతము అని కాదు. జీవిగంజి. కనీసం సావును నాలుగొద్దులు పొడిగించుకోవడానికి' సుదర్శన్ కదిలిపోతుండు.

కండ్లలో నీల్లు తిర్గుతున్నయ్. ఓడిపోతూ గెలుస్తున్న వానోలిగ. గెలుస్తు ఓడిపోతున్న మనిషోలిగ అనిపించిండు.

'వేరే పనిలోకి వెళ్లలేరా? సుదర్శన్ మగ్గాలు నడవకున్నా అట్లనే పట్టుకొని ఉండటం...' శీను మాట పూర్తికాలేదు.

సుదర్శన్ అందుకుండు. 'తరతరాలుగా నీడపట్టున పనిచేసిన జాతి. ఒకసారిగా చేతులిరిగే సరికి తట్టుకోలేకపోతుంది. అయినా ఈ పనికి అలవాటుపడి ఇంకో పని చేయలేకపోతుండ్రు. వాళ్ళ శరీరాలు కూడ అందుకు సహకరించవు. అట్లాంటి పరిస్థితుల్లో ఎటూ తోయక సావుగురించి ఆలోచిస్తుండ్రు' సుదర్శన్ భారంగా అన్నడు.

శీను విషయం మార్చిండు. ఏదో పలకరిద్దామని వొచ్చిన సుదర్శన్‌తోని ఏదేదో మాట్లాడిస్తున్న అనుకుండు.

'ఉంటున్నవా రొండురోజులు' అడిగిండు శీను.

'అహ లేదు. ఇయ్యాల ఆదివారమని వొచ్చిన. రేపు పొద్దున్నే పోత' అన్నడు సుదర్శన్.

కాసేపు మాట్లాడుకున్నంక ఎల్లిపోయిండు సుదర్శన్.




కమలమ్మకు బిడ్డలు ఎదుగుతున్న సంగతి యాదికొస్తుంది. గుండెల్లో గాజు పెంకు దిగినట్లుగా మూలిగింది. బిడ్డలు పది ఖతం చేసి ఇంట్ల కూసునిరి. ఒకటి రొండేండ్లాయే. పై సదువులు చెప్పించే తాహతులేదు. పెండ్లిల్లు చేసే ధైర్యం లేదాయే. 'అయ్యో బిడ్డలాల ఈ ఇంట సుకపడ్తమని జంటకట్టుకొని పుట్టినారే నా బిడ్డలాల' అని ఒంటరిగా కుంగిపోతుంది.

సుట్టపక్కాలు కూడా కలిసినపుడు బిడ్డలకు సంమందాలు చూస్తున్నవె కమలమ్మా అని అడుగుతుండ్రి.







ఓ సారి భర్తతోని అన్నది కూడా. 'ఏమయా పిల్లలు ఎదుగుతుండ్రు. తోటి పిల్లలకు పెండ్లిల్లు అయితుండె...' అని.

నారాయణ గమ్మున ఉండు. మాట మాట్లాడే ధైర్యం ఆయినకు యాన్నుంచి వొస్తది.

తను మాత్రం ఏం చేయగలుగుతడు. ఇయ్యాల రేపు ఎంత తలకు మాసినోడయినా ఎంతిస్తవ్ అని అడుగుతుండె. ఆ మాట తల్సుకుంటెనే గుండెల్ల దడబుడుతుంది. కమలమ్మకు అసలు ఈ జల్మకు పెళ్లిల్లు చేస్తనా నా బిడ్డలకు అని దిగులు పడ్డది.

ఏవయా అని అంటే నారాయణేమో తొందరేమొచ్చింది అంటడు. మల్లోసారేమో ఆగు ఈ అప్పులు గిప్పులు తేటగయి చెయ్యి తిరగనియ్ అంటడు.

అప్పులు ఈ జన్మలో తీర్తయంటవా? నా బిడ్డల పెండ్లిల్లు అయితయ్ అంటవా? అని కమలమ్మ దుక్కం గొంతుతో అడుగుతది.

కమలమ్మ ప్రశ్నలకు సమాధానం ఆమెకు తెల్సు. తనకూ తెల్సు. అంతా కాలం మీద భరోసా ఏద్దాం. పిల్లల రాతెట్లుంటే అట్టయితది. బిడ్డలకన్నం గని ఆల్ల రాతలు కన్నమా అన్నడు. ఒకోసారి వేదాంత ధోరణిలో కమలమ్మ కండ్లు నల్సుకుంటది.

★ ★ ★

బొర్రెంకయ్య తోటల ఇంకో బోరు బిక్కింది. మొన్న యేసిన బోరొక్కటే పోస్తుంది. తోటకు ఎటూ సాల్తలేవు. ఇపుడే ఇట్ల ఉంటే రేపు ఎండకాలమైతే ఆయింత సాలవు. ఇన్నాల్లు పెంచిన తోట నిట్టనిలువున వొదిలేయాల్సి వొస్తది అనుకుండు. ముందు జాగర్తగా బోరేయాలనుకుండు. ఎటురోకు ఎయ్యాలె బోరు పక్కనమొన్న బోరేస్తే ఎండిపాయే. ఇటుకాకుంట నారాయణ బోరుకల్ల యేస్తే. పుట్టగడ్డ కాడ నారాయణకు బోరుపడె. అది తనగెట్టెమ్మటె ఉండె. నారాయణ ఏమన్న మొత్తుకుంటడా. ఆ మొత్తుకునేది ఏముంది? ఎవని భూమిల ఆడు ఏసుకుంటడు. ఎవని ఉసులు బాటు ఆడు సూసుకుంటడు. అయినా నారాయణకు అంత ధైర్యం లేదు. అంతకు తోక జాడిస్తే తన చేతుల జుట్టు ఉండనే ఉండె అనుకుండు బొర్రెంకయ్య.

ఓనాడు చెప్పాచెయ్యకుంట బోరుబండి దింపిండు. సక్కగ తీసుకొచ్చి పుట్టగడ్డ దగ్గర తన భూమిల బండి ఆపిండు. వొరాల మీద తిరుగుతున్న నారాయణకు దిమ్మతిరిగింది. ఉరికొచ్చినట్టే వొచ్చిండు. ఏందీ అని అడిగిండు. బొర్రెంకయ్య జీతగాడు 'ఈడ బోరేస్తున్నం' అన్నడు.

నారాయణ నోటమాట రాలేదు. నాలిక పిడసకట్టుకపోయింది.

'ఏందిది న్యాయమేనా?' అన్నడు నారాయణ బొర్రెంకయ్య కాడికిపోయి.

'కాలమే అన్యాయం జేస్తుంది. మనుషులం మనం న్యాయం మీద నిలబడ్తమా ఏంది' అన్నడు.

'అంటే' అన్నడు నారాయణ

'చిన్న పిలగానోలిగ అడుగుతవేం నారాయణా. నా భూమిల నేనేసుకుంటున్న. నీకేంది చెప్పు నొప్పీ' అన్నడు.

'అదేంది అట్లంటవ్. నా బోరు పక్కన నువు బోరేస్తే నాదెండిపోదూ' అన్నడు కండ్లల్ల నీల్లు తిరుగుతుంటె.

'నా దాంట్లె నేనేసుకోకూడదా చెప్పు అన్నడు బొర్రెంకయ్య.

'అసుంట ఏసుకో ఎవడొద్దన్నడు. తీసుకొచ్చి ఈడపెడితె ఎట్ల' అన్నడు.

'యాడ పెట్టాల్నో తెలుసుకాని నువ్వాకో. ఒరే పనిచూడ్రి' అని బోరుబండోల్ల గదమాయించిండు.

వాల్ల పని ఆల్లు మొదలుపెట్టింట్రు. నారాయణ గిలగిలలాడిండు. దెబ్బ మీద దెబ్బ కోలుకోకుంట కాలందెబ్బ. మనిషి దెబ్బ. అయ్యో రామచంద్రా అని మూలి గిండు. ఎంత లొల్లిపెట్టినా వినకుండ బొ్రెంకయ్య బోరేయడం మొదలుపె ట్టిండు. తన గుండెల మీద బోరురాడ్డు దిగుతున్నట్టుగా మిలవిల్లాడిపోయిండు నారాయణ.

బోరు బండి నడుస్తనే ఉంది. రాడ్డు దిగుతనేఉంది.

నారాయణ గుండెకు తూట్లు బడ్డట్లు విలవిల లాడిపోతుండు. వొల్లు స్వాదీనం తప్పుతుంది. సావుదప్పి కన్ను లొట్టబోయి నట్టు ఈ రొండో బోరు పడ్డది. ఇప్పుడది ఆగమయ్యే యాల్లొచ్చింది. ముందే గొట్టె రాజ్యం, బోరుపక్కన బోరేస్తే ఇంకేమన్న ఉందా? ఎన్ని బోర్లు అట్ల యేస్తే మూలకు పడ్డయి. తలనిండ అప్పులు. కండ్ల ముంగల కష్టాలు గిలగిల లాడిపో యిండు.

మనిషి దుక్కపు ముద్దోలిగ కదిలి ఇంటి కొచ్చిండు నారాయణ. గుండె బలిగినట్లు కూసొనెసరికి కమలమ్మకు దిగజెమటలు పట్టినయ్. బతుకు పాడుగాను. ఏ శిడాన ఏం ఇనాల్సివస్తదో అని గజగజ వొనికిపో తుంది కమలమ్మ.

భర్త సొంతం తలనరికేసినట్టు నిలబడే సరికి ఉరికి 'ఏవయా మల్లేమాయె? ఏం పానం మీదికొచ్చె' అన్నది.

ఏం మాట ఇనాల్సివస్తదో అని బిక్క మొకం ఏసుకుంది. నారాయణ జీవిగంజి తాగినోడు మాట్లాడినట్లుగా నోరుతెరి సిండు.

పానం లేనట్టుగా 'బొ్రెంకయ్య... మన బోరు పక్కనే బోరేస్తుండు' అన్నడు.

కమలమ్మ చెవులు దిమ్ముపట్టినట్ట యింది. అర్థమయ్యి దిమ్మెరబోయింది. భూమి లోపలికి కుంగిపోతున్నట్లుగా అయింది.

ఏడుపు కూడా రాలే. మనసు మొద్దు బారినట్టయింది. కుప్ప కూలినట్టుగా కూల బడిపోయింది. పిట్ట పిల్లోలిగ గజగజవొ నికి పోయింది. మొకంలో నెత్తురు సుక్క లేదు. అయ్యో భగమంతుడా అని రొండు చేతులు నెత్తినపెట్టుకుంది. కుమిలిపో యింది.

నారాయణకైతే చిమ్మచీకటిగా వుంది. కండ్లు బైర్లు కమ్మినట్టయితుంది. మాట ముచ్చెట లేకుండ మంచంల పీనిగ లెక్కప డిపోయిండు. గుడ్లు తెరిసి దూలాలకల్ల చూస్తుండు. ఎన్నో ఆలోచనలు నారా యణ మనసులో ముసురుతున్నయ్. ఊపిరి పీల్చుకోవడం కూడ ఇబ్బంది అయి నట్టు ఎగశ్వాస తీస్తుండు.

మొగుడు పెండ్లాలు అట్ల నిలువున నరి కిన చెట్లోలిగ పడిపోయింట్రు.

కమలమ్మ ముందుగాల తేరుకుంది. అసలే అప్పుల మనాదిల ఉన్న మనిషి. ఇయాల ఈ గండంవొచ్చి నెత్తిన కూసుంది. తనుకూడా అట్లనే ఉంటె సొంతం గుండెబలుగుతడు అని లేసి కూసుంది.

ముక్కుజీది శాపనార్థాలు అందుకుంది. ఆడు అయ్యాల అట్ల బోయెటోని పిల్సి అప్పిచ్చిండు. మల్లబోరేస్తుంటే అప్పి చ్చిండు. ఆని మనుసుల ఇంత ఇసముంద నుకోమైతిమి. లంజాకొడకు నిలువున ముంచె. ముందలికి తోసి కొంకులు నరికె. నవ్వినట్టే నవ్వి నట్టేట ముంచె. ఇంత ఓర్వలేని గుణమైపాయె ముండాకొడకనిది. ఈ పాపపు కాలాన సాయంజేస్తుండు అనుకుంటిమే గాని సావుకు దగ్గర చేస్తడ నుకోమైతిమి!

కమలమ్మ గొంతు పూడుకపోయింది. అమ్మనా బూతులు తిట్టింది. దొండాకు పసరుకాన్నుంచి కడిగిపోసింది. తిట్టి తిట్టి







అలిసిపోయింది. లేసి ఇన్ని మంచినీళ్లు తాగి భర్తకు ఇన్ని ఇచ్చింది.

'లేయా లే, ఏంది ఓ అట్లపండినవ్. మనకేమన్నా కొత్తనా ఈ కష్టాలు. అయ్యాల కాలం ముంచింది బోరును. ఇయ్యాల ఈడు ముంచిండు. కాలం ముంచితే ఏం జేద్దాము.. లే. లేసి, అన్ని మంచినీళ్లు తాగు' అని లేపి కూసబెట్టింది.

'మనం కాల్లు బార్ల సాపి కూసుంటే వచ్చిన గండం పోతదా గని. నలుగురు పెద్దమనుషుల కూడగొట్టు. ఇది ఊరా పాడా.. న్యాయమా అన్యాయమా ఆల్లే చెపుతరు' అన్నది.

నారాయణ మంచినీల్లు తాగిండు. కమలమ్మ చెప్పే మాటలు ఇన్నడు. వరదల కొట్టుకపోయెటోనికి గడ్డిపోస దొరికినట్టుగా చిన్ని ఆశ. చూద్దాం అనుకుండు. పెద్ద మన్సులంటోల్లు ఉంద్రు. మంచికి చెడ్డకు మాట్లాడ్తరు. ఓ మాట చెప్పిచూద్దాం అని లేసిండు.

సక్కగ పటేలుకాడికి పోయిండు. సంగతంతా పూసగుచ్చినట్టు చెప్పిండు. దుక్కం తన్నుకొస్తున్నా దిగమింగిండు.

సాంతం ఇని పటేలు పెదవి విరిచిండు. 'నారాయణ నీ కడుపుల మంట అర్థంచేసుకుంట. మనం పొయ్యి అడగొచ్చు కాని ఏం లాభం చెప్పు. ఈ ఊళ్లోనే చూడు. ఎంత మంది ఒకలేసిన బోరు పక్కన ఇంకోలు బోరెయ్యలేదు. ఎన్ని పంచాయితులు చెయ్యలేదు. ఏమన్న ఫలితముందా? నాదాంట్ల నేనేసుకున్నా అనేదేగా జవాబు. అట్ల ఎయ్యొద్దు అని సర్కారు చట్టం కూడా ఉంది. ఆ మాట కొస్తే అసలు బోరేస్తందుకే సర్కారు అనుమతి తీసుకోవాలంట. మనం పాటిస్తున్నమా? సర్కారు మాటంటే ఏంది. దూడను చీకమని బర్రెను తన్నమనేదేగా. పోతే అదో అయాసం తప్ప మెడలు వొంచి ఒప్పించలేముగా' అన్నడు.

నారాయణ సగం సప్పబడ్డడు. ఇంకే ముందని లేసిండు. పెద్ద పంగోనికాడికి పోయిండు. ఆయన దిక్కులు చూసిండు.

'పటేలు కాడికి పోయొచ్చిన అంటున్నవ్‌గా నారాయణ. ఆయిన చెప్పింది నిజమే గదా. తోటి ఎలమోడు. నేను ఎదురెట్లా మాట్లాడ ఆయనకు' అన్నడు.

దింపుడు కల్లం ఆశ కూడా పోయింది నారాయణకు. తుండుగుడ్డ దులిపి భుజాన ఏసుకుండు. ఎంతయినా ఈడూ అదే బాపతాయే. ఈడు అట్ల ఏసినోడే నాయే. ఆని దగ్గరకి పోయి మాట సాయం చేయమనుడే తప్పు. దొంగలు దొంగలు ఒకటి అనుకుంట.

ఇంకా ఎక్కడా కాలు నిలపబుద్ధికాలేదు. సక్కంగా ఇంటికొచ్చిండు.

కమలమ్మ ఆతురతగా ఎదురుపోయి అడిగింది.

ఈ కలికాలంల 'నాయం అని పోవడమే బుద్ధి తక్కువ' అని కూలబడ్డడు.

'పోయి పోయి బొర్రెంకయ్యకు ఎదురెవడు బోతడు. ఇద్దరు ఏదో కతలు చెప్పి జారుకుంద్రు' అన్నడు. కమలమ్మ గాలి తీసిన టూబోలిగ కూలబడ్డది.

రొండు మూడు దినాలల్ల బొర్రెంకయ్య మోటరు బిగిచ్చిండు. మాంచిగ నీల్లు పోస్తుంది. ఓ నాడు ఆగి నారాయణ పోయి బోరేసిండు. గిన్నినీల్లు బుక్కలు బుక్కలుగా ఎగజిమ్మి మోటరు మొత్తుకుంది. కుక్క ఆశ గుండ్రాయితో పోయింది. సాంతం పీకల కాడికి మునిగినట్టనిపించింది.

ఇంకేముంది? నెత్తిన గుడ్డే. చేసుకుంటందుకు నీల్లు లేవు. బతికితందుకు ఇంకో దారి లేదు. సరిపోను అప్పులు. సావు బతుకులు కండ్లల్ల మెదులుతున్నయ్. నారాయణ మనిషి సాంతం దిగిపోయి



నట్లు అయ్యిండు. సత్తువ గుంజినట్ల యిండు. కమలమ్మోలు కూడు నీల్లకు ఎడ బాసింద్రు.




**ది**నాలు అయిపోయినంక బయిటికొచ్చి నట్టు ఒచ్చిండు నారాయణ. జరసేపు గురువయ్యా కాడ కూసోనొద్దామని బాట పట్టిండు.

సాంబయ్యా ఎదురొచ్చిండు. 'ఈ సర్కారోడు ఏదో ఒర్గబెడ్తడనుకున్నం. ముక్కు కోసినా మునుపటి మొగుడే నయమన్నట్టుంది. అన్నీ కల్లబొల్లి ముచ్చట్లు చెప్పిండు. ఆనివి ఆడు సదురుకుంటుండు. సొంతం దున్నపోతు చర్మాలు తొడుక్కుని కూసుంద్రు' అన్నడు.

నారాయణ ఆగిండు. బీడి ముట్టించి ఏమాయె అన్నడు.

'ఏముంది అడవిల ఉన్నోల్ల దా మాట్లాడదాం అనె. నువ్వు నేనూ ఒకటే అనే. మూడురోజులు మురిపిచ్చే. ఎన్కంగ తలిగి పిట్టల కాల్సినట్టు కాల్పిస్తుండె' సాంబయ్యా కండ్లల్లో తడి. నారాయణ ఊకొడుతుండె సాంబయ్యా మల్లా అన్నడు.

'మార్వాక మాదిగాయన కొడుకు ఎంకన్న లేడూ.. తెల్లవారుజామున కాల్చేసింద్రంట' సాంబయ్యా ఇంట్లె మనిషి సచ్చిపోయినట్టుగా చెప్పిండు.

నారాయణ గుండెల్లో బోరు మెదులుతుంది. ఏమీ అనలేక దమ్ముగుంజుకుంట పోయిండు. గురువయ్యా టీవీల వార్తలు ఇంటుండు. నారాయణను చూసి 'తెలిసింది. అంతా అనాత్మకాలం' అని మంచం చూపించిండు.

'పుట్టిన దగ్గర నుంచి లాగులు ఎన్ని తొడగలేదు. ఎన్ని కష్టాలు చూడలేదు. బెంబేలెత్తిపోతే ఎట్ల. రెక్కలున్నోనికి దేశం గొడ్డుబోయిందా' అని ఓదార్పు మాటలు మాట్లాడిండు.

ఇంకా అదే ముచ్చట. కెలకడమమెందు కని 'ఆ టీవీల సూడు వార్తలు' అన్నడు.

'ఆయినో మంత్రి. నేనూ యావుసాయం చేసిన చిన్నపుడు అంటడు. రైతన్నలే నా ప్రాణం అంటడు. ఇప్పుడేమంటుండో తెలుసా రైతులు వరిసాగు బందుచేయల్నంట. కూడు తినేనోటికి ఆ మాటలెట్ల వొస్తున్నయో' గురువయ్యా గొంతులో కసి.

'వొరి సాగు మర్చి, యవుసాయం వొదిలి... పార్టీ జండాలు మోయాల్నేమో. ఆల్లు ఇచ్చే పులిహోర పొట్లాలకు, సారపాకెట్లకు చేతులు సాపాల్నేమో' పండ్లు పటపటా కొరకబోయి నొప్పికి ఆగిండు.

'పోరాడి సాధించుకున్న నిషేధం పోయిన సర్కారు ఎత్తేసింది. సుతి మెత్తని మాటలు చెప్పి మందు దుకాణాలు తెర్సింది. ఆనికి జర భయం భక్తి అన్న వుండె. ఈ సర్కారు వొచ్చి బట్ట గుడ్డలు ఇడిసేసినట్టు చేస్తుంది. మందుకు ఆడు కిటికీలు తెరిస్తే ఈడు దర్వాజలు తెరుస్తుండు. టార్గెట్లు పెట్టి అమ్మిస్తుండు.

ఇంకా ఇచిత్రమేమంటే ఎక్సైజు సిబ్బంది తోనే దుకాణాలు తెరిపిచ్చుడు. ఆల్లు యూనిఫారం ఏసుకొని అమ్ముడు. సొంతం బొక్కలు మెడకేసుకుంది ఈ సర్కారు. ఆదాయం తప్ప ఇంకో ఆలోచన లేదు' గురువయ్యా దమ్ము వచ్చి ఆగిండు.

వార్తలయిపోయి ఇంకేదో కార్యక్రమం మొదలయ్యింది. గురువయ్యా నారాయణ

దిక్కు చూసుకుంట 'దిగులుపడకు' అన్నడు.

'ఒల్లు బాలేక నల్లగొండకు పోయిన రొండొద్దులు. రాత్రిర్నే వొచ్చిన' అని సరాయించిండు. పది పదిహేనేండ్ల కింద అప్పటి ముఖ్యమంత్రి కాల్వ ఇస్త అని ఆశ పెట్టిండు. బాటల పొంటి బాటల పొంటి.

కాల్వగుంతలు తొవ్విచ్చిండు. తర్వాత ముఖ్యమంత్రి రోడ్లు, హైటెక్కులు అంటుంటె ఇప్పటి సర్కారు అప్పుడు గుండెలు బాదుకుంది. ఇంత అన్యాయమా, రైతులకు నీల్లు యియ్యొద్దా, కాల్వలు తొవ్వొద్దా అని జనం ఒర్లబడ్డరు.

సీట్ల కూసున్న ఈల్లు అట్లనే గుంతలు తీస్తుంద్రు. సర్వేల మీద సర్వేలు చేసింద్రు. ఎమ్మెల్యేలకు ఎంట తిరిగినోల్లకు కాల్వగుంటల కాంట్రాక్టులు ఇచ్చింద్రు.

'నీదాంట్లెంగ కూడ కాల్వ పోతుందిగా నారాయణ. అప్పుడు సర్వే చేసినట్టు గుర్తు' అన్నడు గురువయ్య.

నారాయణ 'అవును అటురోకు రెండెకరాలు పోతది అన్నరు' అన్నడు.

'రేపో మాపో నీ చెల్కల కాల్వబొందలు తవ్వుతరు. ఇంకోచోట భూములిస్తమన్నరు. ఇప్పుడు పైసలిస్తం మీరే కొనుక్కోరి అంటుండు. అసలు సంగతి నిన్న నల్లగొండల తెల్సింది చెప్పనా, నారాయణా? ' అని ఆగిండు. గురువయ్య గస గస దగ్గిండు. కంట్లల్ల నీల్లు తిరిగినయ్.

ఈ సర్వేలు, కాల్వలు అంతా బోగస్. ఈ తతంగానికంతా పద్ధతి పాడులేదు. భూములు పోయినోల్లకు నష్ట పరిహారం ఇస్తం అంటుంద్రు.

కలక్టర్లతోటి మీటింగుల మీద మీటింగులు పెట్టిస్తుంద్రు. పార్టీకో మాట మాట్లాడుతుంద్రు. అసలు నిజమేందంటే సర్కారోనికి అసలు పరిహారం ఇచ్చే ఆలోచనే లేదు. ఇదంతా రైతులు సావకుంట బతకకుంట చూసిచ్చే ఆశ. గురువయ్య కండ్ల నీల్లు ఒత్తుకుండు.

దెబ్బమీద దెబ్బ.

రొండెకరాలు.. నారాయణ కండ్లల్లో కరిగి రొండు కన్నీటి చుక్కలై రాలింది.

★ ★ ★

## సాపేక్ష సిద్ధాంతమంటే..?

ఒకసారి ఐన్‌స్టీన్ కనుగొన్న సాపేక్ష సిద్ధాంతం గురించి అడిగినప్పుడు ఆయనిలా తమాషాగా చెప్పాడు- నా పాలగ్లాసులో రెండు వెంట్రుకలు కనిపిస్తే అవి చాలా ఎక్కువ. అదే నా తలమీద రెండు వెంట్రుకలున్నాయంటే అవి చాలా తక్కువ. అలాగే వేడి స్టవ్‌మీద ఓ నిమిషంపాటు చేయిపెట్టినా అది ఓ గంటలా అనిపిస్తుంది. అదే మీకు నచ్చిన అందమైన అమ్మాయితో మాట్లాడుతుంటే ఓ గంటయినా నిమిషంలా అనిపిస్తుంది.



మూల్గే నక్కమీద తాటిపండు బడ్డట్టు బొర్రెంకయ్య పిలువ నంపిండు.

జీతగాడు వొచ్చి చెప్పితే కమలమ్మ ఒంటి కాలుమీద లేసింది.

'ఇంకా ఏముందని మాకాడ. ఆ లంజా కొడుకు నిలువున ముంచే. బోరొదిలి పెడితిమి. మోటారు వొదిలి పెడితిమి. రొండు రెక్కలు వొల్లె పెట్టుకుని కూసుంటిమి. ఇట్ల కూడ బతకనియ్యడంటానా. ఆ







యిసం ముండాకొడుకు?' అని తిట్టిపోసింది.

వొచ్చిన జీతగాడు ఎల్లిపోయిండు.

జరసేపయినంక నారాయణ లేసిండు. 'ఎంతయినా ఆనికి బాకీ ఉన్నం. దాని గురించే అయి ఉంటది. ఎంత పగున్నా, కోపమున్నా అప్పును కాదనలేంగా, పోయొస్త' అని చెప్పులేసుకుండు.

నవనాడులు కుంగిపోయినట్లుగా నారాయణ నడిసిండు.

బొర్రెంకయ్య ఇంటికి పోయిండు. ఆయిన బంకుల్ల కూసోని ఉండు. నలుగు రైదుగురు ఊరి మనుషులు ఏదో యవారం మాట్లాడుతుండ్రు.

నారాయణను చూసి బొర్రెంకయ్య పలకరించిండు.

'నారాయణ బోరుపక్కన బోరేసిన్నని కోపం పెట్టుకోకు. ఏం చేయను చెప్పు. నేనూ బతకాలెగా. ఆ బోరు పడకపోతే తోట నిలువునా ఎండిపోదా? ఎంతయినా తనకు మాలిన ధర్మం చేయమని ఎవలూ చెప్పలేరుగా' అన్నడు.

నారాయణ సప్పుడు జేయకుంట కూసుండు.

నీకు సాయం చేయాలని ఉండబటికే కదా నువ్వు తొక్కులాడుతున్నవని తెల్సి అప్పు ఇచ్చింది. మల్ల రొండో బోరుకు కూడా ఇచ్చింది. నేను మేలు కోరేటోన్నేగని కీడుకోరనయా' అన్నడు.

బొర్రెంకయ్య తియ్యటి మాటలు ఇన్నోల్లు ఔరా అని ముక్కున ఏలేసుకుండ్రు. నారాయణ సడీసప్పుడు చేయలే. మనసు కుతకుత ఉడికిపోతుంది.

బొర్రెంకయ్య సక్కగ అసలు ముచ్చెట చెప్పిండు.

'బోరు, పొలం ఉంటె ఇయ్యాల కాకపోతే రేపు తీరుస్తవు బాకీ అనుకుందును. అది పాయే. మరి నా బాకీ ఎట్ల తీరుస్తవ్ చెప్పు. తీసుకున్ననాడు తీసుకుంటివి. మల్ల అసలు లేదాయే. మిత్తి లేదాయే. మల్ల తీసుకొని కాయితమైతె రాసిస్తివి. ఆ కాయితం పట్టుకొని ఎన్నాల్లు కూసోను. అదే అప్పు సంగతి యాది చేద్దామని' బొర్రెంకయ్య గుండేసిండు.

నారాయణ ముందే ఊహించిండు. అయినా ఇంత తొందరగా అడుగుతడు అనుకోలే. నోట జవాబు లేక కూసుండు.

'ఏంది నారాయణ అట్ల బెల్లంగొట్టిన రాయోలిగ కూసుంటే ఎట్ల చెప్పు' అన్నడు.

ఇంక నారాయణకు మాట్లాడక తప్పలేదు. 'నా పరిస్థితి తెల్సు. సొంతం మునిగినంక ఇట్ల నిలబెట్టి అడిగితె ఏం జవాబుంది' అని నీల్లు నమిలిండు.

'నీకున్నది నాలుగెకరాలు. దాంట్లె రొండు కాల్వలకు కొలత ఏసిండ్రు. అది ఎవడూ ముట్టుకోడు. నువ్వు వొదులుకోవలసిందే. మిగిలింది ఇంకో రొండు. ఇయ్యాల్టి దరలల్ల అమ్మినా నా అప్పు తీర్తదన్న నమ్మకం నాకు లేదు' అన్నడు బొర్రెంకయ్య.

బొర్రెంకయ్య భూమికి యాతం పెడుతుండని అర్థమైంది. నారాయణకు పానం గరగ్గుమన్నది. గిలగిలలాడి మూల్గింది. గుండెలు బాదుకొని ఏడవాలన్నంత దుక్కం. కండ్లముందే కలలు చెదిరిపోతుంటే తట్టుకోలేక పోతుండు. పిల్లలు కండ్లల్ల మెదిలిండ్రు. కమలమ్మ కండ్లల మెదిలింది. అయ్యో ఈ దేవుని రాజ్యాన గోస యినే నాదుడు లేకుంట అయిపోయే గదరా భగమంతుడా అని మనసులో రోదించిండు.

నారాయణ మూగబోయినట్లు నిలబడేసరికి బొర్రెంకయ్య మల్ల అన్నడు.

'ఏదో ఓటి ఆలోచించుకో. నా బాకీ అయితే తీర్సాల్సిందే. నేను ఆగను' అని కటువుగా చెప్పిండు.

ఒక్కసారే గుండుమీద బడ్డట్టు అయితే తేలదు. అని నాలుగురోజుల సమయమిచ్చిండు.

'తొందరగ తేల్సు మరి. పోయి భార్యతోని మాట్లాడు' అన్నడు.

నారాయణ లేసి కలల తేలినట్టు తేలి ఇంటికొచ్చిండు.

కమలమ్మ ఏడ్సుకుంట 'అప్పు సంగతేనా' అన్నది.

నారాయణ తలాడించిండు.

'ఏ మంటుండు?'

'భూమికి ఏసరు పెడుతుండు'

నారాయణ దుక్కాన్ని ఆపుకోలేకపోయిండు. బోరున ఏడ్సిండు. గుండెలు బాదుకుండు. శీను బిత్తిరి సూపులు చూస్తుంటే బతుకుతమనుకున్నం కొడకా అని అల్లుకుండు.

అయ్యో రామా అని కమలమ్మ శోకాలు అందుకుంది. ఎన్నడు కంటతడి ఎరుగని భర్తను చూసేసరికి గుండె తరుక్కపోయింది. ఇద్దరు బిడ్డల అల్లుకుంది. కడుపు ఎగిసిపడుతుంటే దుక్కపడ్డది.

కమలమ్మోల్లు దుక్కంలోనే మునిగిండ్రు.

★ ★ ★

నారాయణ కూడా నీల్లు ముట్టతలేడు. ఎవలితోని మాట్లాడ్తలేడు. దిగులు గడ్డోలిగ ఉండు. నీల్లల్ల తడిసిన తోలి తిత్తోలిగ కూలబడ్డడు. చిమ్మ చీకటి. దిక్కులు కనిపిస్తలేవు. చీకట్ల కనిపించేది సావొక్కటే.

ఎంతమంది రైతులు ఉరిబోసుకోలే. వాల్లు చస్తుంటే ఎందుకు సావాలే అనుకుండు. ఇంకో బతుకుదెరువు చూసుకోలేరా అనుకుండు. తీరా తనకాడికొచ్చేసరికి తనకు సావు తప్ప ఇంకోదారి కనిపిస్తలేదు.

రోజుకు ఇంతమంది రైతులు పుట్ట పుట్ట సచ్చిపోతుండ్రు. అసలు రైతులే సస్తలేరని సర్కారు ముసిముసి నవ్వులతో చెపుతుంది. ప్రతిపక్షమోల్లు గట్టిగ లెక్కలు చూపిస్తే మీ సర్కార్ల సచ్చిం దానికంటె తక్కువేలే అంటుండ్రు. రైతులు పైసలాశకు సస్తుండ్రు అంటుండ్రు. పైంగ సావదల్సుకున్నోల్లు హెల్పులైన్లు కలక్టరాఫీసుల పెట్టినం. ఫోనుచేసి సావురి అంటుండ్రు. ఇంత దిక్కుమాలిన సర్కారు. సర్కారంటె సావుకోరేదయిపాయే. ఇప్పుడు తన సావుకు ఎదురుచూస్తుంది. తను సచ్చినా సర్కారు లెక్కల్ల పడ్తడో లేడో. సాదుడు కుక్కలు సస్తున్నా ఏడుస్తుండ్రు. రైతులు సస్తే మున్సిపాలిటీ కుక్కకంటె అద్వానమయిపాయె. పీనిగను పెట్టుకొని రాజకీయాలు చేస్తుండ్రి.

నారాయణకు ఎటూ తోస్తలేదు. అన్ని తోవలు మూసుకుపోయినట్టుగా అయితుంది. ఇంక నాలుగురోజుల కయినా బొర్రెంకయ్య పిలుస్తడు. తలమీద కత్తిపెట్టయినా రొండెకరాలు రాయించుకుంటడు. ఇంకా చేతుల చిప్ప. ఊరినిండి అప్పులు. పిల్లలు... ఏం చూసుకొని బతకాలె. ఎట్ల బతకాలె. నారాయణ ఆలోచనలు ఎటుబోయి సావుకాడికొస్తున్నయ్.

నారాయణ వాలకం చూస్తుంది కమలమ్మ. తనకు అవే ఆలోచనలు. అమ్మ అయ్యా కట్టగట్టుకొని సస్తే పిల్లలు... ఒల్లు జల్లు మన్నది కమలమ్మకు.

## కొత్తగాలి...

ఉద్యోగానికి అంకితం
అమ్మానాన్నలు
ఎంసెట్ కోచింగ్‌కి
అంకితం అన్నాచెల్లెళ్లు
టీవీలకి అంకితం
బామ్మాతాతయ్యలు

– యు. శైలజ, మోటూరు



తల్లి తండ్రి గూడుకట్టుకొని కూసుంటె పిల్లలకు గుండె బలిగినట్లయింది. ఆడ పిల్లలయితే అల్లాడుతుండ్రు. అమ్మ అమ్మ అని ఏడుస్తుండ్రు అల్లుకొని, శీను మనసు మనసుల లేదు. సంసారం చెయ్యి దాటింది. సావుదప్ప శరణ్యం లేదు. కాని సస్తే సమస్యలు తీరతయా. ఇట్ల సచ్చు కుంటపోతే ఎవనికేం బాధ. సావడం కాదు.

తను విన్న పాఠాలు ఇంకేదో నేర్పి నయ్.

తల్లి తండ్రి మాటలు పడిపోయినట్టు కూసుంటే శీను ధైర్యం తెచ్చుకుని దగ్గరికి పోయిండు. తండ్రి మీద చెయ్యేసిండు.

'నాయినా రైతుకు అప్పులు సహజం. అప్పులున్నోళ్లు సచ్చిపోతరా? పిల్లి సస్తే గోడవతలేసినట్టే, ఎవనికి బాధ. కన్న పిల్ల లకు మాకు బాధ. అనాధలయ్యేది మేము. బతుకు తెరువు పొయ్యింది. అమ్మయ్య మీరు తొందరపడితే మాకేం మిగులుద్ది. మా మొకం సూడు నాయినా'.

నారాయణ కొడుకు దిక్కు చూసిండు. శీను మాట్లాడే మాటలు వింటుండు. వీనిలో ఇంత ధైర్యం యాన్నుంచి వొచ్చింది. వీనికి ఇంత అవగాహన యాన్నుంచి వొచ్చింది. వీని తిరుగుల్ల గురించి తను విన్నది నిజమా అను కుండు. తల్లి కమలమ్మ కొడుకు మాటలు ఇంటుంది.

తమ మనసులో ఉన్న ఆలోచనలు వీడు ఎట్ల పసిగట్ట గలిగిండు అనుకుండ్రు నారాయణ మొగుడు పెండ్లాలు.

'ఓ మాటిను నాయినా. ఎల్లయ్య అప్పుల పాలయి అదురుకొని సచ్చిండు. ఏం ఒర్గింది? పెండ్లం పిల్లలు దేశాలపాల యిండ్రు. తండ్రి ఉంటెనన్న పిల్లలకు ధైర్యం కాదా? కూలినాలి చేసుకొని పొట్ట పోసుకుంటుండె. ఇప్పుడు దాపులేక అల్లా డుతుండ్రు. మమ్ముల అట్లచేయకు నాయినా'.

శీనుకు దుక్కం ఆగలే. తండ్రిని పట్టు కొని బోరుమన్నడు. తల్లిని పట్టుకొని బోరుమన్నడు.

'కూడు నీల్లకు ఎడబాసి ఏంది నాయినా ఈ దిగులు. లేరి లేసి ఇంత తిందాం. భూమిలేని మాల మాదిగోల్లు బతుకుత లేరా. మనమెందుకు బతకలేము. ఇంతంత అప్పయితే కష్టంచేసి తీర్సుదాం' అన్నడు.

'రమా అన్నాలు పెట్టు' అన్నడు శీను. నాలుగు దినాల సంది ఉమ రమ అన్నాలు వొంతుండ్రు. పారేస్తుండ్రు.

శీను మాటతో కంచాలు సదిరిండ్రు.

శీను తల్లిని, తండ్రిని రెక్క బట్టుకొని లేపి పల్లేలు చేతికిచ్చిండు. దగ్గర ఉండి నాలుగు ముద్దలు తినిపించిండ్రు. తర్వాత తనూ చెల్లెండ్లతో కల్సి తిన్నడు.



శీను మాటలకు ఆ కుటుంబంలో ఏదో ధైర్యం వొచ్చినట్టయింది.

కమలమ్మోల్ల మొకంలో కొద్దిగా పానా లొచ్చినయ్. సందకాడ ఇంట్లె కూసుండ్రు. కొడుకు మాటలు నారాయణ మనసు మీద పనిచేసినయ్. నాలుగు రోజులు పిల్లలు ఎంత బెంగపడ్డరు. ఆడపిల్లలు ఎట్ల కుమిలిపోయిండ్రు. పొరపాటున తను తొందరపడితే బిడ్డలు ఆగమైపో దురు గదా అనుకుండు. భర్త మొకంలో ధైర్యం చూసి కమలమ్మకు ధైర్యమొచ్చింది.

మాపు తిని పండుకునే యాల్లకు బక్కులు పిల్లోలిగ నడుసుకంట వొచ్చిండు. కమలమ్మోల్ల ఇంటి ముచ్చట్ల పడ్డరు.

బక్కులు భయభయంగా వొచ్చి 'ఊల్లె... తెల్సిందా..' అన్నడు.

నారాయణ కమలమ్మ ఏందీ అన్నట్టుగా

## నవంబరు-08
# చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. ఆర్.దయాకరరావు - పటాన్‌చెరు, మెదక్ జిల్లా
2. పి.ఉమామహేశ్వరి - అరిలోవ కాలనీ, విశాఖ
3. ఎండి రఫీక్ - జక్లయిర్, మహబూబ్‌నగర్ జిల్లా
4. పగడాల కృష్ణారావు - గంగినేని పాలెం, కృష్ణా జిల్లా
5. గోలి సమత - పాత మంగళగిరి, గుంటూరు జిల్లా



అసంఖ్యాకంగా స్పందనలు రావడంతో అందరి పేర్లు ప్రచురించలేకపోతున్నాం.

### సరైన జవాబులు

1. మోహన్ 2. బస్సుడిపో వద్ద 3. శోభ 4. జకీర్ 5. సరస్వతి 6. పద్నాలుగో ఏట 7. అష్టదరిద్ర ప్రజాస్వామ్య పార్టీ 8. ఆకెళ్ల వెంకట సుబ్బలక్ష్మి 9. ఆనందరావు 10. హెన్రీ జేమ్స్

---

చూసింద్రు. శీను నిమ్మలంగ కూసుండు.

బక్కులు చెపుతుండు.

'అన్నలు వొచ్చింద్రు. బొర్రెంకయ్యను బడికాడ కట్టేసి కొట్టింద్రు'. గడగడ వొను కుతుండు బక్కులు. సగం ఊరు అన్నే ఉంది అన్నడు.

నారాయణ చెవులకు సప్పుడు ఇనబడు తుంది. అంతా అటు చెవులేసి కూసుంద్రు. పాటలు... డప్పు దరువులు... కేరింతలు అలలు అలలుగా చెవుల బడుతున్నయ్.

'పల్లే కన్నీరు పెడుతుందో... కనిపించని కుట్రల

తల్లీ బందీ అయిపోతుందో... కనిపించని కుట్రల'

ఊరిగోసను కైగట్టిన పాట. తెరలు తెరలుగా వినిపిస్తుంది. ఆ పాటను వింటూ శీను లేసిండు. నారాయణ దిగ్గున లేసిండు. కొడుకు చెయ్యి పట్టుకుండు. శీను తండ్రి కల్లల్లోకి చూసిండు. దూరం నుంచి వినపడుతున్న పాట...

'కుమ్మరి వామిల తుమ్మలు మొలిసెను
కమ్మరి కొలిమిల దుమ్ము లేసెను
పెద్దబాడిస మొద్దుబారినది
సాలెల మగ్గం సడుగు లిరిగినది
చేతువృత్తులు చేతులిరిగిపాయే- నా పల్లెల్లోనా
గ్రామ స్వరాజ్యం గంగల కలిసిందో- నా పల్లెల్లోనా
మడుగులన్నీ అడుగంటిపోయినవి
బావులు సావుకు దగ్గరైనవి
వాగులు వంకలు ఎండిపోయినవి
సాకలి పొయ్యిలు కూలిపోయినవి
పెద్దబోరు పొద్దంత పోస్తుందో- బలిసిన దొరలది
పేద రైతుల బావులెండిపాయే- నా పల్లెల్లోనా
పల్లే కన్నీరు పెడుతుందో... కనిపించని కుట్రల
తల్లీ బందీ అయిపోతుందో... కనిపించని కుట్రల'







కథ వెనుక కథ





# జ్ఞాపకాల వసంతం

-జి.కళ్యాణరావు

జీవితానికి జీవితమే నేపథ్యం.. అదే ప్రేరణ.. 'అంటరాని వసంతం' కేవలం కథ కాదు -జీవితం. కాకపోతే ఆ జీవితంలో నన్ను నేను వెతుక్కొన్నాను. నా పరిసరాల్ని, నా పూర్వీకుల్ని ముందుంచుకొన్నాను. అంతే, అంతే చేశాను.

నిజం - నా పూర్వీకులు ఊరి బయటే జీవించారు. కాని వాళ్ళు ఓ అద్భుతమైన సంస్కృతికి వారసులు. గొప్ప కళాకారులు. అంతే గొప్ప సాహితీకారులు. వాళ్ళకి రాత రాదు. పాటల్ని అల్లేవాళ్ళు. పద్యాలనీ అల్లేవాళ్ళు. పదాల్ని అల్లేవాళ్ళు. నాటకాలనీ అంతే-అల్లేవాళ్ళు. ఆడేవాళ్ళు. ఆ అల్లిక వారసత్వమే నాది. అదో అద్భుతం. ఆ అద్భుతమంతా అంటరానిదైంది. అణచబడింది. ఎందుకట్టా? ఈ బ్రాహ్మణీయ ఆధిపత్యం సహజత్వాన్ని చూసి వోర్చుకోలేకపోయింది. ఈ దేశంలో కళకన్నా సాహిత్యంకన్నా కులం ముఖ్యమైంది. కళని, సాహిత్యాన్ని కులం తక్కెట్లో తూచారు. అం దుకు ఈ అగ్రకుల ఆధిపత్య సంస్కృతి సిగ్గుపడదు. అదే గొప్ప విషాదం ఇక్కడ. నిజంగా విషాదం అది. ఎందుకని? ఎం దుకని అట్టా? ఆ అన్వేషణే 'అంటరాని వసంతం'.

చరిత్రని బ్రిటీష్ వాళ్ళు రాశారు. బ్రాహ్మణులు రాశారు. అగ్రకుల ఆధిపత్యం రాసింది. అందుకే ఎంత వెతికినా, ఈ చరిత్ర రచనలో నా పేజీ కన్పించదు. కోశాంబీలో కూడా. రొమెల్లాలో కూడా నేను లేను. నా పూర్వీకులు లేరు. వాళ్ళ

జీవితం లేదు. ఆరాటం లేదు. పోరాటం లేదు. సంస్కృతి లేదు. ఏదీ కన్పించదు. ఆ వెతుకులాటే ఇదంతా.

రాయడానికి సంవత్సరం పట్టింది. 'అరుణతార'లో సీరియల్‌గా రాశాను. కాని దాని ప్రిపరేషన్ దాదాపు పదిహేనేళ్ళపైనే పట్టింది. మావాళ్ళు పండితుల్లా ఏదీ గ్రంథస్థం చెయ్యలేదు. అంతా జ్ఞాపకం. చాలా ప్రాంతాలు తిరగాల్సి వచ్చింది. చాలా మందిని కలవాల్సి వచ్చింది. బకింగ్‌హాం ఉదంతం చరిత్రలో కన్పించదు. చర్చి రికార్డుల్లో దొరికింది.

ఏ పాత్ర యిష్టం-అని అడిగితే ఫలానా అని ప్రత్యేకంగా చెప్పలేను. ఏ పాత్రని యిష్టపడతాను అనేది కాదు ప్రశ్న. ఆ పాత్రల్ని ఏరుకొని ఒక చోట ఎట్టా పేర్చాను అనేది జవాబు. జీవితంలోంచి వచ్చిన పాత్రలు అవి. వాటితో ప్రయాణం చేశాను. ఆ అనుభవం చిన్నది కాదు.

ఎల్లన్న మొదలు జెస్సీదాకా. సుభద్ర మొదలు రూబీ దాకా. ఆ పాత్రలు నాలో నిలిచిపోయిన పోరాటాలు. చినసుబరాయుడు. చుట్టింటి కోటేసు కూతురు ఎంకాయి. దాతు కరువులో బతుకు పోరు లాంటి ఆకలియాత్రలో జింకోడు, వాడి మూగపిల్ల, నారిగాడు, మాతయ్య, రంగాయి, పెదకోటేశ్వరుడు, రమణయ్య మార్టిన్, శారమ్మ... ఎవర్నికాదని ఎవర్ని చెప్పాలి.

నిజం. నవల రాసేప్పుడు నిద్రలేని రాత్రులు గడిపాను. పగలంతా పదిమందిలో కూర్చున్నా ప్రతి పాత్రా వెన్నాడేది. వేటాడేది. పాత్ర తర్వాత పాత్ర. దృశ్యం తర్వాత దృశ్యం. రూతు అన్నట్టు చాలా స్పష్టంగా కళ్ళ ముందునిల్చేవి. రాసుకుంటూ పొయ్యాను. ఓ రోజురాత్రి పదకొండు గంటలకు 'ఆమె జ్ఞాపకం యుద్ధంలో విశ్రమించింది' అని ఆఖరి వాక్యం రాశాను. అయిపోయింది. 'అయిపోయింది' అని అనుకొన్నాను. కాని విశ్రమించింది రూతు జ్ఞాపకం. నా ఉద్వేగం కాదు. నిద్ర పట్టడం లేదు. చాలారాత్రి మిగిలివుంది. అట్టాగే కూర్చొన్నాను. రాత్రంతా అట్టాగే. రాసింది కథ కాదు. జ్ఞాపకం. అనుభవం. గుండెల్ని తోడేది. ఎల్లన్న, శివయ్య, రూబేను, యిమాన్యుయేలు, జెస్సీ... సుభద్ర, శశిరేఖ, రూతు,

## వసంతానికి అటూఇటూ...




నిజానికి 'అంటరాని వసంతం' మూడు భాగాలు. ఇప్పుడు మనం మాట్లాడుకొంటోంది రెండోభాగం. మొదటిభాగం రాయాల్సివుంది. మూడో భాగం రాయాల్సివుంది. యిప్పుడు మూడోభాగం రాస్తున్నాను. అది పూర్తయ్యాక మొదటిభాగం రాస్తాను.

## పాఠ్యాంశంగా...

తెలుగు నవలా సాహిత్యంలో ఈ శతాబ్దంలో వచ్చిన మంచి నవలల్లో 'అంటరాని వసంతం' ఒకటన్నారు విమర్శకులు, విశ్లేషకులు. అచ్చయి వచ్చిన అతికొద్ది సమయంలోనే ఎన్నో సభలు జరిగాయి. చర్చా వేదికలు జరిగాయి. సెమినార్లు పెట్టారు. డేలాంగ్ సెషన్లు జరిగాయి. విశ్వవిద్యాలయాల్లో ఎం.ఫిల్ చేశారు. పిహెచ్.డీలు చేశారు. ఆంధ్రప్రదేశ్‌లో దీనిమీద పరిశోధన జరగని విశ్వవిద్యాలయం లేదు. కొన్ని విశ్వవిద్యాలయాల్లో పాఠ్యాంశంగా కూడా పెట్టారు.



మేరీసువార్త, రూబి... నిద్రరాదు. ఎందుకో తెలీదు. కళ్ళల్లో నీళ్ళు. కసి.

## ఎల్లెడలా విరిసిన వసంతం







అంటరాని వసంతం తమిళ అనువాదం, దానిపై జరిగిన చర్చతో వెలువడిన విమర్శల సంకలనం

'అంటరాని వసంతం' మొదటగా తమిళంలోకి 'తీన్‌దాదవసందం' పేరుతో అనువాదమైంది. మూడునెలల్లో రెండు ప్రింట్లు వచ్చింది. దానిమీద సమీక్షపుస్తకం కూడా వచ్చింది. తమిళనాడులో సెమినార్లు పెట్టారు. బోలెడు చర్చ జరిగింది. గొప్పగా ఆదరిస్తున్నారు. కన్నడంలో 'అస్పృశ్య వసంతం' పేరుతో సుప్రసిద్ధ కన్నడ పత్రిక 'లంకేష్'లో సీరియల్‌గా వస్తోంది. సీరియల్ అయ్యాక పుస్తకంగా వస్తుంది. హిందీలో 'అచ్యుత వసంత్' పేరుతో అనువాదమైంది. త్వరలో అచ్చయి వస్తుంది. ఓరియంట్ లాంగ్‌మెన్‌వాళ్ళు ఇంగ్లీష్‌లో 'అన్‌టచ్‌బుల్ స్ప్రింగ్' పేరుతో తెస్తున్నారు. మరాఠీలో, బెంగాలీలో అనువాద ప్రక్రియలో వుంది.

జీవితం యిది. పోరాటం యిది. అంతకన్నా ఏదీ చెప్పలేను. నా కళ్ళముందు నలిమల కొండలు. రాత్రంతా ఆ కొండల్లో నడుస్తూనే వున్నాను.

'మీరు జెస్సీని సాయుధ పోరాటంలోకి పంపారు' అని కొందరడిగారు. నేను పంపలేదు. జెస్సీనే వెళ్ళాడు. వాళ్ళనాన్న యిమ్మానుయేలూ శ్రీకాకుళం వైపు యిష్టంగానే వెళ్ళాడు. ఆ వెళ్ళటాన్ని నేను యిష్టపడ్డాను. సాయుధ పోరాటంమీద నాకున్న నమ్మకం అది. రూతు అన్నట్టు అంతా యుద్ధమే-ప్రాణం గుప్పెట్లో పెట్టుకొని పరుగుతీసిన ఎల్లన్న మొదలు ప్రజలకోసం సాయుధమైన జెస్సీదాకా. మడవ మీద కాలుపెట్టి పార పైకెత్తిన సుభద్ర మొదలు నీళ్ళలో చేపలా జనంలో కలిసిపోయిన రూబీ దాకా. అంతా యుద్ధమే. ఆ పాత్రల జీవితం అంతా ఓ సుదీర్ఘ పోరాటమే.

అవును. యిందులో చాలా సంఘటనలు గతానివి. రూతు జ్ఞాపకాలవి. విన్నవి. అనుభవించినవి కాని రూతు మాటల్లోనే చెప్పుకొంటే గతం జ్ఞాపకం కాదు- వర్తమానం.. అంటరాని వసంతం. దళిత జీవితంలో గతం, వర్తమానం వేరు కాదు. దళిత జీవితంలో మొత్తంగా మారిందేమీ లేదు. అదే అంటరానితనం. అదే వివక్ష. అదే దాడి. అదే దోపిడి. అదే అణిచివేత. మనువు అప్పుడే కాదు. యిప్పుడూ వున్నాడు. మనుధర్మం అత్యంత ఆధునికంగా వుంది. హైటెక్ భూతంలా వుంది. కుల వివక్ష, దళితులపై దాడులు నిన్నటిమాట మాత్రమే కాదు. ఈరోజు మాట కూడా. నిజానికి యిప్పటి దాడులు చాలా క్రూరంగా వున్నాయి. సామూహికంగా వున్నాయి. కారంచేడు, చుండూరు, వేంపెంట, పొట్టిలంక, వర్తమానం సాక్షిగా జరిగిన అత్యంత క్రూరమైన దాడులే.

వివక్షకు అణిచివేతకు గురికాని దళితుడు ఈ నేలమీద ఉండడు. దానికి ఎవ్వరూ మినహాయింపుకాదు. బ్రాహ్మణీయ అగ్రకుల ఆధిపత్య భూస్వామ్యమంటేనే మనుధర్మాన్ని నూటికి నూరుపాళ్లు ఆచరించడం. రాజ్యం, అధికారం, ఆధిపత్యం అంతా వాడి క్రూరత్వమే. మనువు

# నగ్న నడక




లండన్‌లోని మెరైన్ కన్సర్వేషన్ సొసైటీ కోసం ధనాన్ని సేకరించడానికి డార్సెట్ నగరానికి చెందిన 20 మంది స్వాంగెనుంచి లవ్‌వర్త్‌కోల్ దాకా ఇరవై మైళ్ల దూరం నడిచారు-నగ్నంగా.



పద్దెనిమిదేళ్ల నుంచి 63 ఏళ్లదాకా ఆ గ్రూప్‌లో ఉన్నారు. అనేక పెట్రోలింగ్ కార్లు, ఓ హెలికాప్టర్ వీరికి ఎవరూ హానిచేయకుండా చూడటానికి, రక్షణగా అనుసరించాయి. ఊహించిన దానికన్నా ఎక్కువ పౌన్లు సేకరించగలిగారు. "దుస్తులతో నడిస్తే ఇంత వచ్చేది కాదు" అని ఆ చారిటీ ఆర్గనైజేషన్ నిర్వహించిన వ్యక్తి విలేఖరులకు చెప్పాడు.

ఏకవచనం కాదు. బహువచనం.

అగ్రకుల ఆధిపత్యానికి, బ్రాహ్మణ భావ జాలానికి అహంకారం ఎక్కువ. అహం భావం ఎక్కువ. ఈర్ష్య, అసూయ ఎక్కువ. అది దళితుల ఎదుగుదలని చూసి సహించలేదు. ఓర్వలేదు. తమకన్నా మిన్నగా ఉన్నారనుకొంటే తట్టుకోలేదు. ఒకచోట భౌతికంగా దాడి చేస్తుంది. మరొకచోట మానసికంగా దాడి చేస్తుంది. కత్తులతో తలలు నరికినా కలాలతో గుండెల్లో పొడిచినా ఆ రెండు రకాల దాడులూ ఒక్కటే. మనిషిని ముక్కలుచేసి, గోతాల్లో కుట్టి పంటకాల్వల్లో పారెయ్యడమే. అంతే. అంతకన్నా ఏదీ కాదు.

## అమ్మమ్మ చెక్కిన శిల్పం

నవల్లో వాడిన శిల్పానికి మంచి పేరొచ్చింది. నిజానికి ఆ శిల్పం తాలూకూ గొప్పతనం నాదికాదు. మా అమ్మమ్మది. ఆమెకి చదువురాదు. కాని గొప్ప కథకురాలు. బోలెడు కథలు నా చిన్నతనంలో చెప్పింది. ఆ చెప్పటంలో గొప్ప శిల్పం వుంది. దాన్నే వాడాను. గాయకుడికి శ్రోతకి, నటుడికి ప్రేక్షకుడికి వుండే అనుబంధం అది. రచయితా పాఠకుడు ఒక్కటిగా మారి ప్రయాణించే అనుభవం, అనుభూతి అది.

నేను నా జీవితాన్ని రాసుకున్నాను. నా జీవితాన్ని చదువుతూ పాఠకులు తమ జీవితాన్ని వెతుక్కొన్నారు. అదే నవలకు అంత ఆదరణ రావడానికి ప్రధాన కారణం. చరిత్రలో నా పేజీకోసం నేను వెతికినట్టే 'అంటరాని వసంతం'లో తమ పేజీకోసం వెతికారు. దొరికితే అనుభవించారు. దొరకనివాళ్లు ఎందుకు దొరకలేదని ప్రశ్నించారు. నిజానికి రాయాల్సింది చాలా ఉంది. తాకాల్సిన అంశాలు బోలెడున్నాయి. నవల చివరి మాటల్లో అన్నట్టు 'విశ్రమించింది రూతు జ్ఞాపకం మాత్రమే'. మేరీ సువార్తను కదిలించాల్సి వుంది. కదిలిస్తే 'అంటరాని వసంతం' మరోభాగం మొదలౌతుంది.'

అన్నిటికన్నా మించి ఏ దళిత జీవితాన్నయితే ఈ నవలలో ఆవిష్కరించానో ఆ దళితవర్గాలు దీనిని గుండెల్లో దాచుకొన్నాయి. పల్లెల్లో ఒకరు చదువుతుంటే చదువు రానివాళ్ళు గుంపులుగా కూర్చొని విన్నారు. నిజంగా అదో గొప్ప అనుభూతి. 'అంటరాని వసంతం' అసలైన విజయం అదే అనుకొంటాను.

సేకరణ: **దేశరాజు**

కాలాతీతం




చార్ల్స్ కింగ్స్లీ

# వెస్ట్‌వర్డ్ హో!

ఎలిజబెత్ రాణి పాలనాకాలంలో, పశ్చిమ ఇంగ్లండు తీరాన ఉన్న ప్రధాన రేవు పట్టణాల్లో ఒకటి బైడ్‌ఫోర్డ్. అక్కడే పుట్టి పెరిగిన ఏమియాస్ లెయ్‌కి సముద్రమంటే ప్రాణం. అతడి అన్న ఫ్రాంక్ రోజంతా పుస్తక పఠనంలో గడిపితే, ఏమియాస్ మాత్రం సముద్రయానం పట్ల మక్కువ పెంచుకున్నాడు. సుదూర ప్రయాణాలు చేసి వచ్చిన నావికుల సాహస గాథలు విని అతను ఆకర్షితుడయ్యాడు. వాళ్లతో కబుర్లాడుతూ తెరచాపలకు తాళ్లు బిగించడం కూడా నేర్చుకున్నాడు.

1575లో ఓ సాయంత్రం యాత్రల నుండి తిరిగి వచ్చిన జాన్ ఆక్సెన్‌హామ్, బైడ్‌ఫోర్డ్‌లోని ఒక మద్యశాలలో తన అనుభవాలను వివరిస్తుంటే శ్రోతలకు ఒళ్లు గగుర్పొడిచింది. అతడి అనుచరుడు సాల్వేషన్ యో, గేదె కొమ్ము మీద గీసిన కరేబియన్, దక్షిణ అమెరికా (స్పానిష్ మెయిన్) చిత్రపటాన్ని అందరికీ చూపించాడు. దూరం నుండి గమనించిన ఏమియాస్ ప్రాణాలకు తెగించి, యుద్ధం చేసైనా సరే ఆ కొమ్ము స్వంతం చేసుకుంటానని ప్రతిజ్ఞ చేశాడు. పదిహేనేళ్లయినా దాటని కుర్రాడు సవాలు చెయ్యటం చూసిన ఆక్సెన్‌హామ్ ఆనందానికి అవధుల్లేవు. తన చేతుల్లో ఆకొమ్ము ఏమియాస్



కు బహుమతిగా యిచ్చాడు.

ఆ తర్వాత కొద్దిరోజులకే మరో యాత్రకు సన్నాహాలు చేశాడు ఆక్సెన్‌హామ్. కొత్త యువకులకు అతడి బృందంలో అవకాశం దొరుకుతుంది. సహజంగానే ఏమియాస్ వస్తానన్నాడు. అతడి ధైర్యసాహసాల గురించి ఎవరికీ సందేహం లేదు. కాని కనీసం స్కూలు చదువైనా ముగించుకుని వెళ్తే బాగుంటుందన్నారు పెద్దలు. దాంతో అతని ప్రయాణం వాయిదా పడింది. ఓడ వెళ్లిపోయింది.

తండ్రి మరణం తర్వాత ఏమియాస్, సర్ రిచర్డ్ గ్రెన్‌విల్ అనే యోధుని పోషణలో పెరిగి యుద్ధవిద్యలన్నీ అభ్యసిస్తాడు. అన్న ఫ్రాంక్, తన చతురోక్తులతో ఎలిజబెత్ రాణి మన్నన పొందుతాడు.

ఏమియాస్ మహాగడుగ్గాయి. ఒకనాడు స్కూల్ మాస్టర్ బోడిగుండు మీద పలక పగలకొడతాడు. 'ఎందుకురా అలా చేశావంటే', ఆయన గుండు చూస్తే మీరూ అదే చేసేవారని నవ్వుతాడు. ఇలాంటి విద్యార్థి స్కూల్లో కొనసాగటంకన్న సముద్రం మీద పోవటమే అందరికీ శ్రేయస్కరమంటాడు గ్రెన్‌విల్. అయితే అప్పటికే ఏమియాస్ మనసును ఆ ఊరి సుందరి రోజ్ సాల్టర్న్ దోచుకుంది. ఆ పిల్లకన్న అందమైనవాళ్లూ వున్నారని ఎవరో అంటే వాణ్ణి ఎత్తి రేవులోకి విసిరేశాడు. ఏమియాస్ మహాకాయుడు. 'హెర్క్యులిస్‌లాంటి ఈ శరీరానికి కాస్త శ్రమ కూడా అవసరమే' అనుకుని, గ్రెన్‌విల్, వాణ్ణి ప్లిమౌత్‌లోని కెప్టెన్ ఫ్రాన్సిస్ డ్రేక్‌కు అప్పగించి మూడేళ్లపాటు యాత్రలమీద తీసికెళ్లమంటాడు.

★ ★ ★

యాత్రలు ముగించుకుని వచ్చిన ఏమియాస్ బృందానికి బైడ్‌ఫోర్డులో ఘనస్వాగతం లభించింది. తమ్ముడికి అభినందనలు తెలపటానికి ఫ్రాంక్ ముందువరుసలో




నిలబడ్డాడు.

కాని ఆ విజయోత్సాహంలో ఏమియాస్‌ను రెండు విషయాలు కలవరపెట్టాయి. ఒకటి ఆక్సెన్‌హామ్ వెంటవెళ్లిన సాల్వేషన్ యో జాడ తెలియలేదని అతడి వృద్ధమాత విలపించింది. మరొకటి ఆ జనసందోహంలో రోజ్‌సాల్టర్న్ కనిపించలేదు. తండ్రి ఆమె కదలికలమీద ఆంక్ష పెట్టడం వల్ల తన వరుడెవరో తెలుపమని ఒక మంత్రగత్తెను సంప్రదిస్తుంది రోజ్.

ఏమియాస్‌ది రోమన్ కాథలిక్కుల సంప్రదాయం. తన కజిన్, తమ శత్రువులైన మరో సంప్రదాయాన్ననుసరించే జెసూట్‌లతో జతకట్టాడని తెలిసి మందలించటానికి ప్రయత్నిస్తాడు ఏమియాస్. అప్పటికే కొందరు జెసూట్‌లు యుద్ధం చేసే వుద్దేశంతో ఇంగ్లండు తీరానికి చేరుకున్నారు. తీర రక్షణకోసం రిచర్డ్ గ్రెన్‌విల్ ప్రయత్నాలు ప్రారంభిస్తాడు. మరో ఎనిమిదివందల స్పెనియార్డులు ఐర్లండుకు చేరుకున్నారని తెలుస్తుంది.

ఈలోగా తను ప్రేమిస్తున్న రోజ్‌సాల్టర్న్‌నే, తన అన్న ఫ్రాంక్ కూడా ఇష్టపడ్డాడని తెలిసి హతాశుడవుతాడు. అకళంక దేశభక్తుడైన ఏమియాస్ ప్రేమసల్లాపాలకన్నా, శత్రుసంహారమే ముఖ్యమని ఐర్లండుకు బయల్దేరుతాడు. దారిలో తారసపడిన సాల్వేషన్ యో, ఆక్సెన్‌హామ్‌ను

# చార్ల్స్ కింగ్స్లీ

**1819 - 1875**

ప్రముఖ ఆంగ్ల రచయిత చార్ల్స్ కింగ్స్లీ తండ్రి మతాధికారి. చదువుల్లో బాగానే రాణించి, కేంబ్రిడ్జిలోని మాగ్డలేన్ కాలేజీలో విద్యాభ్యాసం కొనసాగించినా, చార్ల్స్ క్రీడల మీదే ఎక్కువ ఆసక్తి కనబరిచాడు. పట్టభద్రుడై, ప్రీస్టుగా వుద్యోగం సంపాదించి, 1842లో ఎవర్స్లీలో రెక్టార్ బాధ్యతలు కూడా నిర్వర్తించాడు. ఈయన బహుముఖ ప్రజ్ఞాశాలి. పేదరికాన్నీ, సామాజిక అసమానతలనూ నిర్మూలించాలనే ఉద్దేశంతో 'క్రిస్టియన్ సోషలిజం' ఉద్యమం ప్రారంభించాడు. అందులో భాగంగా వ్యాసాలూ, ఆల్టన్‌లాక్ (1850), ఈస్ట్ (1851) నవలలు ప్రచురించాడు. అయితే ఈ కృషిలో క్రైస్తవమే ఎక్కువ, సోషలిజం తక్కువన్నారు విమర్శకులు.

చార్ల్స్, 1853లో 'హైపేషియా' చారిత్రక నవల, 1855లో జీవశాస్త్రాన్ని అధ్యయనం చేసి 'గ్లాకస్' రాశాడు. 1858లో కవితా సంకలనం 'ఆంద్రామెడా' ప్రచురించాడు. బాల సాహిత్యంలో ఆయన స్థానం సుస్థిరం. 1863నాటి 'ది వాటర్ బేబీస్' నేటికీ పిల్లలకు యిష్టమైన కథ.

1860లో చార్ల్స్ కేంబ్రిడ్జిలో 'ఆధునిక చరిత్ర' ప్రొఫెసర్‌గా కూడా చేశాడు. ఈ రచయితకు పందొమ్మిదో శతాబ్దంలో అత్యంత పాఠకాదరణ సంపాదించిపెట్టిన చారిత్రక నవల 'వెస్ట్‌వర్డ్ హో!'. మొదటి ఎలిజబెత్ రాణి కాలంలో 'జరిగిన' ఈ సాహసగాథ తరతరాల పాఠకులను అలరి

స్పెనియార్డులు వురితీశారని చెబుతాడు. ఇది శరాఘాతంలాంటి వార్త. ఎంతటి సాహసవీరుడైనా, ఒంటరిగా యుద్ధానికి బయల్దేరటమంటే ఆత్మహత్యాసదృశమే. బైడ్‌ఫోర్డులో వున్న రోజ్ అభిమానులతో ఒక 'బ్రదర్‌హుడ్ ఆఫ్ రోజ్' బృందాన్ని (ఫ్రాంక్ సాయంతో) ఏర్పరచి దేశరక్షణ కోసం బయల్దేరతాడు.

స్మెర్విక్‌వద్ద భీకర యుద్ధం జరుగుతుంది. ఆ స్పానిష్ ముష్కరులందర్నీ పరలోకాలకు పంపించి, వాళ్ల నాయకుడు 'డాన్ గజ్‌మాన్ మారియా మాగ్డాలేనా సోటో మేయర్ డిసోటో'ను రిచర్డ్‌గ్రెన్‌విల్‌కు బందీగా పంపుతాడు ఏమియాస్. యుద్ధం యింకా ముగియలేదు. రణరంగంలో మరింత ముందుకు పురోగమిస్తాడు. 'బ్రదర్‌హుడ్ ఆఫ్ రోజ్' సభ్యులందరూ ఐర్లండ్‌లో వుండటంవల్ల, రోజ్ అభిమానాన్ని పొందటానికి గజ్‌మాన్‌కు పోటీ లేకుండా పోయింది.

యూస్టేస్, దేశద్రోహ కార్యకలాపాల్లో విదేశీయులతో కుమ్మక్కయ్యాడు. స్పానిష్ మెయిన్‌లో వలసలు ఏర్పరచుకోవటానికీ, అక్కడి రహస్యాలు తెలుసుకోవటానికీ, ఎలిజబెత్ ఆస్థానంలో వున్న చరిత్రకారుడు, యాత్రికుడు, రచయిత, కవి అయిన సర్‌వాల్టర్ రాలేతో చర్చిస్తాడు. 'ఇంకాస్' నగరాన్వేషణలో తన ప్రస్థానం ప్రారంభిస్తాడు ఏమియాస్.

డాన్‌గజ్‌మాన్, రోజ్‌సాల్టర్న్‌ల మధ్య ఆకర్షణ పెరుగుతుంది. వీళ్ల సాన్నిహిత్యాన్ని ఆమోదించని ఏమియాస్ కుటుంబ సన్నిహితుడు విల్ కేరీ, గజ్‌మాన్‌ను మల్ల యుద్ధానికి ఛాలెంజి చేస్తాడు. కాని వాడు ఆ రాత్రే రోజ్‌సాల్టర్న్, 'సోది' చెప్పిన మంత్రగత్తెతో సహా అదృశ్యమవుతాడు.

కొన్నాళ్లకు సముద్ర యాత్ర నుండి తిరిగి వచ్చిన ఏమియాస్, డాన్‌గజ్‌మాన్

స్తూనే వుంది. నేటికీ దీని పాపులారిటీ తగ్గలేదు.

ఈ నవల ప్రేరణతోనే బైడ్‌ఫోర్డ్ సమీపాన వున్న గ్రామానికి 'వెస్ట్‌వర్డ్ హో!' అని పేరు పెట్టారు. పేరులోనే ఆశ్చర్యార్థకం వున్న ఒకే ఒక్క ఇంగ్లీషు గ్రామమిది. ప్రముఖ బ్రిటిష్ రచయిత, నోబెల్ గ్రహీత రుడ్యార్డ్ కిప్లింగ్ బాల్యం గడిచిందిక్కడే. ఈ నవల పేరు ఇంగ్లీషు భాషల్లో చేరిపోయింది. అమెరికాకు లేదా పశ్చిమదేశాలకు వలసవెళ్లటాన్ని 'వెస్ట్‌వర్డ్ హో!' అంటారు. ఇదొక సాహస గాథ. హాలీవుడ్ యాక్షన్ సినిమాలా, ప్రతిపేజీలో యుద్ధవర్ణనలు, హీరో సాహసకార్యాలు, కుట్రలు, కుతంత్రాలతో సాగుతుంది. సాహసాలను ఇష్టపడేవారికోసం అప్పట్లోనే అల్లిన మాయజలతారు ఇది.

తప్పించుకుని పోయాడని తెలిసి ఖిన్నుడవుతాడు. తన కూతుర్ని ఎలాగైనా రక్షించమని ఏమియాస్‌ను ప్రాధేయపడతాడామె తండ్రి. అంటే మళ్లీ ప్రయాణం తప్పదు.

అయితే అప్పటికే బ్రిటీష్ రాణి అనుమతితో తనూ యాత్రలు చెయ్యడానికి సిద్ధపడతాడు ఫ్రాంక్. మంచి ఓడ నిర్మించుకోవడమే తరువాయి.

★ ★ ★

ప్రత్యేకంగా ఎంపిక చేసిన సిబ్బందితో, 1583 నవంబర్ మధ్యలో రోజ్ (ఓడ పేరు), అట్లాంటిక్ మహాసముద్రం మీద మంచుతెరల్లోకి ప్రవేశించింది. బార్బడోస్‌లో లంగర్ వేసినప్పుడు ఫ్రాంక్, విల్ కేరీ అక్కడి సుందరాంగులను తనివితీరా వీక్షించారు. గ్రెనాడాలో చిన్నపాటి యుద్ధం జరిగింది. స్పానిష్ దుండగులతో పోరాడి మంచిముత్యాలు సంపాదించారు. మాతృదేశంమీద దాడి చేసిన స్పానిష్‌వాళ్లకు బుద్ధి చెప్పటమే తన ధ్యేయమన్నాడు ఏమియాస్.

ఇంగ్లండ్ నుండి పారిపోయిన డాన్ గజ్‌మాన్ లాగేరా ఒక నగరానికి గవర్నర్‌గా ఉన్నాడని తెలిసింది. రోజ్‌లోని యోధులందరూ తక్షణమే యుద్ధం చేస్తామన్నారు. కాని అప్పటికే వందలాది స్పానిష్ యుద్ధనౌకలు లాగేరాకు రక్షణ కవచంలా నిలిచాయి. తాము గెలిచే అవకాశం లేదు. కనీసం ఎలాగైనా లోపలికి ప్రవేశించి, రోజ్‌తో మాట్లాడగలిగితే చాలనుకున్నాడు ఫ్రాంక్.

ఒంటరిగా వెళ్లొద్దని వాదించాడు ఏమియాస్. చివరికి ఫ్రాంక్‌ను అనుసరించక తప్పలేదు. అక్కడ యూస్టేస్‌కు బందీగా ఉంది రోజ్. పెళ్లి చేసుకోకపోతే చిత్రహింసలు పెడతానని బెదిరిస్తున్నాడానీచుడు.

రోజ్ కెవ్వున కేక వేయడంతో కాపలావాళ్లు పరిగెత్తుకు వచ్చారు. ఏమియాస్ ముందుకు లంఘించాడు. కాని యూస్టేస్ తప్పించుకున్నాడు. ఫ్రాంక్ తన ప్రేయసి రోజ్‌తో ఒకటి రెండు మాటలు మాట్లాడగలిగాడు. కాని క్షేమంగా వెనుతిరగడం అసాధ్యం.

మహాకాయుడు, అపర హెర్క్యులిస్ ఏమియాస్ కొదమసింహంలా శత్రువులను ఎదిరించాడు. 'డాన్ గజ్‌మాన్ నిస్సందేహంగా దుర్మార్గుడే. కాని అతడు రోజ్ భర్త!'. వాడికేమైనా జరిగితే ఆమె బాధపడవచ్చునని అంతటి దుర్మార్గుణ్ణి క్షమించి వదిలేసాడు ఏమియాస్. ఆ తర్వాత ఆ కోటనుండి ఉపసంహరించుకుంటున్నప్పుడు, ఒక పెద్ద రాతి బండ తగిలి నేల కొరిగిన ఫ్రాంక్‌ను భుజాలమీద ఎత్తుకొని పడవదాకా తీసుకొచ్చాడు. కాని ఒక స్పానిష్ సైనికుడు అడ్డగించటంతో అతణ్ణి అక్కడే జారవిడవక తప్పలేదు. మర్నాడు 'రోజ్' మీద పెద్ద సముద్ర యుద్ధం జరి







గింది. అన్నను శత్రువులకప్పగించిన దుఃఖంతో రాత్రంతా విలపించిన ఏమియాస్ సూర్యోదయం కోసం అసహనంగా నిరీక్షించాడు. ఎలాగైనా లాగేరాను ముట్టడించాలి. తాను సిద్ధమని ప్రకటించాడు.

తను డ్రేక్ వద్ద నేర్చుకున్న యుద్ధ విద్యను వృథా చేయలేదు ఏమియాస్. ఇంగ్లీషు వీరుల ధైర్య సాహసాలను శత్రువులకు రుచి చూపించాడు. ఆయుధాలలో స్పెనియార్డులదే పైచేయి అయినప్పటికీ, తమ వద్దవున్న తొలితరం తుపాకులనే నేర్పుగా వుపయోగించి శత్రువ్యూహాన్ని ఛేదించారు ఇంగ్లీషు యోధులు.

ఇరువైపులా కాల్పులతో సముద్రం మీద తెల్లని పొగ వ్యాపించింది. తుపాకుల మోతతో చెవులు గింగుర్లెత్తాయి. ఇంగ్లీషు బాణాలు శత్రు సైనికుల శరీరాలను జల్లెడలుగా తూట్లు పొడిచాయి. యుద్ధం ముగిసే సరికి మేడ్రె డోలరోసా మీద అలంకరించిన ఏడు ఖడ్గాల చిహ్నం మసకబారింది. అప్పటిదాకా వెలుగులు చిమ్మిన స్పానిష్ పతాకం నీటిమీద తేలియాడింది. మరికాసేపటికి నావికులు లేని నావ గాలివాటంతో దూరంగా కదిలిపోయింది.

అయినా అదంతా స్పానిష్ దేశం. శత్రువులు తమను వెంటాడే ప్రమాదముంది. వాళ్లను దారి మళ్లించటానికి, ఒక కాలువలో కొంత దూరం ప్రయాణించి రోజ్‌ను తగలబెట్టాడు సాల్వేషన్ యో.

చీకటిపడింది. అక్కడి బురద నీళ్లలో వింత శబ్దాలు వినిపించాయి. అవి మొసళ్లు ప్రాణాలరచేత పట్టుకుని లేళ్లూ, దుప్పులూ నిస్సహాయంగా పరిగెత్తాయి. మురికినీళ్లు తాగటంవల్ల, త్వరలోనే, అందరికీ పచ్చకామెర్ల వ్యాధి సోకింది.

మరింత ఆలస్యం చేస్తే మృత్యువాత తథ్యమని గ్రహించిన ఏమియాస్ తన అనుచరులతో కొండదారి పట్టాడు. పసిఫిక్ తీరం చేరితే తప్ప కష్టాలు తీరవు.

దైవదూషణ నేరానికి ఫ్రాంక్, రోజ్ సాల్టర్న్‌ల మీద విచారణ జరిగింది. నేర నిరూపణ జరిగి, కార్టాజెనాలో యిద్దర్నీ సజీవదహనం చేశారు. మధ్యయుగాలలో మతాధికారులు యిలాంటి దుశ్చర్యలకు పాల్పడిన దృష్టాంతాలనేకం.

ఏమియాస్ బృందం, మూడేళ్ల పాటు, 'ఒరినాకో' తీరం వెంబడి, అమెజాన్ పరీవాహ ప్రాంతంలో స్వర్ణనగరం, 'ఇంకాస్' కోసం అన్వేషించారు. దారిలో అగ్నికీలలు విరజిమ్మే కోటోపాక్సీ వాళ్లక్కనిపించింది. రమోనెగ్రోలో, ఆండీస్‌లో దుస్సాహసాలు చేసి కొందరు మరణించారు. చివరికి 'కార్డిలెరా' వద్ద సమావేశం జరిపి సముద్రం దిశగా కదలాలని నిర్ణయించారు. నదీ ప్రవాహంలో తెప్ప నడిపిన ఏమియాస్‌కు ఆయాకనోరా అనే సుందరి దర్శనమిచ్చింది. ఆమె స్థానిక ఇండియన్‌లా లేదు. ఈ వీరులకు స్వాగతం పలికి తమ గూడేనికి తీసుకెళ్లింది. అక్కడి ఆటవికులు ఆమెను దేవతలా పూజిస్తారు. సాంటాఫే ఎగువన వున్న ఆ ప్రదేశంలో ఏమియాస్ తన అనుచరులతో కొన్ని నెలలు సుఖంగా విశ్రమించాడు.

ఒకనాడు ఒక ఇండియన్ వచ్చి స్పానిష్ స్వర్ణ శకటం వస్తున్నదని చెప్పాడు. ఇది మంచి అవకాశం. తామింత దూరం వచ్చిందే యిందుకు. కొద్దిపాటి ఘర్షణతో ఆ శకటాన్ని స్వాధీనం చేసుకుంటారు. ఇండియన్ సుందరి ఏమియాస్ వెంటవస్తానంటుంది. కాని ఆమె ఎంత వేడుకున్నా స్పందించడు ఏమియాస్. ప్రేమ ఫలించదు. ఆ సుందరి ఆత్మహత్య చేసుకోకుండా రక్షిస్తాడు సాల్వేషన్ యో.

ఇక ఆమెను నివారించి ప్రయోజనం లేదని వెంట తీసుకెళ్లటానికే అంగీకరి

స్తారు. అందరికీ ఆమె సోదరి-

మళ్లీ ప్రయాణం ప్రారంభమవుతుంది. న్యూగ్రెనాడా వద్ద సముద్రం కనిపిస్తుంది. అక్కడే 'సిటీ ఆఫ్ ది ట్రూక్రాస్' అనే గొప్ప నౌక కార్టాజెనా మతాధికారి, లార్డ్ బిషప్ అధీనంలో వుంటుంది. ఏమియాస్, యితరులను చూసి ప్రతిఘటించకుండా స్వచ్ఛందంగా లొంగిపోతాడతడు.

అయితే షిప్పులో అనేక మంది నిరుపేదలను బలవంతంగా దాచివుంచినట్లు తెలుస్తుంది. అందరూ అకలితో అలమటిస్తున్నారు. సజీవదహనానికి సిద్ధమైన ఒక స్త్రీ కూడా రోదిస్తూ వీళ్ల కాళ్లమీద పడుతుంది. ఆమె లూసీ పాస్‌మోర్ (బైడ్‌ఫోర్డ్‌లో రోజ్‌సాల్టర్న్ సంప్రదించిన మంత్రగత్తె). బిషప్‌నూ, అతడి అనుచరుడినీ తక్షణమే వధించి నౌకను ఇంగ్లాండువైపు మళ్లిస్తాడు ఏమియాస్.

ఆ సుదీర్ఘ ప్రయాణంలో, తోటి ప్రయాణికుల సాంగత్యంలో ఇంగ్లీషు నేర్చుకుంది ఆయాకనోరా. ఆమె జాన్ ఆక్సెన్‌హామ్‌కూ, ఒక స్పానిష్ స్త్రీకీ కలిగిన సంతానమని తరువాత తెలుస్తుంది.

ఎట్టకేలకు యింటికి చేరిన ఏమియాస్, తల్లి కాళ్లను తన కన్నీళ్ళతో కడుగుతూ, అన్నను రక్షించలేకపోయినందుకు క్షమించమని వేడుకుంటాడు.

రోజ్ సాల్టర్న్ లేచి పోలేదు. గజ్‌మాన్‌ను పెళ్లి చేసుకుని వెళ్లింది. తన పరువు కాపాడిందని తెలిసి ఆమె తండ్రి సంతోషిస్తాడు. గజ్‌మాన్ మీది ప్రతీకారంతో రగిలిపోయినా తల్లిదండ్రుల కోసం యింటి వద్దే వుండాలనుకుంటాడు ఏమియాస్. ఆయాకనోరాకు అతడి మీద ప్రేమ పెరిగింది. తల్లి కూడా ఆమెను కోడలిగా చేసుకోవాలనుకుంటుంది. 'కాని ఆమెలో స్పానిష్ నెత్తురు ప్రవహిస్తున్నది. పెళ్లికి అంగీకరించ'నంటాడు ఏమియాస్.

ఈలోగా వర్జీనియాలో కాలనీ ఏర్పాటు చెయ్యమని సర్ వాల్టర్ రాలేని ఆదేశిస్తుంది ఎలిజబెత్ రాణి.

ఏమియాస్ కూడా ఆ బృందంలో చేరతాడు. స్పానిష్ దుండగుల నుండి దాన్ని కూడా రక్షించాలి. డ్రేక్ అందరికీ శిక్షణ తరగతులు నిర్వహిస్తాడు. కాలక్రమేణా ఇంగ్లీషు సంస్కారమూ, వేషభాషలూ అలవరుచుకొని, ఆయాకనోరా 'లేడీ'గా మారిపోతుంది.

కొత్త యుద్ధనౌక హార్బర్ నుండి బయల్దేరుతుంది. 'సాంటా కాథరినా' అనే స్పానిష్ ఓడకు డాన్‌గజ్‌మాన్ కమాండర్‌గా వున్నాడని డ్రేక్ రహస్య వర్తమానం పంపిస్తాడు.

త్వరలోనే రెండు నౌకలూ తలపడతాయి. అనేక రోజులు యుద్ధం కొనసాగుతుంది. ఇరువైపులా అపారనష్టం జరుగుతుంది. సాంటా కాథరినా బ్రిస్టల్ ఛానెల్‌లోకి ప్రవేశిస్తుంది. దాన్ని వెన్నంటి లండీ ద్వీపం వద్ద డాన్‌గజ్‌మాన్‌ను ట్రాప్ చేస్తాడు ఏమియాస్. కాని వాయువ్య దిశనుండి వీచిన తుఫాను గాలులకు సాంటా కాథరినా వశం తప్పి సుడిగుండాల్లో కొట్టుకుపోతుంది.

చేతుల్లో చిక్కిన శత్రువును పట్టుకోలేకపోయినందుకు తన అశక్తను నిందించుకుంటాడు ఏమియాస్. అంతలో అతడి మీద పిడుగుపడి అంధత్వం ప్రాప్తిస్తుంది. లండీ శిఖరాలు దిగి తచ్చాడుతూ, నెమ్మదిగా యింటికి చేరుకుంటాడు ఏమియాస్. ప్రతీకార జ్వాలలు ప్రత్యర్థులనే కాదు, తననూ దహిస్తాయని తెలుస్తుంది. నిస్సహాయంగా బతుకీడుస్తున్న ఆ మహావీరునికి ఆయాకనోరా చేతుల్లో సాంత్వన లభించింది. 'పోగొట్టుకున్నది కొంత. దొరికింది కొండంత' అనుకున్నాడు ఏమియాస్.

**- ఎం.వసంత**








# మహా మానవతావాది

**(1889-1977)**

**అతడు తన సినిమాల్లోని సంభాషణల్లో గొప్ప రచయితలకంటే మిన్నగా మానవాళి ఆవేదనలకు వాగ్రూపమిచ్చాడు. తన నటనతో ప్రపంచ ప్రజల మనసులను దోచుకొన్నాడు. కళాకారులు ప్రజా ఉద్యమాలతో మమేకమైతే ఎంత మహోన్నత కళాసృష్టి చేయవచ్చో చేసి చూపించాడు. అంతేకాదు హిట్లర్‌ను సైతం విమర్శిస్తూ 'గ్రేట్ డిక్టేటర్' సినిమా తీశాడు. అతడెవరో కాదు.. చార్లీ చాప్లిన్ ! ఆ సినిమాలో చాప్లిన్ రెండు విభిన్న పాత్రల్లో నటించాడు. ఒకటి హిట్లర్‌ది, రెండోది యూదు మంగలిది. అధికారులు యూదుమంగలిని హిట్లర్‌గా పొరబడి పెద్ద సైనిక కవాతులో ప్రసంగించమని కోరతారు. అప్పుడతను ఇచ్చిన సందేశం అందరినీ ముక్కున వేలేయిస్తుంది. యుద్ధోన్మాదులను గంగవెర్రులెత్తిస్తుంది.. ఆ సందేశం నేటి నేతలకూ కనువిప్పు కలిగిస్తుందంటారు విమర్శకులు. అదేంటో మీరే చదవండి..**

"క్షమించండి, నేనొక చక్రవర్తిని కావాలనుకోవటం లేదు. నాకు ఎవరినైనా జయించాలనో, పాలించాలనో లేదు. అది నా పనికాదు. యూదు, యూదేతరుడు, నల్లవాళ్లు, తెల్లవాళ్లు.. అందరికీ సాయం చేయాలనుకునేవాణ్ణి.

మనమందరం పరస్పరం సాయం చేసుకోవాలనుకుంటాం. మానవ నైజమే అంత. ఇతరుల ఆనందాన్ని చూసి సంతోషిస్తామేతప్ప సాటి మనిషి దుఃఖాన్ని చూడాలనుకోం. పరస్పరం ద్వేషాన్ని, చులకన భావాన్ని పెంచుకోవాలనుకోం. ఈ ప్రపంచంలో అందరికీ చోటుంది. ఈ భూమి సిరులతో నిండి, అందరికీ కావాల్సిన సకల సౌభాగ్యాలను సమకూర్చగలదు.

జీవిత మార్గం స్వేచ్ఛామయం, సౌందర్యభరితం. అయితే మనం దారితప్పాం. దురాశ మానవ మనస్సులను విషతుల్యం చేసింది. ప్రపంచంలో ద్వేషమనే అడ్డుగోడను నిర్మించింది. అది మనల్ని బాధల్లోకి, రక్తపాతంలోకి నెట్టింది. మనం వేగాన్ని పెంచి మనల్ని అందులోనే బంధించుకున్నాం. యంత్రాలు సమృద్ధిగా ఇస్తున్నప్పటికీ మనం మాత్రం దారిద్ర్యంలోనే మగ్గుతున్నాం. మన విజ్ఞానం మనల్ని విరక్తుల్ని చేసింది. తెలివితేటలు నిర్దయ పాషాణాలుగా తయారు చేశాయ్. మనం ఎంతో ఆలోచిస్తాంకానీ అతికొద్దిగా స్పందిస్తున్నాం. యంత్రాలకన్నా మనకు మానవత్వం అవసరం. తెలివితేటలకంటే దయాగుణం అవసరం. ఈ ఉదాత్త భావాలు లోపిస్తే జీవితం హింసాత్మకమై సమస్తం కోల్పోతాం.

విమానం, రేడియో మనల్ని సన్నిహితం చేశాయి. ఇవి మనిషిలోని మంచితనాన్ని, విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని, ఐక్యతా తపనని చాటుతు

న్నాయి. ఇప్పటికిప్పుడు నా మాట ప్రపంచంలో లక్షలాదిమందికి వినిపిస్తున్నది. లక్షలాది నిస్స హాయులైన స్త్రీ పురుషులు, పిల్లలు నేటి వ్యవస్థ విధానానికి బలయిపోయి, బాధలకు లోనవుతూ, జైళ్లల్లో మగ్గుతున్నారు. నిరాశ చెందకండి! మానవాళి పురోగమనాన్ని ఓర్వలేనివాళ్ల దౌష్ట్యం వల్లనే విషాదచ్ఛాయలు, దురాశనీడలు అల ముకున్నాయి. మనలోని ద్వేషం నశిస్తుంది. నియంతలు చస్తారు. ప్రజలనుండి లాక్కొన్న అధికారం వారికే సిద్ధిస్తుంది. ఆత్మార్పణలకు, బ లిదానాలకు మానవులు వెరవనంతవరకూ స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు ఎప్పటికీ నాశనం కావు.

సైనికులారా! మిమ్మల్ని ఏహ్యభావంతో చూస్తూ బానిసలుగా మార్చిన ఈ దుర్మార్గులకు తోడ్పడకండి. వారు మీరేం చేయాలో, ఏమాలో చించాలో, ఎలా ఉండాలో క్రమశిక్షణతో నేర్పు తారు. మీకింత తిండి పడేసి కవాతు చేయిస్తు న్నారు. మిమ్మల్ని పశువులుగా చూస్తూ ఫిరంగి మందుగా ఉపయోగించుకుంటున్నారు. సహజ మానవ స్వభావానికే వ్యతిరేకులయిన వారికి తోడ్పడకండి. యంత్రపు మెదళ్లు, యంత్రపు హృ దయాలున్న యంత్ర మానవులు వాళ్లు. వాళ్లకి మానవత్వం లేదు. మీరు యంత్రాలు కారు, మ నుషులు! మానవత్వాన్ని గుండెనిండా నింపుకు న్నవాళ్లు. మీరు అసహ్యించుకోరు. ప్రేమని పొందనివాడే ఇతరులను ద్వేషిస్తాడు.

సైనికులారా! బానిసత్వంకోసం పోరాడకండి! స్వేచ్ఛకోసం పోరాడండి. సెయింట్ ల్యూక్ 17వ అధ్యాయంలో భగవంతుని సామ్రాజ్యం మనిషి లోనే ఉందన్నాడు. కేవలం ఒక్క మనిషిలోనే కా దు. అందరిలోనూ ఉంది. అది మీలోనే ఉంది. మీకందరికీ యంత్రాలను తయారుచేసే శక్తివుం ది, ఆనందాన్ని సృష్టించే సామర్థ్యం వుంది. ఈ జీవితాన్ని స్వేచ్ఛామయంగా, సౌందర్యభరితంగా, సాహసోపేతంగా తీర్చిదిద్దుకునే శక్తి మీకేవుంది. అందుకని ప్రజాస్వామ్యం కోసం ఆ శక్తిని ఉప యోగిద్దాం. సమైక్యంకండి. ప్రతిమనిషికీ పని చేసే అవకాశం, యువతకు భవిష్యత్తు, వృద్ధు లకు భద్రత కల్పించే మహోన్నత ప్రపం చంకోసం పోరాడుదాం.. ఇవన్నీ ఇస్తామని ప్రమాణాలు చేసి ఈ దుర్మార్గులు గద్దెనెక్కారు. వాళ్లు అబద్ధాలు చెప్పారు. తమ వాగ్దానాలను వారు ఎన్నటికీ నెరవేర్చరు. నియంతలు తాము స్వేచ్ఛననుభవిస్తూ ప్రజల్ని బానిసలుగా మారుస్తారు. ఇప్పుడు మనమందరం ప్రపంచ వి ముక్తికోసం- దేశ సరిహద్దులతో నిమిత్తంలేని, దురాశ, ఏహ్యత, అసహనానికి తావులేని, సహే తుకంగా ఆలోచించగల ప్రపంచంకోసం పోరా డుదాం. ఆ లోకంలో విజ్ఞానశాస్త్రం, ప్రగతి సర్వమానవాళి ఆనందానికి దారి చూపుతాయి. సైనికులారా! ప్రజాస్వామ్యం కోసం ఏకంకండి.

హన్నా (యూదుమంగలి ప్రియురాలు) నా మాటలు విన్పిస్తున్నాయా? నువ్వెక్కడున్నా ఓసా రి పైకిచూడు హన్నా! కారుమబ్బులు తొలగిపో తున్నాయి. సూర్యోదయమవుతోంది. మనం చీక టినుండి వెలుగులోకి.. కొత్త ప్రపంచంలోకి.. ప్రవేశిస్తున్నాం. అది దయతో కూడిన లోకం. అక్కడ అందరూ దురాశనూ అమానుషత్వాన్నీ ఏహ్యతనూ జయించినవాళ్లే. పైకిచూడు హన్నా! మానవాత్మకు రెక్కలొచ్చాయి. చాలాకాలం తర్వాత అతడు ఎగరగలుగుతున్నాడు. ఇంద్రధ నస్సులోకి, ఆశావహ కాంతిమయ జీవితంలోకి, మనందరికీ చెందిన ఉజ్వల భవిష్యత్తులోకి ఎగురుతున్నాడు. చూడు హన్నా! పైకి చూడు!"

ఇదే ఆ సందేశం! ఓ నియంత పాత్రతో గొప్ప సందేశాన్నిప్పించి ప్రపంచప్రజల్ని చకితుల్ని చేశా డు చాప్లిన్. మానవాళిపై అంతులేని ప్రేమతో అనేక కష్టాలకోర్చి అతను తీసిన 'ది గ్రేట్ డిక్టే టర్' 1940లో న్యూయార్క్‌లో విడుదలై సంచల నం సృష్టించింది. హిట్లర్ జీవించి ఉన్నకాలంలో నే ఈ సినిమా తీయడం సాహసం. అందులో హిట్లర్ ప్రసంగించే రీతి రివాజులను, నడక, నియమాలన్నింటినీ అవహేళన చేశాడు చాప్లిన్. రెండో ప్రపంచ యుద్ధం ప్రారంభంలోనే చి వరకు నియంతలకు ఓటమి తప్పదని తన సిని మా ద్వారా చెప్పాడతను.

1889 ఏప్రిల్ 16న జన్మించిన చార్లీ ఎనభైకు పైగా సినిమాల్లో నటించాడు. సాధారణ రీతికి భిన్నమైన దుస్తులతో, వంకరటింకర నడకతో, చేతికర్రతో, తనకంటూ ఓ గూడులేని దేశదిమ్మరి పాత్రను సృష్టించాడు. ఆ పాత్ర తన పనులతో కడుపుబ్బా నవ్విస్తుంది. నవ్వుతోపాటే దాని వెను కనున్న జీవిత వాస్తవికత, విషాదం అలలు అల లుగా పొర్లుకొచ్చి ప్రేక్షకుల కంటతడి పె ట్టిస్తుంది. మోడర్న్ టైమ్స్, ది కిడ్, గోల్డ్‌రష్, సర్కస్, సిటీలైట్స్, గ్రేట్ డిక్టేటర్, లైమ్‌లైట్, సోల్జర్ ఆర్మ్స్, మన్స్యూవర్‌డెక్స్ తదితర గొప్ప దృశ్యకావ్యాల్ని నిర్మించిన చాప్లిన్ ఈ లోకంలో మానవతావాదం ఉన్నంతవరకూ చిరంజీవిగా వ ర్ధిల్లుతాడు.

*( డిసెంబరు 25న చార్లీ చాప్లిన్ వర్ధంతి)*

**-కె.రఘు**






**రా**మ్ వెళ్లేసరికి మధు ట్యాంక్‌బండ్ మీద పచార్లు చేస్తున్నాడు. మనిషిలో గొప్ప ఉత్సాహం కన్పిస్తోంది..

'ఏమిట్రా ఎటూకాని వేళ అర్జంటుగా ఇక్కడికి రమ్మని ఫోన్‌చేశావ్?'

'అర్జంటే మరి.. ఓ గొప్ప విషయం జరిగింది.. జరిగింది కలా? నిజమా ఇప్పటికీ తేల్చుకోలేకపోతున్నా..'

'నసపెట్టక విషయం చెప్పు' విసుక్కున్నాడు రామ్. ఏం జరిగిందో తెలుసుకోవాలనే ఉత్సుకత అతని విసుగులో ధ్వనించింది.

'మిత్రుడివికదా నా సంతోషాన్ని పంచుకోవాలనే నిన్ను పిల్చాను' అంటూ జరిగిందంతా ఇలా పూస గుచ్చాడు మధు.

★ ★ ★

ఇవ్వాళ ఉదయాన్నే ఎప్పటిలా నక్లెసురోడ్డుకు వాకింగ్‌కు వచ్చాడు మధు. వేగంగా నడుచుకుంటూ పోతున్న అతని దృష్టి నాలుగడుగుల దూరంలో మెరుస్తున్న గులాబీరంగు రేపర్ కాగితంపై పడింది. అది చుట్టచుట్టి ఉంది. ఏమిటో చూద్దామనుకున్నాడు కానీ.. అంతలో పక్కన నడుస్తున్న వ్యక్తి గబగబ రెండడుగులు వేసి వంగి దాన్ని తీశాడు.. సడెన్‌గా ఆయన వంగి కిందనుంచి ఏదో తీయడం గమనించి ఆ పక్కన వస్తున్న మరో పెద్దమనిషి అక్కడే నిలబడి ఆసక్తిగా చూస్తున్నాడు. వారితోపాటే తనూ!

గులాబీరంగు కాగితం చుట్టను విప్పాడు దాన్ని తీసినాయన. దానిలో కళ్లుమిరుమిట్లు గొల్పుతూ మూడంగుళాల పొడవైన బంగారం ముక్క!

అందరి కళ్లూ ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి..

ఏమీ ఎరుగనట్టు దాన్ని మళ్లీ గులాబీరేపర్‌లో చుట్టి జేబులో పెట్టేసుకోబోయాడు దాన్ని వంగి తీసుకున్న వ్యక్తి.

'అదేంటిసార్? దాన్ని మేమిద్దరం కూడా చూశాం.. మీరు గబగబ నడిచి తీసేసుకున్నారు. సొంతమైనట్టు జేబులో పెట్టేసుకుంటున్నారు?' అన్నాడు రెండో ఆయన కోపంగా. సపోర్టు కోసం మధు వంక చూసి కళ్లెగరేశాడు.

'అవున్సార్ ఇదన్యాయం.. అసలు నా కాళ్లముందు ఉందా కాగితం నేను తీయబోయేలోపే మీరు చెంగున దూకి తీసేసుకున్నారు..' మధు నిష్ఠూరంగా అన్నాడు.

అతను ఏం మాట్లాడకుండా బంగారు కడ్డీని జేబులో వేసుకుని మౌనంగా నడుస్తున్నాడు. అతని వెంటపడ్డారు వాళ్లిద్దరూ.

'సార్ ఈ పెద్దమనిషి ఇలా వినేలా లేడు.. పోలీస్ రిపోర్టు ఇద్దాం. ఆ తర్వాత వాళ్లే చూసుకుంటారు' అన్నాడు రెండో ఆయన.

'బెదిరిస్తున్నారా?' అన్నాడు మొదటి వ్యక్తి నడుస్తూనే. తర్వాత- 'అది నాకు దొరికింది.. అది నాదే' అన్నాడు కోపంగా.

'నీ ఒక్కడికే కాదు.. మా ఇద్దరికీ కూడా దొరికింది.. కాకపోతే నువ్వు పరుగెత్తి తీసుకున్నావ్?' గట్టిగానే తగులుకున్నాడు రెండో ఆయన. అంతటితో ఊరుకోకుండా-

'అందులో మాక్కూడా వాటా ఉంది.. అడగరేంట్సార్? ఊర్కుంటారేం? అది మన ముగ్గురి సొత్తు ఔనా?' మద్దతు కోసం మధును చూస్తూ అన్నాడతను.

చూస్తూ చూస్తూ అంత బంగారం ముక్కలో వాటాను వదులుకోవడం మధుకూ ఇష్టంలేకపోయింది.. తను కూడా వాదనకు దిగాడు మొదటి వ్యక్తితో.

మాటలు పెరిగాయి. వాకింగ్‌కు వచ్చిన వారంతా వాళ్లనే వింతగా చూస్తున్నారు..

వీళ్ల బాధపడలేక మొదటాయన రాజీకొచ్చాడు.. 'సరే గొడవచేయకండి.. నాకు సగం.. మీ ఇద్దరికీ సగంలో చెరో సగం.. ఓకే' అన్నాడు దయతలిచినట్టు.

వచ్చిందే చాల్లెమ్మనుకున్నాడు మధు. తను 'సరే' అనబోగా రెండో ఆయన అందుకున్నాడు కోపంగా 'ఏం పెద్దమనిషి వయ్యా? బిచ్చం వేస్తున్నావా? నీకు ఫిఫ్టీనా? మా ఇద్దరికీ కలిపి ఫిఫ్టీనా? ముగ్గురికీ మూడు సమాన వాటాలు ఇవ్వకుంటే నేనిప్పుడే పోలీస్ స్టేషన్‌లో రిపోర్టు ఇచ్చివస్తా' అని గర్జించాడు.

చాలాసేపు వాదోపవాదాలు జరిగాయి.

ఎట్టకేలకు మొదటాయన మూడు వాటాలకు ఒప్పుకున్నాడు.

బంగారుకడ్డీ బయటకు తీసి అరచేతులో పెట్టుకుని పైకీ కిందకూ ఊపుతూ 'ఎంత లేదన్నా ఇది ఏడు తులాలుంటుంది..' అన్నాడు.

'తరుగు బొరుగుబోనూ ఆరు తులాలు ఖచ్చితంగా ఉంటుంది' అన్నాడు రెండో ఆయన. ఆయన ముఖంలో విజయం గర్వం తొంగిచూస్తోంది. ఎంతసేపు ఎన్ని రకాలుగా వాదించాడు మరి!

'సరే నా రెండు తులాలకు పాతిక వేలిచ్చి, దీన్ని మీరిద్దరూ పట్టుకుపోండి' అన్నాడు మొదటాయన. ఆయన ముఖంలో అనవసరంగా వీళ్లకు వాటా







ఇచ్చానే అన్న బాధ స్పష్టంగా కనబడు తోంది.

'మా ఇద్దరికీ చెరో పాతిక వేలిచ్చి మీరే దీన్ని పట్టుకు పోండి' అన్నాడు రెండో ఆయన మొదటి వ్యక్తితో.

మళ్లీ వాదనలు.. నిజమే సడెన్‌గా అదీ పొద్దున్నే ఎవరి దగ్గర ముప్పైవేలుం టాయి?

పోనీ ఇది మీరు తీసుకుని మా ఇద్దరికీ డబ్బివ్వండి సార్' అన్నాడు రెండో ఆయన మధును చూసి.

'నా దగ్గర మాత్రం ఇప్పుడు అంత డబ్బె క్కడిది? ' మధు గొణిగాడు.

'సరే ఈ తలనొప్పంతా పడేలేనుగానీ సార్ మీ ఉంగరాలు ఒక్కోటీ రెండున్నర కాసులుంటాయా? ' అన్నాడు మొదటా యన మధు చేతివేళ్లకు ఉన్న ఉంగరాల్ని చూస్తూ.

'అబ్బే ఉండవండీ.. రెండేసి కాసులేనను కుంటా? ' అన్నాడు.

'ఒకటి నాకిచ్చేయండి.. ఈ కడ్డీని మీ ఇద్దరూ తీసుకుని పోయి పంచుకోండి.. నా దారిన నేను పోతా' అన్నాడు.

బంగారు కడ్డీని తనజేబులో పెట్టుకుని మధు అతనికి ఉంగరం ఇచ్చేయడంతో చిల్లర మనుషులంటూ అతను గొణు గుతూ వెళ్లిపోయాడు.

'మంచి పనిచేశారు. మనకు చెరోపావు కాసూ అదనంగా దక్కింది' అన్నాడు రెండో ఆయన సంబరంగా.

మధుకూడా మనసులో అదే అనుకుని సంతోషపడిపోతున్నాడు..

'కానీ సార్ నేనివ్వాళే అర్జంటుగా కాన్ఫ రెన్స్‌కోసం ఢిల్లీ వెళ్లాలి. తిరిగి రావడానికి వారం రోజులు పడుతుంది. ఈ పంపకం వ్యవహారం ఇప్పుడే తేలిపోతే బావుణ్ను..' అంటూ గొణిగాడు రెండో ఆయన.

'ఏంచేద్దాం చెప్పండి? ' అడిగాడు మధు.

రెండు నిముషాల తర్వాత ఆయనే- 'సరేసార్! నేను మనుషుల్ని నమ్ముతాను.. మనిషిని మనిషి నమ్మకపోతే మనుగడే లేదు.. మీరు జెంటిల్మన్‌లా ఉన్నారు.. మీ ఫోన్ నెంబరు ఇవ్వండి.. ఇప్పటికిమటుకు నాకో ఉంగరం ఇచ్చేయండి. బ్యాలెన్స్ డబ్బు ఢిల్లీనుంచి వచ్చాక తీసుకుంటాను. ఎందుకంటే నాకెక్కువ టైంలేదు.. ఇంటికె ళ్లాలి. తయారై ఏర్‌పోర్టుకెళ్లాలి' అన్నాడు.

ఉంగరంతోపాటు మధుఫోన్ నెంబరు తీసుకుని అతను చకచక వెళ్లిపోయాడు.

వాళ్లిద్దరూ వెళ్లగానే జేబులోంచి బంగా రుకడ్డీ తీసి చూసుకుని మురిసిపోయాడు. నడుస్తున్నాడేకానీ రెక్కలతో ఆకాశంలో ఎగురుతున్నట్లుంది. ముప్పైవేలికి దాదాపు ఎనభైవేల సొత్తు దొరికింది.. మళ్లీ రెండో వాడికి వాటా పెట్టడం ఇష్టంలేకే కావాలని తను ఫోన్ నెంబరు కూడా తప్పు చెప్పాడు.

★ ★ ★

ఆనందం పట్టలేక 'యాహూ..' అని ఒక్కపెట్టున అరిచాడు రామ్.

తర్వాత మధు భుజాలు పట్టుకుని కుది పేశాడు.

'ఇప్పుడు మనం సికింద్రాబాద్‌లో తెలి సిన గోల్డ్ షాప్ ఉంది దీని వాల్యూ ఎంతో వేయిద్దాం.. ఇవ్వాళ సాయంత్రం రీగల్‌బార్‌లో బీర్‌పార్టీ.. మర్చిపోకుండా రా' అన్నాడు మధు నవ్వుతూ.

పదినిముషాల్లో ఇద్దరూ జనరల్‌బజార్ లోని గోల్డ్‌షాపులో ఉన్నారు. షాపతను వాళ్లిచ్చిన ముక్కను అటూ ఇటూ తిప్పి చూసి నవ్వాడు.. తర్వాత 'ఇదొట్టి చీప్‌గో ల్డ్‌కోటెడ్ రాగిముక్కసార్..' అంటూ చేతికి కూడా ఇవ్వకుండా మిత్రుల కాళ్ల ముందు పడేట్టు విసిరేసి తనపనిలో నిమ గ్నమైపోయాడు.

–చంద్రప్రతాప్

# మనసున ఉన్నదీ...



★ నవంబరు చతుర నవల 'మొగ్గ' బాగుంది. అయితే ఈ నవలలో బాలకార్మిక వ్యవస్థకు పరిష్కారం చూపించలేకపోయారు. నరక కూపంలాంటి హాస్టళ్లకన్నా వెట్టి చాకిరియే మేలని లక్ష్మి చెల్లెలు పార్వతి పాత్ర ద్వారా సూచించారు. ఇంతకన్నా ఈ సమస్యకు సానుకూల మార్గం లేదా? సరైన పరిష్కారాన్ని సూచించిఉంటే బాగుండేది. టాంక్‌బండ్ కథ, అపార్ట్‌మెంటాలజీ బాగున్నాయి.

*–ఎ.రామారావు, లలితా నగర్, విశాఖపట్నం*

★ వర్తమాన సామాజిక వాస్తవ పరిస్థితుల్ని అద్భుతంగా చిత్రించిన రచయిత సి.హెచ్. వెంకటేశ్వర రావు నవల 'మొగ్గ' ఆద్యంతం ఆసక్తిగా చదివించింది. ఏ పూటకా పూట కూటికోసం పని వెదుక్కునేవారు, పని దొరికితే తిని, దొరక్కపోతే పస్తులు ఉంటూ ఆకలికి అలమటించే బాధాసర్పదష్టులు కోట్లాది మంది ఉన్నారు. అరవయ్యేళ్ల స్వాతంత్రం తర్వాత కూడ ఇలాంటి దుస్థితి ఉంది. 'ఇది దేవుడి పాలన' అని ఈనాటి పాలకులు సిగ్గు విడిచి చెప్పుకుంటున్నారు. దేవుడా! ఉన్నావా... వింటున్నావా?

**– పారుపల్లి వెంకటేశ్వర రావు,** హైదరాబాద్

★ అమ్మ మీద అలిగిందా అన్నట్టుగా ఉన్న 'హర్షిత' ముఖచిత్రంతో నవంబరు చతుర నవల 'మొగ్గ' ప్రస్తుత పరిస్థితులకు దర్పణంగా నిలిచింది. 'నివాళి' ద్వారా శ్రీకాకుళంలో పుట్టిన రావిశాస్త్రిగారిని మరోసారి మా జ్ఞాపకాల్లో నిలిపారు. కొత్తగాలితో పాటు అక్కడక్కడ అందిస్తున్న హాస్యపు చెణుకులు మాకు నచ్చుతున్నాయి. ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదిక ఓ చక్కని అంశం. కత్రినా కైఫ్ ఆరోగ్య రహస్యం కూడా బాగుంది.

**– నేమాన సుభాష్ చంద్రబోస్,** శ్రీకాకుళం.

★ 'కొత్తగాలి' శీర్షికతో ఎంతోమంది రచయితలను ప్రోత్సహిస్తున్నందుకు అభినందనలు. నవ కవుల కాల్పనిక, రచనా పటిమను బయటపెట్టే ద్వారంగా మన చతుర నిలబడటం నాకెంతో ఆనందంగా ఉంది.

**– యలమర్తి అనురాధ,** పెనుగొండ,

★ యర్రంశెట్టి సాయి అపార్ట్‌మెంటాలజీలో ప్రతినెలా ఒక విచిత్రమైన సందర్భాన్ని ఆవిష్కరిస్తున్నారు. 'ఎన్నికల కలం'లో రాజకీయ పార్టీల అమలు చేయలేని హామీల హాలాహలంపై బాగా రాశారు. చతురకతల్లో 'కరెంటుకోత' ఆడవాళ్లకు మంచి షాక్ ఇచ్చింది. ట్యాంక్‌బండ్ కథ కూడా చాలా బాగుంది. ఇక 'మొగ్గ' నవలలో ప్రస్తుత సామాజిక వాతావరణాన్ని గొప్ప వాస్తవికతను జోడించి చిత్రించారు.

**–సి.హెచ్. శకుంతల,** నిజామ్‌పేట రోడ్, హైదరాబాద్

★ కథ వెనుక కథలో 'అక్షింతలు' గురించి చెప్పడం బాగుంది. ఆ కథను నేరుగా చదవనందుకు చింతిస్తున్నాం. సి.హెచ్. వెంకటేశ్వర రావు 'మొగ్గ' నవలలో దిగజారిపోతున్న మానవత్వాన్ని, మాయమవుతున్న నైతిక విలువల్ని రచయిత అద్భుతంగా ఆవిష్కరించారు. చదువు నేర్చుకోవాల్సిన చిట్టి లక్ష్మి పడ్డ కష్టాలు కన్నీళ్లు తెప్పించాయి. నవంబరు నవల 'మొగ్గ'కు ముఖచిత్రం బాగా నప్పింది. నేటి ప్రభుత్వ పాలనా వ్యవస్థ తీరు తెన్నులను నవల ప్రతిబింబించింది.

**– ముమ్మిళ్ల వందన,** కిషన్‌పుర, హన్మకొండ

★ ప్రతినెలా చతుర మమ్మల్ని బాగా అలరిస్తోంది. ప్రతి ఐటమ్‌నూ ఆద్యంతం ఆసక్తిగా చదువుతున్నాం. ఎన్నెన్నో మంచి శీర్షికలు, ఉత్తమ నవలను అందిస్తున్న సంపాదకవర్గానికి అభినందనలు.

*–ఎన్. హేమగిరిబాబు, తిరుపతి*

---

చిరునామా: మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ –500 082

ఈ మెయిల్ చిరునామా: chatura@eenadu.net

 # చతుర ప్రవేశిక 

## డిసెంబరు - 08

డిసెంబరు 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయగలరేమో ప్రయత్నించండి. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం.

1. నారాయణ భార్య?
2. శీను దోస్తు ఎవరు?
3. ఉరిబోసుకుని చనిపోయిందెవరు?
4. నారాయణ బోరు పక్కనే బోరు వేసింది?
5. బోర్లు బాగుచేసే వ్యక్తి పేరేంటి?
6. ప్రియాంక తండ్రి పేరు?
7. శంకరమూర్తి కొన్న కారు ఖరీదు?
8. చాప్లిన్ హిట్లర్‌ను విమర్శిస్తూ తీసిన సినిమా?
9. అంటరాని వసంతం రచయిత?
10. మధు ఏం పోగొట్టుకున్నాడు?

పంపినవారి పేరు: -------------------------- వయసు (    )

చిరునామా: ----------------------------------------

----------------------------------------------------

పిన్‌కోడ్: ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

ప్రవేశికలకు చివరి తేదీ 16

నోట్ : చతుర ప్రవేశిక, విపుల వినోదిని ఒకే కవరులో పంపవచ్చు.

Owned, Printed, Published and Edited by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28232390; Bangalore:25583804. & www.eenadu.net.




భారతీయ సాహిత్యంలో
సమున్నతం జ్ఞానపీఠం!
సాహితీకృషీవలుల అవిశ్రాంత
అక్షరసేద్యానికి
అజరామర పురస్కారం జ్ఞానపీఠం!!
ప్రారంభించిన నాటినుంచీ నేటివరకూ
దాదాపుగా ఏడాదికో సాహితీరత్నాన్ని
అక్కున చేర్చుకుందీ పీఠం!
ఈ పీఠాన్ని అధిరోహించిన ఎందరో
అక్షర నిర్మాతలు
మనకు సదా స్ఫూర్తిదాతలు...

త్వరలో మీకోసం **చతుర** లో
మరో కొత్తశీర్షిక



CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2006-2008 RNI/32186/78